

సంపుటము 24
సంచిక 12

# భారతి

డిసెంబరు 1947
సర్వజిత్తు, కార్తికము

## గోవర్ధన సుభాషితములు




— శ్రీ పల్లె పూర్ణప్రజ్ఞాచార్యులు —

ఏది యన్యుని నోట దుస్స్వాద మగునో
అదియె ప్రియునోట రాఁ బరిహాస మగును;
ధూమ మగు నితరేంధనోద్భూత మేని
అదియె యగరూదితము ధూప మగునుగాదె?

కొండెగాఁడు ధనముఁ గొల్లగొట్టు కంటె
బాధ పెట్టు మదిం గటుభాషలాడి;
ఒడలినుండియు నెత్తుటి నొడుచుకంటెఁ
బీడపెట్టును చెవుల గీపెట్టి దోమ.

కష్టజీవనులై రోజు గడుపుచున్న
ఎప్పుడుఁ బరోపకారులే గొప్పవారు;
తృణములే జీవనముగ వర్తించుచున్నఁ
[illegible]యలు సతతంబు దానార్ద్రకరములె గద?

ఒకటె చాలు నాకర్షణయోగ్యగుణము
వింటికిం [illegible] లక్ష్మీలబ్ధికి ధరిత్రి;
[illegible]త వే[illegible] లూతాతంతువుల విధానఁ
[illegible]కునిగెడు గుణము లనేక మున్న?

కాలుతురు మలినతను వైదగ్ధ్యమునను
దీపదశయును గులయువతియు ధరిత్రి;
పోలుచు దోషాళి యేనియు భూషణముగ
విత్తమత్తేభయానకు విధుని కళకు.

సజ్జనుండు దుష్టసహవాసమునఁ గూడ
శీలసంపదలను గోలుపోఁడు;
సర్వపర్వములను భానుఁ గూడియుఁ దొంటి
చలువతోనె వెలుఁ జందమామ.

ధర్మకార్యాచరణదృష్టి దుర్మతులకుఁ
గేవలంబును బరహింసకే ఘటిల్లు;
కాకములకు నదీస్నానకరణవాంఛ
కలుగుట దలంప వర్షవిఘాతమునకె.

స్వీయకాయనిర్విశేషంబుగాఁ జూచి
కొంచు సార మెల్ల గుంజి, తుదకు
భుజగి కంచుకమ్ము, భోగాంగనయు జార
పురుషు, విడిచిపెట్టు కరుణ లేక.

కట్టఁబడఁగాక శైలసంఘములచేతఁ,
గోలుపడఁ గాక సిరు లొక్క కొండకతన,
అయిన నేమి? పురందరుం డశని మెత్త
శైలములఁ గాచు నెవఁ డొక్క జలధిగాక?

దినములో నింగి నొక కుంటి తిరిగి వచ్చు;
క్షోణి యొక పొట్టివాని యడుగునకె లొచ్చు;
అబ్ధియుం బోతలంఘ్య మే మంత హెచ్చు?
సాధుమన సింక దేనఁ బోల్పంగ వచ్చు?

గొనములను లక్ష్మి మెన్నేనిఁ గూర్చు,వాని
గెంటివైచు నలక్ష్మి బల్ కంటగించి;
పూర్ణనిధుఁడు సువృత్తుఁడై పొలుచు, క్షీణ
చంద్రుఁ డెప్పుడు వక్రతఁ జాటుచుండు.

కైతవస్నిగ్ధములును వక్రములు కర్ణ
లగ్నములు నతిమాలిన్యలాంఛితములు
ఖలసమూహంబులును భోగకామినీదృ
గంచలము లెవ్వరిని మోసగించలేవు?

స్నేహమయపీడనమునకు సిద్ధపడెను
తిలఘానికిఁ జక్ర మెందుఁకుఁ జెప్పుఁడి?
కుమ్మరికిఁ జక్ర ముండినఁ గొంత యొప్పు
ఎట్టి పార్థివకోటినే నిట్టె త్రిప్పు.

సంభవము కాదు కాదు రక్షణము క్షేమము
సరసఁకు జన్మచంచలచరితలకును;
అనుభవింపదె హరు నుత్తమాంగమందె
గంగయంతటిదె భుజంగసంగమంబు.

మధురములు మొదలఁ నడుమఁ జివరను
కితవసహవాసము వయస్సు గ్రీష్మదినము;
ఆదిమధ్యావసానంబులందు నొక్క
రీతి మధురంబు సుజనసౌహృద మొకండె.

కలయకుండనె హృదయముల్ మెలఁగుటలను
గోప్యముల దాచుటల శంకగొలుపుటలను
కలదు దగ్గతి చుట్టరికము జగాన
ఖలుల చెలిమికి ముగ్ధల కౌఁగిళులకు.

తాపమును బెంచ, మూర్ఛల దాపరింపఁ,
గంప మొదవింపఁ, బ్రాణులఁ గడకుఁ జంపఁ
జాలు నంతటిపైకిఁ బోఁ జాలు జగతి
జ్వరవిభు తివిధాన దుర్జనవిభూతి.

చాల శోభిల్లు విద్య సజ్జనులయందు
రవయు రక్తికి రాదు దుర్జనులయందు
గ్రద్ద నతిదూరదర్శిగా గణనఁ జేసి
అగ్రతాంబూల మెవ రిచ్చి యాదరింత్రు?



# ద్రావిడభాషలలోని కొన్ని వింత యక్షరములు-వాని పరిణామము

— శ్రీ కోరాడ రామకృష్ణయ్య —

ఆంధ్ర వైయాకరణులు ఆంధ్రవర్ణసమామ్నాయమునుగూర్చి తెలుపుచు "ఎ, ఒ, చ, జ, ఱ, ఁ" - అనునవి తెనుగునకు ప్రత్యేకములగు వర్ణములని చెప్పియున్నారు. "ఆంధ్రము, తెనుగు ఒకటి కాదా, తెనుగునకు ప్రత్యేకవర్ణములని చెప్పుట యేమి" అను ప్రశ్న కలుగకమానదు. సహజముగ దక్షిణదేశీయమగు తెనుగుభాషలో సంస్కృతభాషాపదములు కొన్ని దేశీయోచ్చారణసంప్రదాయానుకూలములగు మార్పుల నొందకయే చేరినప్పు డట్టివానిని వైయాకరణులు తత్సమశబ్దములని నామకరణము చేసిరి. వీనిమూలముగ దేశీయమగు తెలుగుభాషలో లేని వర్ణములు కొన్ని యందు చేరుట తటస్థించినది. వైయాకరణు లాంధ్రభాష సంస్కృతభాషకు వికృతి యను దృష్టితోనే దీనిని వ్యాకరించి యనుశాసనము చేయగడగినవారగుట చేత, ఆంధ్రభాషకు వర్ణము లేబదిరెండని (ఏబది యారని కొందరు), అచ్చతెనుగునకు వర్ణములు ముప్పదియేడని (ముప్పదియారని కొందరు), సంస్కృత ప్రాకృతములలో లేని తెలుగక్షరములు ఎ, ఒ, చ, జ, ఱ, ఁ- అనునవని చెప్పకొనగిరి. వర్ణముల విషయమున వలెనే ఆంధ్రభాషనుగూర్చి తెలుపుచు, నది తత్సమము, తద్భవము, అచ్చతెనుగు, దేశ్యము, గ్రామ్యము అని అయిదువిధములనికూడ చెప్పిరి. ఇట్లు ఆంధ్రభాష, అచ్చతెలుగు అను విభాగము వైయాకరణులు కల్పించినదే[illegible]ని ఆంధ్రము-లేదా తెలుగు అనునది [illegible]కభాషయేగాని రెండుగా విభాగింపదగినది [illegible]రిత్రకపరిస్థితులనుబట్టి— అనగా నాత్తరాహులగు వాంధ్రజాతివారు దక్షిణదేశమునకు వలసవచ్చి కృష్ణాగోదావరీమధ్యదేశమునందలి తెలంగుజాతివారితో గలిసిపోయి యచ్చట నెలకొనియుండి, కాలక్రమమున సామ్రాజ్యస్థాపకులై మహత్వమును బడసిన కారణమున నీ దేశీయభాషకు రెండు పేర్లు కలుగుట తటస్థించెనేగాని, యీ భాషను వ్యాకరించి యనుశాసనము చేయునపు డీ విభాగమున కావశ్యకతయే కానరాదు. ఇటీవలికాలమున మహమ్మదీయులు, ఆంగ్లేయులు నీ దేశమున రాజ్యముచేసిన కారణమున వారి భాషలలోని పదము లీ భాషలో చేరినట్లే ప్రాచీనకాలమున సంస్కృత ప్రాకృతపదములు నిందు చేరినవి. పైభాషలలోనివానికంటె సంస్కృతశబ్దము లిం దెక్కువగా జేరియుండవచ్చును. ఎన్నిభాషలనుండి యెన్నిపదములు చేరినను అవి యన్నియు నిందు లీనమై తెలు గొకే భాషగా నేర్పడినది. "తల్లి సంస్కృతంబె యెల్ల భాషలకును" అని దానియందలి గౌరవముచే జెప్పిన కేతనకూడ, "దానివలన గొంత గానబడియె, గొంత తాన గలిగె, నంతయు నేకమై తెనుగుబాసగాగ విమతికెక్క" అని తెనుగునకే ప్రాధాన్య మిచ్చినాడుగాని "ఏషా తయో ర్భవే ద్వికృతిః" అను భావమును సూచింపనైన లేదు. ఈభాష వికృతి యని తలచుటచేతనే వైయాకరణు లాంధ్రమని, అచ్చతెనుగని విభాగము చేయవలసినవారైనారు. ఇతరభాషాపదములను గ్రహించినపుడు తమ[illegible] మునకే నీ భాష స్వీయోచ్చారణసంప్రదాయానుగుణ[illegible] మార్పులకు లోనగునట్లు చేయకయే కొన్ని శబ్దములను గ్రహించియుండుటచేత, తత్తద్భాషావర్ణములు, నచ్చా

రణరీతులు నిండగపడుచున్నవిగాని, యీ భాష వాస్తవముగా ప్రాకృతమువలె సంస్కృతభాషాభవమే యైనట్లయితే, యీ దేశ్యము, అచ్చ తెనుగు-అనుదానిలో గూడ నా వర్ణములు, స్వరసంప్రదాయములు, ముఖ్యముగా వ్యాకరణరీతులు మొదలగున వన్నియు నెలకొని యుండవలసినదేగదా. దేశభాషయగు తెలుగులో నివి యన్నియు వానికి భిన్నములయియేయున్నవి. కావుననే వర్ణములవిషయములోగూడ ఎ, ఒ, చ, జ, ఱ, ఁ- అనువానిని సంస్కృతప్రాకృతములలో లేని తెలుగక్షరములని ప్రత్యేకముగా వారు పేర్కొనవలసినవారైనారు. ప్రకృతిలో లేనివి వికృతిలోమాత్ర మెట్లు వచ్చిన వను ప్రశ్న కింకను వారు సమాధానము చెప్పవలసివచ్చినది. సంస్కృతమున గానరా వని చెప్పబడిన యీ వర్ణములలో మొదటి నాలుగును ప్రాకృతములలో గానవచ్చుచునేయున్నవిగావున, నదియు రెండవ ప్రకృతియని, దానినుండియే తెలుగున నవి సంక్రమించి యుండు నని యొక సూచనకూడ కలదు. ఈ వర్ణములో నేవియు సంస్కృతమున లేవనుట సుప్రసిద్ధమే. అయినచో సంస్కృతభవములేయగు ప్రాకృతములలో మాత్ర మివి యెట్లు వచ్చిన వను ప్రశ్న కలుగకపోదు. విజాతీయములగు ద్రావిడభాషలనుండియే కొన్ని వర్ణములు ప్రాకృతములలోను చేరియుండవచ్చునుగదా. వాస్తవముగా నివి దేశీయభాషోచ్చారణసంప్రదాయమునకు జెందినవే. సంస్కృతశబ్దములను భిన్నోచ్చారణసంప్రదాయములు గల దేశీయులు తమ యుచ్చారణ పరిపాటినిబట్టి పలుకునపుడు ఈ మొదటి నాలుగువర్ణములను ప్రాకృతభాషలలో నుద్భవించినట్లు ఈ క్రింది యుదాహరణములనుబట్టి వ్యక్తము కాకపోదు.

సం. ప్రేక్షతే —ప్రా. పెచ్ఛఇ
,, సాగరఇతి — ,, సాగరెత్తి
,, శైల — ,, సెల్ల
,, చైత్ర — ,, చెత్త
,, వైద్య — ,, వెజ్జ (cf- తె. వెజ్జు)
,, మౌక్తిక — ,, మొత్తియ
,, ఓష్ఠ — ,, ఒట్ఠ

దక్షిణదేశభాషలలో ఐ, ఔ అను సంయుక్తాక్షరములు లేవు. అవి అ ఇ, అ ఉ- అని విడి యక్షరములుగనే పలుకబడును. దీనినిబట్టి దక్షిణదేశభాషలలోవలె ఎ, ఒ- లు ప్రాకృతములలో సహజములు కావనియు, ఏ, ఐ, ఔలు మొదలగు ధ్వనులు గల శబ్దములను దేశీయు లుచ్చరించుటలో గలిగిన మార్పులవలన నేర్పడిన వనియు వ్యక్తము కాకపోదు. చ, జ లు తక్కిన దక్షిణదేశభాషలలో లేవు. తెలుగుతోపాటు మహారాష్ట్రిలోను, మరికొన్ని యాధునికార్యభాషలలోను గనబడుచున్నవి. ఇవియు కొన్ని సంయుక్తాక్షరములతో గూడిన సంస్కృతశబ్దముల నుచ్చరించుటలో గలిగిన మార్పువలన నేర్పడినట్లే తోచుచున్నది. ప్రాకృతములో చ, జలు మాత్రమేగాక, వానికి సంబంధించిన మహాప్రాణములగు ఛ, ఝలుకూడ గానవచ్చుచున్నవి. ఇవి దక్షిణదేశీయభాషా సంప్రదాయవిరుద్ధములగుటచే గాబోలు తెలుగులోనికి రాలేదు.

సం. కక్ష—ప్రా. కచ్ఛ; అక్ష—అక్ఖ, అచ్ఛ; సత్య—సచ్చ; నిత్య—నిచ్చ, నిచ్చ; ద్యూత—జూద; యౌవన—జొవ్వణ; ధ్వని—ఝుణి మొ.

ఇట్లు సంస్కృతమున సహజముగలేని యీ ధ్వనులు సంస్కృతశబ్దములలోని కొన్నిధ్వనులను దేశీయు లుచ్చరించు సందర్భమున ప్రాకృతభాషలలో నేర్పడిన వని చెప్పదగియుండగా, నవి ప్రాకృతములనుండియే దేశభాషలలో సంక్రమించిన వనుట యుక్తిసహముగా గనబడదు. ఎ, ఒ లు ఒక్క తెనుగున నేకాక తక్కిన దక్షిణదేశీయభాష లన్నిటియందును అతి ప్రాచీనకాలమునుండియు గానవచ్చుచున్నవి. సంస్కృతాది ప్రాచీనార్యభాషలలో లేని వగుటచే ప్రాకృతములలో దేశీయసంప్రదాయము ననుసరించియే చేరిన వనుట యుక్తముగదా.

ఇక శకట[illegible] రేఫయుగాని, [illegible] సంస్కృత ప్రాకృతములం దున్నట్లుగాని, వానినుండి సంక్రమించి నట్లుగాని చెప్పుటకైన నవకాశము లేదు. కా[illegible] [illegible]యైనను అచ్చ తెనుగునకు సహజము లని చె[illegible]

గదా. ఇదిగాక, నన్నయకుపూర్వమున గల శాసనముల లోని తెలుగుభాషాస్వరూపమును మనము గుర్తించినచో దక్షిణదేశీయభాషాసహజమగు 'ఱ' అను వింత యక్కరముకూడ నొకటి యీ భాషలో గల దని వ్యక్తముకాకమానదు. ఇంతేకాక ప్రాచీనభాషలోని పదాంతనకార మొకటి శకటరేఫ మాతగా గొని 'న్ఱ' అను మరియొక వింత యక్కరముగా మారి నన్నయకు పూర్వమున గల భాషలో గానవచ్చుచున్నది. వీని పూర్వచరిత్ర నించుక పరిశీలించినచో నితర దక్షిణదేశ భాషలతో దెనుగునకు గల సంబంధము వ్యక్తమగుటయే కాక, యీ భాష కాలక్రమమున నెట్లు మారుచు వచ్చినదో తెలిసికొనుటకు నవకాశ మేర్పడును. ఈ వర్ణములు కొన్ని నన్నయకాలమునకే—లేదా నన్నయ చేసిన యనుశాసనముచేతనే—యంతరించి, మారిపోయి యుండుటచే తరువాతి లాక్షణికుల దృష్టిపథమున బడుట కవకాశమే లేకపోయినది. నన్నయకు పూర్వమునందలి యాంధ్రభాషాచరిత్ర నన్వేషించుటచేతను, ఇతర సన్నిహితభాషారూపములతో బోల్చి పరిశీలించుటచేతను మనము వాని స్వరూపలక్షణములను గొంత గ్రహింపగలుగుదుము.

శకటరేఫము:—ఇది సంస్కృతప్రాకృతములందు లేకపోవుటయేకాక, యితరదక్షిణదేశభాషలతోపాటు ఇప్పటివరకు ఆంధ్రమునను నిలిచియున్నది. ప్రాచీన కవులు భాషలో దీని విలక్షణత్వమును గమనించి దీనిని శ్రద్ధతో పాటించుచు వచ్చిరి. కాని మధ్యకవుల కాలములో నిది రేఫముతో గొంత సాంకర్యము బొందుటచే నప్పకవ్యాదిలాక్షణికులు నీ రేఫముతో గూడిన శబ్దముల పట్టికను సిద్ధముచేయవలసినవా రైనారు. ఇటీవల నుచ్చారణమున దీని విలక్షణత్వము పాటింపబడకపోవుటచే వ్యవహారమునను, వ్రాతలోనుగూడ నిది క్రమముగా నంతరింపజొచ్చినది. ఇతరదక్షిణదేశభాషలలో నుచ్చారణమున దీని విలక్షణత్వ మిప్పటికిని బాగుగనే పాటింపబడుచున్నది. దీనితోపాటు ముఖ్యముగా గ్రహించి పరిశీలింపదగినది 'అ' న్నకరమనునది. ఇది దంత్యనకారముకంటె భిన్నమైన దగుటచే తమిళ భాషలో అన్నకర మనియు, పదాంతనకారమనియు చెప్పబడును. తమిళమున ప్రాచీనవ్యాకరణమగు 'తొల్కాప్పియము'న 'క, చ, ట, త, ప, ఱ' - అను నారక్షరములు 'వల్లెళుత్తు', అనగా పరుషము లనియు, ఙ, ఞ, ణ, న, మ, న్ (పదాంతనకారము) అనునవి వరుసగా తత్స్థానీయములే యగు 'మెల్లెళుత్తు'(అను నాసికసరళవర్ణము)లనియు చెప్పబడియుండుటచేత 'ఱ కారము, పదాంతనకారము నేకస్థానీయములే యని వ్యక్తమగుచున్నది. వీని యుచ్చారణమునుగూర్చి యందిట్లు చెప్పబడినది:

"అణరి నునినా అణ్ణం ఒట్ట
అఃకానః కాఱ ఆయిరణ్డుం పిఱక్కుం"

అనగా జిహ్వాగ్రము పైకి పోయి అణ్ణమును—దంతములపై నున్న కఠినతాలువును ఒత్తినచో ఱకార నకారము లను రెండు వర్ణములు పుట్టునట. దీనినిబట్టి యీ రెంటికి ననునాసికానునాసికభేదముతప్ప స్థానప్రయత్నములలో భేద మేమియు లే దని తెలియుచున్నది. ఈ స్థానమున జిహ్వాగ్రముచే నొత్తుటలో కంప మించుక గలిగినచో 'ఱ' కారము, కంపము లేనిచో 'ట' కారమును వినబడును. కావుననే యీ పరుషరేఫము (దీనినే 'వల్లినం' అని తమిళమున చెప్పుదురు.) తెనుగులిపిలో బండిచక్రములను బోలియుండుటచే నిది శకటరేఫమైనది. ద్విత్వమును బొంది ఒత్తి పలుకబడినపుడు 'ట్ర'వలె ధ్వనించుటేగాక, కొంత కాలమున కా ద్విత్వవర్ణము కంపమును గోలుపోయి కేవలము 'ట్ట' (ద్విత్వటకారము)వలె పలుకబడుట తటస్థించినది. ఇట్లే దంతమూలముపైని గల కఠినతాలువునందు జిహ్వాగ్రస్పర్శముచే నేర్పడిన ధ్వనులకు ప్రాచీనప్రాతిశాఖ్యలలో 'వర్త్స్య'ము లనియు, నాంగ్లమున 'Alveolar Scunds' అనియు సంకేతము కలదు. ఇవి మూర్ధన్యము లగుట వర్ణాక్షరములకంటె భిన్నములు. ఱకారస్థానీయమగుటచే నీ'న'కారమును తమిళమున అన్నకరమందురు. ఱకారమునకు విలక్షణమగు నీ యుచ్చారణ మీ భాషలలో చిరకాలమువరకు నిలిచియున్నను, తెలుగు కన్నడములలో నీ నకారము మాత్ర మంతరించినది. ఆంగ్లమునందలి 'Then'

అను పదములో వలెనే యీ భాషలో నిది పదాంతమందే వచ్చుచుండుటచే దంత్యనకారముకంటె భిన్నమని సూచించుటకుగా దీనిని పదాంతనకార మని వైయాకరణులు తెలిపిరి. తొమ్మిది నపుంసకలింగశబ్దములలోమాత్రమే యీపదాంతనకారము మకారముగా మారదని తొల్కాప్పియర్ చెప్పియున్నాడు. కాని యాతడా శబ్దములను దెలిపియుండలేదు. అట్టి వింకను భాషలో గలవని వ్యాఖ్యాతలు అభిప్రాయపడినారు. సామాన్యముగా పదాంతమునందలి యీ నకారము పుంలింగద్యోతకము. అవన్, మగన్, వణ్ణన్, ఉడయవన్, చోళన్ మొదలగు శబ్దములలోని తుది 'అన్' అనునది పురుషవాచకచిహ్నము. కన్నడమున నీ చిహ్నము లోపించినది. మగ-మగు అనునదే పురుషవాచకశబ్దము. ఈ శబ్దము పుత్రవాచకము నైనది. కాని స్త్రీద్యోతక మైనపుడు 'అళ్' ప్రత్యయము చేర్పబడుచున్నది. మగళ్ = పుత్రిక. 'అవన్' అనునది 'అవను' అనియేగాక 'అవం' (ఇగం) అని మకారాంతముగను కన్నడమున గనబడుచున్నది. ఇదిగాక యీ భాషలో 'అవందిరు' అను నొకటికూడ కనబడుచుండుట యొక విశేషము. (cf. తె. అవన్డు-వాన్డు-వాణ్డు-వాఁడు)

ఇక తెలుగుభాషలో దీనికి గలిగిన పరిణామము చిత్రమైనది. సామాన్యముగా ప్రాచీనభాషలో హలంతములైన యనేకశబ్దము లొకకాలమున నీ భాషలో గలిగిన స్వరచలనము (Shift of Accent) మూలముగా తుది నొక 'ఉ' కారము నూతనగా గ్రహించి తెలగులో నజంతశబ్దములైనవి. అట్లే యీ నకారాంతశబ్దములు కూడ తుది నొక ఉకారము నూతగా గ్రహించినపుడు దానిని స్వరయుక్తముగ బలుకుటచే నీ తుది యుకారము కొంత ఒత్తిపలుకబడుట, తన్మూలమున ననునాసికా ద్వారము మూతపడి యా స్థానమున నకారస్థానీయమే యగు పరుషధ్వని-అనగా కంపము లేని 'ఱ' కారము వంటిది 'వర్త్స్య' టకారము ధ్వనించుట తటస్థించి యుండును. అప్పు డంతకు బూర్వమున ధ్వనించిన యనునాసికముతో నీ వర్త్స్యటకారము గూడుటచే న్టు-న్డు వంటి ధ్వని యేర్పడుచున్నది. ఈ 'న్డు' అను దానిలోని 'ఱ' అనునది శకటరేఫస్థానీయమేగావున వ్రాతలో దానిని సూచించుటకుగాను శకటరేఫమునే కొంత పోలినను, దానికంటె నించుక భిన్నమైన ഩ వంటి నూతనలిపి నొకదానిని ప్రాచీన వేంగీచాళుక్యలిపి కర్తలు కల్పించినారు. ఆ ప్రాచీనశాసనములలో నీ వర్ణము మన్టు, అచ్చినవాన్టు, పాతకున్టు, శత్యదిదున్టు మొదలగు శబ్దములలో నకారముతో సంయోగము గలిగినపుడే కానబడుచున్నది. ఇది వాస్తవముగా శకటరేఫస్థానమునదే పుట్టినను, శకటరేఫమునకు గల కంపముతోనో, ఆ కంపము లేకనో 'వర్త్స్య' 'ఱ' కారముగా బలుకబడియుండును. శకటరేఫము ద్విత్వము నొందినపుడు 'ట్ర్'వలె పలుకబడుచుండుట తమిళమున నిప్పటికిని సుప్రసిద్ధమే. అట్టి రూపములే కాలక్రమమున నందలి కంప మంతరింపగా కేవలము 'ట్ట'కారముతో గూడినవిగా తెనుగున గనబడుచున్నవి. cf — చిఱు + ఎలుక = చిఱ్ఱెలుక, చిట్ర్రెలుక, చిట్టెలుక; పుట్టుసురు ఇత్యాదులు. వైయాకరణులు వీనినే ద్విరుక్తటకారవిధానముచే సాధించినారు. ఇందలి 'ట్ట'కారము మూర్ధన్యటకారముమాత్రము కాదు. మూర్ధన్య డకార మాకాలమున 'ఱ' అను గుర్తు గలదై ప్రత్యేకముగ నుండెడియున్నది. కావున పదాంతనకారము క్రిందవచ్చిన వర్త్స్య'ఱ'కారమును సూచించుటకే ഩ యీగుర్తు కల్పింపబడిన దనుట స్పష్టము. రాతిమీద చెక్కు సందర్భమునుబట్టి దీనికి స్వల్పభేదము కలిగిన రూపము లేర్పడినవి. పొట్లచెర్వు శాసనములోని 'అచ్చిన వాన్డు' అనుదానిలో నిది ఱ అను రూపము కలదై యున్నది. 'పాతకన్డఱా' అనుచో ఱ నిట్లున్నది. కాని దీని సామాన్యస్వరూపము ఱ యని గ్రహింపవచ్చును. మొత్తముమీద నిది యా కాలపు మూర్ధన్యడకారమునకు 'ఱ'కారమునకు గొంత పోలిక గలదై యుండెననుటకు సందేహము లేదు. కాని మనము ప్రధానముగా గుర్తింపవలసిన విషయ మేమనగా, తెలుగులో నకారము క్రిందమాత్రమే యీ చిహ్నము కనబడుచున్న దనుటయే. దీనినిబట్టి ప్రాచీనభాషలోని పదాంతనకార మీ భాషలో వాన్డు, మగన్డు మొదలగు కొన్ని రూపములలో గొంతకాలమువరకైనను నిలిచియున్నదని

మనము గ్రహింపవచ్చును. కాలక్రమమున నీ అకారమునకును, మూర్ధన్యడకారమునకు నభేద మేర్పడి యీ నకారముకూడ మూర్ధన్యణకారముగా మారుటచే వాణ్డు, గుణగణాభరణుణ్డు వంటి రూపము లేర్పడినవి. పిదప 'ణ' కారస్థానమున ననుస్వారము వచ్చి 'వాండు' అనియు, మరికొంత కాలమున కది తేల్చి పలుకబడుట, యిటీవల ముద్రణసౌకర్యము కలిగినపిదప, పలుకబడని యీ యనుస్వారస్థానమున అరసున్న నుంచుటకూడ సంభవించినది. అనగా నీ భాషలో నర్ధానుస్వారోత్పత్తికిగూడ నీ నకారమే కారణమైన దని తెలియుచున్నది. ఇట్టి దేశ్యశబ్దములలోవలెనే రామన్, దేవన్ మొదలగు అకారాంతతత్సమపుంలింగశబ్దములలోగూడ నీ మార్పు కలుగుటచే నీ 'భాషలో 'ండు', 'ఁడు' అనునది ప్రథమావిభక్తి ప్రత్యయముగా గ్రహింపబడుటయు దటస్థించినది. ఇట్లు ప్రాచీనభాషలోని అన్నంతశబ్దములందలి పదాంతనకారము పొందిన పరిణామముయొక్క ఫలితమే తెలుగులో 'ఁడు' ప్రత్యయ మని వ్యక్తమగుచున్నది. దీనిని ప్రాకృతభాషారూపములనుండి సాధించుట సుసాధ్య మని తోచదు.

ప్రాచీనములగు తెలుగుశాసనములలో నకారము క్రింద వ్రాయబడియుండిన ఱ ఈ గుర్తు గల వర్ణము కేవలము శకటరేఫముకాని, మూర్ధన్యడకారముగాని కాక యొక వింత యక్షరమని మొదట కనిపెట్టినవారు బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రులుగారు. అంతకు పూర్వము తొలుదొలుత యుద్ధమల్లుని బెజవాడశాసనములో కనిపెట్టబడిన 'ఱ' వర్ణమునుగూర్చివలెనే దీనినిగూర్చియు గొంత వాదము జరిగినది. ఇది కొంతవరకు 'ఱ' కారమును బోలియుండుటచేతను, భిన్నశాసనములలో భిన్నరీతులం గలదగునట్లు చెక్కబడి కనబడుచుండుటచేతను, ఆ పదములలో నకారమునకుతరగా చేరదగిన ధ్వని స్థానాంతరతారతమ్యమునుబట్టి 'ఱ'కారమే యగుటచేతను ఈ వింతగుర్తు లన్నియు శకటరేఫముయొక్క రూపాంతరములే యని కొందరు తలచుట కవకాశ మేర్పడినది. కొందరు పరిశోధకులు అత్తివర్మ గోరంట్లశాసనములోని 'శాన్తికొన్ఱు' అనుదానిని 'శాన్థికొన్థు' అని యీ వర్ణమును దంత్యథకార మను దృష్టితో జదివిరి. కాని యిది తరువాతికాలమున 'శాడికొండ' యను రూపమును బొందుటచే 'వాన్ఱు, మగన్ఱు' అను వానిలోవలెనే యిదియు 'వర్త్స్య' డకారమే యని నిర్ణయింపవలసియున్నది. అన్నకారమునకుతగా బదులు చేరినది 'ఱ' కారమే యైనను సంయోగమున దీనికి వర్త్స్య 'డ' కారోచ్చారణము గలుగుట తమిళ భాషావ్యవహారసంప్రదాయమున సుప్రసిద్ధమే.

ఈ నూతనలిపితో గూడిన 'వాన్ఱు' వంటి రూపములు చాలవరకు పశ్చిమాంధ్రజిల్లాలలో లభించిన చోళరాజుల శాసనములలోనే హెచ్చుగా గానవచ్చుచున్నవి. ౭ వ శతాబ్ది ప్రారంభమునకే తూర్పుజిల్లాలలోని చాళుక్యరాజుల శాసనములలో 'వారు' అను బహువచనరూపముతో గూడిన 'కుడుచువారు' వంటి రూపములకు ప్రాచుర్యము కలిగిన ట్లగపడుచున్నది. అచ్చువాన్ఱు, అచ్చినవాన్ఱు అను దిమ్మగుడి పొట్లదుర్తి శాసనములలోని రూపములకు బదులుగా, విప్పర్తి, కపిలేశ్వరపురపువానివంటి చాళుక్యశాసనములలో 'వచ్చినవారు' 'వచ్చువరు' వంటి రూపములు బొడగట్టుచున్నవి. దీనినిబట్టి అప్పటికే తెనుగుభాషయొక్క పరిణామము విషయమున పశ్చిమాంధ్రమునకును, తూర్పుజిల్లాలకును భేద మేర్పడియుండునేమో యని యూహింపవలసి వచ్చుచున్నది. చాళుక్యశాసనములలో నిక్కల్ల నిట్టి వ్రాత గనబడుచున్న శాసన మొక్కటే అహదనకరశాసనమే. అందు కొన్ఱుకర్, గన్ఱు అను శబ్దములు కలవు. ఈ శాసనమునుగురించి శాసనపరిశోధకులకే సందేహములు గలిగినవి. ఏ దెట్లైనను భాషలో దీనికి కొంత ప్రాచీన సంప్రదాయము మిగిలిన దని మనము తలపవచ్చును. కపిలేశ్వరపురశాసనములో నుత్తరాంధ్ర సంప్రదాయపద్ధతిని 'వచ్చువరు' అనియే ప్రయోగింపబడియున్నను 'తెలున్ఱు' అను రూపమున మాత్ర మీ వింతవర్ణము కనబడుచున్నది. ఇట్టివి ప్రాచీనాంధ్రసంప్రదాయముయొక్క ఛాయలనియే మనము తలపవచ్చునేమో. ఈశబ్దములోని వర్త్స్యడకారము, నకారమును ౧౧ వ శతాబ్దమునందలి చాళుక్యభీముని ధర్మవరము శాసనమునాటికి 'అయ్యపరాజతిమ్మణ్డు' అని మూర్ధన్య ణకార డకారములుగనే మారిపోయినవి. ఈ శతాబ్దములో 'న్ఱు'

అనునది యంతరించి 'సుగగణాభరణుణ్డు', 'సంపన్నుణ్డు' మొదలగు రూపములే బాంగా వ్యవహారములోనికి వచ్చినవి. సత్యాశ్రయుని శాసనములో 'ఏళుచున్ఱి' అను క్త్వార్థకరూపములోని యీ వర్ణముకూడ చాళుక్యభీముని కొఱవిశాసనములో 'సుఖంబుణ్డి' అని మూర్ధన్యాక్షరములతో గూడినదిగానే వ్రాయబడినది. ఇక పశ్చిమాంధ్రమండలి కడపజిల్లాశాసనములోని 'మూట్టకొణుబొన్ఱి' అను శబ్దములో వర్త్స్యనకార డకారశకటరేఫసంయోగము కనబడుచుండగా నవశతాబ్దిలోని పాండురంగని అద్దంకిశాసనములో 'కొట్టంబుల్వన్ఱెండు' అనుపదములో మూర్ధన్య ణకార డకారశకటరేఫముల సంయోగమే కానవచ్చుచున్నది. యుద్ధమల్లుని బెజవాడశాసనములో 'పాపంబుగొన్ఱు' అనియే కలదు. పై రెండు తరువాతికాలములో క్రావడికిబదులుగా శకటరేఫమే వ్రాయబడియుండుట యిచ్చట మనము గమనింపదగిన మరియొక విషయము. ఇవిలోనే గాక మరి కొన్ని శబ్దములలోగూడ క్రావడికి బదులు 'ఱ'కారమే గానవచ్చినది. "వారణాశి వ్రచ్చి పాపంబు గొన్నవాన్ఱు" (కడపపెద్దముడియంశాసనము). ఈ వాక్యమే యుద్ధమల్లుని బెజవాడ శాసనములో "అబ్బారణాసి వ్రచ్చిన పాపంబు గొన్ఱు" అని కనబడుచున్నది. దీనినిబట్టి సంయుక్తాక్షరములలో శకటరేఫమే తరువాతికాలమునందలి క్రావడిచిహ్నమునకు మూలరూపమా యను సందేహము కలుగకపోదు.

ఇక 'పాపంబుగొన్ఱు' అనునది బహువచనరూపమే గాని దీనివలెనే 'పాపంబు గొన్నవాన్ఱు' అనునది మాత్రము బహువచనరూపము కాదు. 'కొన్ఱు' అను దానిలో శకటరేఫము బహువచనచిహ్నముగా కనబడుచున్నది. కాని 'ఱు' అనునది బహువచన చిహ్నమెట్లయ్యెననున దొక సమస్య. అందఱు, పేటకాఱు, మొదలగు కొన్ని శబ్దములలో గానవచ్చుటచేత, నదియు బహువచనచిహ్నమే యని చెప్పవలెనేమోగాని, అందలి పేటకాండు + ఱు అనువానిలో 'ండు + ఱు'లకు గలిగిన సంయోగమునుబట్టియే 'కాండ్రు-కాఱు' అని యేర్పడియుండునని తోచుచున్నది. వర్త్స్యనకార డకార సంయోగమే శకటరేఫముకూడ నచ్చట చేర్పబడుటకు కారణమైయుండును.

ఒక్, మూక్, ముక్ మొదలగు నితరశబ్దము లనేకములుగూడ నీ 'ఱ'కారము నూతగా గ్రహించి యీ భాషలో క్రమపరిణామము నొందుటచేతనే ఒకఱు, మూన్ఱు, మున్ఱు అయి తుదకు ఒండు, మూండు, ముందు అను శబ్దము లేర్పడినట్లు తెలియుచున్నది. మున్ఱు, కన్ఱు — వానిలోని 'ఱ'కారము సరళత్వము నొందుటచే గాబోలు తెలుగులో ముద్దు, కద్దు- అయినవి. తమిళమున 'ముక్' శబ్దమునకు 'ఇల్' శబ్దము పరమైనపుడు, ఇల్ = ఇంటియొక్క, ముక్ = ముందటిభాగము అను నర్థమున మున్ఱిల్, ముక్ఱిల్ అనుశబ్ద మేర్పడుచున్నది. అనగా నడుమ శకటరేఫ మూతగా చేరుచున్న దన్నమాట. ఇట్లే ప్రాచీన భాషలోని

కున్ఱు శబ్దమునుండి తెనుగున కొన్ఱ—కొణ్డ
ఎన్ఱు — ఎణ్డ, ఎండ
తిన్ఱి — తిణ్డి, తిండి
వాన్ఱు — వాణ్డు, వాఁడు

అనియు,

పిన్ఱు నుండి కన్నడమున—పిందు
అన్ఱు — అందు
ఇన్ఱు — ఇందు

అనియు నేర్పడుచున్నవి.

ఇట్టి నకారఱకారసంయుక్తరూపము తెలుగున బిందుపూర్వక డకారముగను, కన్నడమున బిందుపూర్వక దకారముగను మార్పునొందగా, తుళుభాషలో నింకను సరళత్వమును బొంది 'ంజి' అను రూపము నొందినది. cf. ఒన్ఱు—తుళు: ఒంజి

కన్ఱు—కంజి

మూన్ఱు—మూంజి.

ఇట్లే పదాంతనకార మూదిపలుకబడినపుడుగాని, దానికి పరుషవర్ణము పరమైనపుడుగాని, తత్ స్థానీయమే యగు ఱకారము నొకదానిని చేర్చికాని, భిన్న

భాషలలో భిన్నరీతులగు పరిణామమును బొందినట్లు వ్యక్తమగుచున్నది గదా.

ఈ పదాంతనకారము సామాన్యముగా తమిళమందే మకారముగా మారిపోవుచుండినట్లు తొల్కాప్పియమునందే సూచింపబడినది. అట్టివానిలో మరన్, కుళన్, పులన్ మొదలగునవి కలవు. ఇవి తమిళములో 'మరమ్, కుళమ్, పులమ్' అను రూపములతోనే యిప్పుడు గానవచ్చుచున్నవి. కాని తెలుగులో మొదటి రెండుశబ్దములును ఇప్పటికిని 'మ్రాను, కొలను' అని నకారముతో గూడినవిగనే యుండుటచే, తెలుగున వాని ప్రాచీనరూపములే నిలిచియున్నవని తెలపనగును. పులన్ అనునది మాత్రము పొలము అని మకారముతో గూడినదై యున్నది. ఇట్టివే మఱికొన్ని శబ్దములు.

త. తెన్=దక్షిణము, తెన్+ఎరల్=త—తెన్ఱల్=దక్షిణపు గాలి. నకారము మకారముగా మారుటచే తెనుగులో నిది 'తెమ్మెరల్' అయినది. తెమ్మ+ఎరల్ అని పదవిభాగము చేయుచున్నారు. ఇది బహువచనరూపమని తలపబడుటచే దీనినుండి 'తెమ్మెర' అను నేకవచనరూపముకూడ నేర్పడినది.

త. పిన్ = పిన్పు; కన్న. పిన్దు; మళ. పింబు; తెనుగున పిమ్మట.

త. నోన్—నోన్పు; క. తు.—నోమ్పు, నోంబు; తెలుగున—నోము.

ఈ పదాంతనకారసంయోగము లేక 'ఴ'కారము ద్విత్వము నొందినపుడది 'ట్టు' అను ధ్వని కలదై యుండునని గ్రహించితిమిగదా. ఇట్టి ప్రాచీనసంప్రదాయమువలననే టవర్గముతో గూడిన యనేక నూతనపదము లీభాషలో బయలుదేరుట తటస్థించినది. అనగా నీక్రిందిపదములలోని 'ట'కారము మూలభాషలోని 'ఴ'కారముయొక్క పరిణామరూపమును సూచించుచున్న దన్నమాట.

త. పుఴ్ఴు—పుట్టు—తె. పుట్ట. cf. పురుగు.
తేఴు, తేఴ్ఴు, తెట్టు—తె. తేట; తేట్టె.
గీఴు — గీటు
చిఴు — చిట్టి—చిటి—చిఱి
.ముఴు — ముట్ర (ముఱియ—ముక్క)
కుఴు — కట్టు(సురు) కుట్టి
పిఴి — పెట్టు (గుడ్లను పెట్టు) పుట్టు
ఉఴి — ఉట్టి
ఊఴు — ఊట
ఒఴ్ఴు — ఒత్తు.
వఴు — వట్టిపోవు cf. వఴువట్లు
మిఴు — మిట్ట, మెట్ట, మిట్టిపడు.
మెఴె — మిట్టు—మిఴుమిట్లు.
విఴై — విఴ్ఴు—విట్టు...

కొన్ని ప్రాచీనశబ్దములలోని శకటరేఫము, దానికి మూలమగు 'ఴ'కారము వర్ణవ్యత్యయము మూలముగా, నా శబ్దములలోని తొలివర్ణమును గ్రావడితో గూడినదానినిగా జేయుటకు దోడ్పడినవి.

తోఴు (= దర్శనే)—తోఴు+వ > తె. త్రోవ.

పుఴు (< పుఴు) > తె. ప్రుచ్చు; ప్రువ్వు
ముఴంగు— > తె. మ్రోగు.
కొఴనెల— > తె. క్రొన్నెల.
పఴమ్— > తె—ప్రాత.
కాఴ్—క్రాయు, క్రక్కు.
కుఴై—క్రుళ్లు.
కొఴుప్పు—క్రొవ్వు.
కీఴ్—క్రిందు...
ఇట్టి వనేకములు గలవు.

ఇట్లీ పదాంతనకార, శకటరేఫముల వలెనే, ప్రాచీన భాషలోని మరియొక వింతయక్షర మనదగిన 'ఴ' కారముకూడ ననేకవిధపరిణామములకు లోనై, తెలుగుభాషలో క్రీ. శ. రెండవ సహస్రాబ్దినుండి యంతరించినను, అందనేక దేశీయశబ్దములలోని ఴ, ర, ళ, డ, ద, య మొదలగు ధ్వనులకు గారణమై యుండినది. అట్టి పదములలోని యీ వింతవర్ణముల చరిత్ర ప్రాచీనతెలుగుశాసనములలోని భాషతోను, ఇతర దక్షిణదేశభాషాపదములతోను బోల్చి పరిశీలించినగాని తెలియరాదు. వీని చరిత్ర, పరిణామముల యన్వేషణము విషయమున ప్రాకృతభాష లేమియు తోడ్పడజాలవు.

---

# అనంతామాత్య కవి



**— శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ —**

అనంతామాత్యుఁడు భోజరాజీయ మను కావ్యమును, రసాభరణ మను సాహిత్య శాస్త్రమును, అనంతచ్ఛందమని ప్రసిద్ధిగాంచు ఛందశ్శాస్త్రమును రచియించిన తెలుగుకవి. ఇతఁడు కౌండిన్యగోత్రుఁడు. ఇతని వంశమునకు మూలపురుషుఁడు నంకనార్యుఁడు. ఇతనికి సత్యమంత్రి, త్రిపురాంతకుఁడు అని యిరువురు కొడుకులు. వీరిలో సత్యమంత్రితనయులు ముగ్గురిలో బయ్యన్న కొడుకు ముమ్మడన్నకు అనంతామాత్యుఁడు మనుమఁడు. అనంతామాత్యుని ముత్తాత బయ్యన 'విద్యలందు చతురుఁడై,' 'రాజసభలయందు బూజ వడసినవాఁడట. ఇతనికి తిక్కనసోమయాజి 'భవ్యభారతి'యని బిరుద మిచ్చినట్లు—

"క్షితిఁ గ్రతుకర్త తామహిమఁ
జేకొని పంచమవేదమైన భా
రతముఁ దెనుంగుబాస నభి
రామముగా రచియించినట్టి యు
న్నతచరితుండు తిక్కకవి
నాయకుఁ డాదట మెచ్చి 'భవ్యభా
రతి'యనఁ జేరఁగన్న కవి
రత్నము బయ్యనమంత్రి యల్పుఁడే?"

అను పద్యమువలన దెలియుచున్నది. బయ్యన కవిరత్నమట. అతఁడు రచియించిన కావ్య మేదియో, ఒక్కటియు మన కింత వరకు దొరకలేదు. అనంతామాత్యుఁడు తన తండ్రి నిట్లభివర్ణించియున్నాఁడు:

"విలసితంబగు కృష్ణవేణ్ణా మలాపహా
రిణి భీమరథినా ధరిత్రియంబుఁ
దనరు నదీత్రయాంతర్వర్తియగు పావ
నక్షేత్రమున శోభనముల కెల్ల
ధర నివాసంబగు పెరుమగూరిపురంబు
నందు విద్వజ్జనానందమైన
శ్రీనక్షత్రశేఖరుఁ డెన్నంగ వంశక
ర్తయైనట్టి బ్రహ్మశ్రేష్ఠుఁ డొంగ
నెమ్మిఁ బ్రహ్మపరమపదముఁ గాంగ
నొప్పు శ్రీకాకుళంబున నాదయుఁడైన
యంధ్రవల్లభ హరిసేవ నలరుచుండుఁ
దెక్కభట్టుల ముమ్మడి తిక్కవిభుఁడు."

ఈ పద్యము ననుసరించి అనంతామాత్యుఁడు శ్రీకాకుళప్రాంతీయుఁ డనియు, అనంతుని తండ్రి ముమ్మడి తిక్కవిభుఁడు భజించుచు వచ్చిన యంధ్రవల్లభుఁడు శ్రీకాకుళపు తెలుంగురాయఁ డను దేవుఁడే యనియు స్పష్టమగుచున్నది.

మలాపహకు శాసనములందు ముంఘ్ని యనియు పేరుకలదు. ఈ నది కాపయనాయకుని ప్రోలవరము శాసనమునను[1], రెడ్డి శాసనములందును వచ్చును. కాపయనాయకుని ప్రోలవరము శాసనములోని ముంఘ్నియే అనవేమారెడ్డి జుజ్జవరము శాసనము[2]న మలాపహ యని వ్యవహరింపబడినది. ప్రోలవరము, దుజ్జవరము (జుజ్జ

1. C. P. No 3 of 1934-35; J. B. O. R S Vol XX (1934) పుటలు 260 మొదలు; భారతి (1934).

2. C. No. 23 of 1922-23

పాము), కోడూరు అనునవి మలాపహానదీ తీరమున నున్న గ్రామములు. ఈ కడపటి గ్రామమైన కోడూరును అనవోతారెడ్డి శక వర్షము ౧౨౮౦ లో బ్రాహ్మణులకు దానము చేసెను. కోడూరు జుజ్జవరములను, ప్రోలవరమును కృష్ణాజిల్లాలోని గుడివాడ తాలూకాలో నున్నవి[3]. ఇక భీమరథికూడ అట్టిదే. అనవేమారెడ్డి "ఉప్పుగల్లు" శాసనమని ఒక తామ్రశాసనమును శ్రీ శేషాద్రి రమణకవులు శారదపత్రిక[4] లోను, ఆంధ్ర పత్రిక ఉగాదిసంచికలోను (౯౨౦), గ్రంథాలయసర్వస్వము లోను ప్రకటించిరి. ఇది శాసనశాఖవారు (౯౦౧౨౨ లో సంపాదించి తమ నివేదికలో నిచ్చిన తొమ్మిదవ నెంబరు శాసనము. శాసనశాఖవారును, శ్రీ శేషాద్రిరమణకవులునుగూడ దత్తగ్రామమును ఉప్పుగల్లనియే చదివి యున్నారు. ఈ గ్రామమునకు భీమరథి దక్షిణపు సరిహద్దు. దీనికి సరిహద్దులుగా చెప్పిన గ్రామము లన్నియు గుడివాడ తాలూకాలో నున్నవి; కాని నాకు ఉప్పుగల్లుమాత్రము గుర్తింపగాలేదు. అటువంటి పేరుతో గ్రామమే లేదు. దానిమీద నాకు సందేహము కలిగి శాసనప్రతిబింబములను[5] బరిశీలింపగా దత్తగ్రామమును దెలుపు శ్లోక మీ విధమున నున్నది:

"శాకాబ్దే గుణరత్న భాస్కరమితే
　　రాధే కళాంగగ్రహే
ప్రాదా ద్వేమయ అన్న వేమనృపతిః
　　శ్రీవీరనారాయణః
గ్రామం పూర్వనృపాలకై రపహృతం
　　విచ్ఛిన్నభాగం చిరా
ద్విప్రేభ్యః పున 'రీప్పుగల్లు'రితి యో
　　నామ్నా జగ్రైః కీర్తితః."

ఓరుగంటి పతనానంతరము ఆంధ్రదేశము తురుష్కాక్రాంతమైన కాలమున పూర్వపురాజులు బ్రాహ్మణుల కిచ్చిన యీ గ్రామ మపహృతము కాగా, అనవేమారెడ్డి దీనిని సాధించి మరల బ్రాహ్మణులకు శ. ౧౨౯౩లో దానము చేసెను. అందువల్ల గ్రామముపేరు ఈప్పుగల్లు (పునర్-ఈప్పుగల్లు) కాని ఉప్పుగల్లు కాదు. ఇది ఈమ్ముగల్లువికృతి. ఈమ్ముగల్లని నేటికి ఆ పేరుతో గుడివాడ తాలూకాలో నున్నది.

ఈ పై చర్చ ననుసరించి మలాపహా, భీమరథి యను నదులు రెండును కృష్ణాజిల్లాలోనే యున్నవి. ఇవి కృష్ణాయుపనదులు. ఈ కారణమున ముమ్మడి తిక్కనిభట్టును, ఇతని కొడుకు అనంతామాత్యుడును కృష్ణామండలవాసు లని నిస్సందేహముగా నిశ్చయింపవచ్చును[6]. వీరిది పెరుమగూరు. పూర్వచాళుక్య శాసనములలో వచ్చు

---

3. *A forgotten chapter of Andhra History—by M Somasekhara Sarma, appendix III. pp. 113-14; Ep. Rep 1934-35, p 74, para 52.*

4. సం. *II*. పుట *570* మొదలు.

5. శాసనశాఖవారి ఆఫీసుకు వెళ్లి సూపరింటెండెంటుగారిని ఈ శాసనమునకు ప్రతిబింబములు పరిశీలన నిమిత్తము కావలెనని కోరితిని. ఈ శాసన మిదివరకే మూడుచోట్ల ప్రకటితమయినది గనుక విషయమును గురించి పరిశీలించవలసిన యావశ్యకము లేకపోయెను. సూపరింటెండెంటుగారు దయతో ఆ శాసన ప్రతిబింబములను పరిశీలనార్థ మిచ్చినందుకు వారి కిందుమూలమున నా కృతజ్ఞతాపూర్వకవందనములను దెలుపుకొను చున్నాను.

6. శ్రీ కొమఱ్ఱాజు వెంకటలక్ష్మణరావుగారు ఈతని నివాసమునుగురించి యిట్లు వ్రాసియున్నారు..

పెరువంగూరుగ్రామమే పెరుమగూరని నా నమ్మకము. గుణగవిజయాదిత్యుని (III) అనంతరము పూర్వచాళుక్యసింహాసనము నధిష్ఠించిన మొదటి చాళుక్య భీమ మహారాజు కాలములో రాష్ట్రకూటరాజులు వేంగి దేశము మీదికి దండెత్తి వచ్చినప్పుడు ఇతిమత్తిగండ డను అతని కుమారుడు-పదునారేండ్ల యీడువాడు శత్రువు నెదుర్కొని నిరవద్యపుర, పెరువంగూరుగ్రామ రణక్షేత్రములలో మహాయుద్ధము చేసి చివరికి హతుఁడయ్యె నట.[7] ఈ పెరువంగూ గ్రామము ముమ్మడి తిక్క యన్నగ్రామము పెరుమగూరే. ఇది గుడివాడ తాలూకాలోని ఇప్పటి పెనుమకూరు కావచ్చునని నా యభిప్రాయము. ఇదే అనంతామాత్యుని స్వగ్రామము

అనంతామాత్యుడు—

"భూనుతకీర్తి ముమ్మడి వి
    భుండు మదగజాంక దేవు వైష్ణవ
ధ్యానసమాహితాత్ముఁడ న
    నంతసమాఖ్యుఁడ నాదు తమ్ము ల
క్ష్మానవిదూరు లక్కనయు
    సక్కవి చిట్టనయుం వివేక వి
ద్యానిధి రామచంద్రుఁడు ను
    దారుఁడు లక్ష్మణనామధేయుఁ డౌ.
ఈ యార్వురు నొక్కొక్కఁడు
నేయిండ్లకు మొదలు గాఁగ వెలయుదురని యా
డే యూరువేల్పే రిదె
రీ యన్వయమునకు సెవ్య పెఱిఁగిన పెద్దల్."

అని చెప్పుటచేత వీరందరు ఆరుగు రన్నదమ్ములని తెలియుచున్నది.

అనంతామాత్యుని కాలమునుగురించి మనము పరిశోధన చేసి అవును, కాదని బాధ పడనక్కర లేకుండ అతడే తన రసాభరణమున ఇట్లు చెప్పుకొనియున్నాడు:

"శాకొందక శకవర్షముల్ బుధనుత
    జ్యాకేందు శైలయుప్ప న
య్యాకనందాబ్దమునందు మాఘమునఁ గృ
    ష్ణైకాదశీ భానుయు
క్తానూరాధ్యకశోభ నీకృతి యనం
    తాఖ్యుండు సమ్యగ్రస

"ఈ పద్యమును బట్టి (విలసితంబగు ... తిక్క విభుడు) చూడ, నీ కవియొక్క తండ్రి కృష్ణవేణా, భీమరథి, మలాపహా యనఁబడు నదులు కలిసిన యంతర్వేదిలో నుండెనని-అట్టి స్థల మాతని స్వస్థానమని-తెలియుచున్నది. అట్టి స్థలమెద్ది? కృష్ణవేణా యనగ కృష్ణ, భీమరథీ యనగ భీమ, మలాపహా యనగ మలప్రభా నదులనుట స్పష్టము. కృష్ణానదియు, మలప్రభా నదియు నైజాము రాజ్యమునకుఁ బశ్చిమ పరిహద్దునొద్ద బొంబాయి రాజధానిలో గలిసినవి. ఇది యిప్పటి కన్నడదేశము. కృష్ణయు, భీమయు నైజాము రాష్ట్రమునందు రాయచూర్ పట్టణమునకు బశ్చిమమున బదారు మైళ్ల బాద గలిసినవి. ఇది తెలుగుదేశ మని చెప్పవచ్చును. కావున నీ కవియొక్క నివాసస్థలము నైజాము రాజ్యమునం దుండె నని మన మూహింపవచ్చును" అనియు,

"'ఆంధ్రవల్లభహరిసేవ సలుపుచుండు' అనగా నీతడు ఆంధ్రరాయనివద్ద నుద్యోగిగా నుండె నని కొందరర్థము చేసికొనియున్నారు. కాని యది పొరపాటు. 'ఆంధ్రవల్లభహరి' యనగా నాంధ్రవిష్ణువు; శ్రీకాకుళములోని దేవుడు. అతని సేవచేయుట యనగా నతనిని భక్తితో భజించుట. ఏ గ్రామమునం దే దేవు డుండునో ఆ దేవుని ఆ గ్రామాధిపతిగా చెప్పుట భక్తుల యాచారముగా నున్నది. ఇట్లే యీ కవియొక్క 'రసార్ణవ' మందలి 'శ్రీనిండం ధ్రువపట్టణాధిపున కిచ్చెం భక్తి పూర్వంబుగాన్' అన్న చరణముఁజూచి కొందరీగ్రంథము ధ్రువపట్టణపురాజున కిచ్చెనని భ్రమపడుచున్నారు. అచ్చటను ధ్రువపట్టణాధిపు డనగా ధ్రువపట్టణపు దేవుడని యర్థము. ఈకవి తన గ్రంథ మేదియు నరాంకితము చేయలేదు" అనియు వ్రాసియున్నారు. కాని ఇది సరికాదు.

7. *C. P. No. 1 of 1913-14*

శ్రీ నిండఁగ ధ్రువపట్టణాధిపున కి
చ్చెన్ భక్తిలాంఛనంబుగన్."

అనంతామాత్యుడు రసాభరణమును శకవర్షము ౧౩౫౬ ఆనందసంవత్సర మాఘ బ. ౧౧ మంగళవారమునాడు (క్రీ.శ.౧౪౩౫, జనవరి, ౨౫) ధ్రువపట్టణములోని దేవునికి సమర్పించెనట. ఈధ్రువపట్టణము బృందావనపురమువంటిదే - దేశీయనామమునకు సంస్కృతీకరణము. ఈ ధ్రువపట్టణ మేదో తెలియవచ్చుట లేదు. పట్టణ మని యుండుటచేత ఒకవేళ నిది సముద్రతీరస్థ మయిన రేవుపట్టణ మేమో యని సంశయము కలుగుచున్నది. ఇటీవల పురము, నగరము, పట్టణము అనునవి పర్యాయపదములుగ వ్యవహరింపబడుచున్నను, అస లవి పర్యాయపదములు కావు. ఇవే కాదు, మన మిప్పుడు పర్యాయపదము లనుకొనెడి వేవియు పర్యాయపదములు కావు. పురము వేరు, నగరము వేరు, పట్టణము వేరు. అర్థములో ఈచ్ఛేదమును దెలుపుటకే ఈ పదములు పుట్టినవి. ఒక భావమును దెలుపుటకొక పదమే కాని అనేకము లుండవు. అది భాషాసంప్రదాయము కాదు; కాని జనవ్యవహారములో ఆ భేదము పాటింపబడక రానురాను ఆ పదము లిపుడు పర్యాయపదము లయినవి. ఈ సాంకర్యము అనంతామాత్యుని నాటికి వచ్చినదో, లేదో తెలియదుకాని, పట్టణ మన్న సముద్రతీరస్థగ్రామ మను సంకేత మప్పటికి పొసఁగెనని తోచును (చూడుడు : శ్రీనాథుని 'కాల్పట్టణాధీశ్వరుఁడ' అను ప్రయోగము). సముద్రతీరస్థగ్రామము లన్నియు పట్టణములు కాకపోవచ్చుకాని పట్టణములు మాత్రము సముద్రతీరస్థము లని యూహించుట కవకాశము కలదు.

అయితే, అనంతామాత్యు డీ రసాభరణమును తన జీవితకాలమున ప్రాగర్ధమున రచియించెనా, పరార్ధమున రచియించెనా యన్న ఈ క్రిందివిషయము లీ సమస్యను పరిష్కరించుటకు దోడ్పడగలవు.

అనంతుడు తన విద్యాగురువును, అతని పుత్రులను ఈ క్రిందిరీతిని దన కృతి భోజరాజీయమున వర్ణించియున్నాడు:

"భూనభోహరిదంతపూరితసత్కీర్తి
శాలి తిర్వెంగళచక్రవర్తి
సకలసాత్త్వికశుకప్రకరసత్ఫలపూర్ణ
సహకార మళఘురిచక్రవర్తి
ఘనతరాజ్ఞానాంధకారవిఖండన
చండాంశుఁ డోబళచక్రవర్తి
నానార్థిజనచాతకానూనధనవృష్టి
జలదంబు శ్రీదేవచక్రవర్తి
యనఁగ శ్రుతిచతుష్టయముతో నెనయునట్టి
యగ్రజులతోఁ బుట్టిన యస్మదీయ
గురుని దిరుమల నల్లానువరతనూజుఁ
దలఁతు గోవిందచక్రవర్తులఁ బ్రియమున."

తిరుమల నల్లానుచక్రవర్తుల కొడుకు గోవిందచక్రవర్తి అనంతామాత్యుని గురువుగారట. తిరువెంగళచక్రవర్తి, అళఘురిచక్రవర్తి, ఓబళచక్రవర్తి, శ్రీదేవచక్రవర్తి గోవిందచక్రవర్తుల అన్నలట. నల్లాను చక్రవర్తి శాసనములలో నల్లాండిచక్రవర్తి యని వ్యవహరింపబడెను. అందువలన నల్లాను అనునది కాక, నల్లానిచక్రవర్తి అను రూపమే సాధు వని తోచును. నల్లాని చక్రవర్తికుమారుడును, అనంతామాత్యుని గురువు నయిన గోవిందచక్రవర్తి శాసనము గుంటూరుజిల్లా,

పల్నాడు తాలూకా, కారెంపూడి గ్రామమున[8] నున్నది. అది శకవర్షము ౧౩౯౦ నాటిది. ఇప్పటికిని నల్లాని చక్రవర్తుల వంశము వారు కారెంపూడిలో నున్నట్టు విన్నాను. వసంతోత్సవసందర్భమున జరుగవలసిన కుల మర్యాదల విషయమున బడుగు వారికి, నితరులకు వివాదము కలుగగా గోవింద చక్రవర్తులవారు మధ్యస్థులై ఆ వివాదమును పరిష్కరించిన విషయమును దెలుపుటకు కారెంపూడి శాసనము పుట్టినది. గుంటూరు జిల్లా, నరసారావుపేట తాలూకాలోని కొండపి చెర్ల గ్రామములోని[9] రెండు తేదీలేని శాసనములలో గోవిందచక్రవర్తులవారి తండ్రి నల్లాండిచక్రవర్తులవా రుదాహృతులైనారు. ఈ శాసనముల ననుసరించి చూడగా ఈ చక్రవర్తులవారు శకవర్షము ౧౩..కి చాల పూర్వమే వచ్చి గుంటూరుజిల్లాలో ఉండి వైష్ణవమతమును వ్యాపింపజేయుచుండినట్లు ఊహింపవచ్చును. నల్లాండి చక్రవర్తుల కుమారుడు తిరువేంగళచక్రవర్తిశాసనము ఒకటి చియ్యవరములో[10] నున్నది. ఈశాసనము శకవర్షము ౧౩౪౭ పార్థివసంవత్సరము నాటిది. విజయనగరమహాసామంతులలో నొకడైన సంకెట ఎఱ్ఱకంపరాజు సద్ధర్మస్థాపనాచార్యుడైన నల్లాండి చక్రవర్తి కుమారుడు తిరువేంగళచక్రవర్తికి పార్థివ సంవత్సరములో చియ్యవర మను గ్రామమును దానముచేసెను. పూర్వోక్తశాసన మీ విషయమును దెలుపునదే. అనంతామాత్యుడు శాలివాహనశకము పదనాలు గవ శతాబ్ది ప్రారంభమున విద్యార్థిదశలో నుండినట్లూహింపవచ్చునేమో.

అనంతామాత్యుడు భోజరాజీయమున వర్ణించిన అతని వంశావతారణమును పరికించినచో అతని పూర్వు లందరును శైవులుగా గనబడుదురు. వారి పేరులన్నియు శివసంబంధమైనవే— తిప్పన్న (త్రిపురాంతకుడు), బయ్యన్న (భైరవుడు), నందన్న మొదలైనవి చూడుడు. వంశకర్త నందనార్యుని కొడుకు త్రిపురాంతకుడు చాల గొప్పవాడట. అనంతామాత్యు డతనిని గురించి యిట్లు చెప్పుచున్నాడు:

"మారాంతకునకైన మారాంబ పతిగాఁ
గనియె నార్యుఁడు శంకరుల సుతుల
నిశ్చలధ్యాననైకనిష్ఠాగరిష్ఠుఁడై
పంచాక్షరములు పురశ్చరణ చేసి
మావంశజుల యింటి మార్గాలమునకైన
నరకంబు లేకుండ వరము వడసి
కడఁగి పునర్జన్మగర్భంబుఁ జొరకుండఁ
బ్రతినఁ గైలాసాన బ్రహ్మపదముఁ బొందె
ననిన నతని కీర్తి యఖిలదిక్తటములఁ
గప్పకొనుట చేయఁ జెప్పనేల
విఫలభుక్తపవనుఁ ద్రిపురాంతకబ్రహ్మఁ
బోలఁగలరె యితరపురుషు లెల్ల?"

ఈవంశమువారు వైష్ణవులగుట అనంతునితోనే ప్రారంభమేమో! ఎట్లయినను ఇది అనంతునికి చాలతరములకు బూర్వముమాత్ర మయియుండదు. ఈ వంశమువారు సద్ధర్మస్థాపనాచార్యులు; చక్రవర్తివంశమువారి ప్రభావముననే, వారితో సాహచర్యము లభించిన యనంతరమే వైష్ణవులయియుండవచ్చును.

అనంతుడు తన మూడు కృతులలో భోజరాజీయమును అహోబలనృసింహ

8 Ep coll No 556 of 1909

9. Ep coll. Nos. 300, 301 of 1915

10. Loc. Rec. Vol XL p. 516

స్వామికిని, రసాభరణమును ధ్రువపట్టణాధీశ్వరునికిని అంకితమిచ్చెను. ధ్రువపట్టణస్వామియు విష్ణువే యయి యుండుటకు సందియము లేదు. ఆ కృతిని మాఘబహుళ ఏకాదశినాడు స్వామి కంకితము కావించుట ననుసరించియే యది విష్ణువు కంకిత మొనరబడె నని తెలియును. ఏకాదశి విష్ణువుకు ప్రియమైన దినము. ఇక మూడవ గ్రంథము ఛందోదర్పణమును కూడ విష్ణువు కంకితమీయబడి నట్లే కన్పట్టును. దీనికి అనంతచ్ఛంద మని పేరు కలిగినది. అనంతామాత్యుడు వ్రాసెను గావున దీని కా పేరు వచ్చి యుండవచ్చును; లేదా ఇది అనంతపద్మనాభస్వామికి గాని, అనంతు డను పేరు గల విష్ణుమూర్తికి గాని అంకితమిచ్చుటవలనను కలిగియుండవచ్చును. ఈ కారణముననే దీనికీ పేరు కలిగినదేమో యని నా యనుమానము. ఏలన, ఈ గ్రంథారంభమున గల పద్యము లన్నియు అనంతుని స్తుతించునవే. అనంతస్వామి పేర చెప్పిన, ఆ స్వామి కంకితమిచ్చిన గ్రంథ మగుటచేతనే దాని కనంతచ్ఛంద మని పేరు కలిగినది. ఈ విషయము ఛందోదర్పణములోని ఈ క్రింది పద్యమువలన రూఢిమగుచున్నది:

"శ్రీనిధి చక్రవర్తి కరు
శేఖరపూర్ణకటాక్షలబ్ధశు
జ్ఞానుఁ డనంతధీమణి ల
సన్మణి భోజచరిత్ర చెప్పి ల
క్ష్మీనరసింహుఁ గూర్చి వ్ర
సిద్ధుఁడు వేడుకతో రసాభ్ర ఛం
దోనుతయోగి హృత్ప్రియమల
తో భుజమూర్తి కనంతమూర్తికిన్."

ఈ పద్యమువలన అనంతామాత్యుడు భోజరాజీయము రచియించిన యనంతరమే అనంతచ్ఛందము వ్రాసె నని స్పష్ట మగుచున్నది. రసాభరణ మెప్పుడు వ్రాసి ముగించినదియు మనకు దెలియకే తెలియును. అది శకవర్షము ౧౩౫౬ నాటిది. ప్రాయికముగ నిది అనంతామాత్యుడు రచియించిన కడపటి గ్రంథమేమో.

అనంతామాత్యునిది లలితమైన చక్కని కవిత్వము. భోజరాజీయమునందన్నియు భోజరాజునకు సంబంధించిన వింతకథలు. ఈ కావ్యమునుగురించి శ్రీ కందుకూరి వీరేశలింగముపంతులు గారు తమ కవుల చరిత్రమున నిట్లు వ్రాసియున్నారు:

"ఈతని (అనంతామాత్యుని) కవిత్వము సలక్షణమయి యనర్గళధార గలదై మనోహరముగ నుండును. కవిత్వము మాత్రమేగాక భోజరాజీయమునందలి కథలు మిక్కిలి యింపుగా నుండును. కవిత్రయము వారి ప్రయోగములకంటె భిన్నములైన ప్రయోగములీ భోజరాజీయమున గానవచ్చుచున్నను మొత్తముమీద నిందలి కవిత్వము నిర్దుష్టమయి శ్లాఘ్యముగ నున్నది.



# ప్రాచీన భూగోళము

— శ్రీ వేలూరి శివరామశాస్త్రి —

పురాణములు పదునెనిమి దని ప్రసిద్ధి 1. ప్రతి పురాణమునందును పురాణముల పట్టిక కలదు. కొన్ని పురాణములలో కొన్నిటి పేరు కలదు, కొన్నిటి పేరు లేదు. కొన్ని పురాణములలో శివ పురాణము పేరు లేదు. కొన్నింట వాయుపురాణము పేరు లేదు 2. శివ పురాణములో వాయవీయసంహిత కలదు. మత్స్య నారదీయములలోని పురాణపట్టికలో వాయవీయసంహిత యున్నది. కలకత్తా, కాశీ, బొంబాయి శివపురాణములకు పురాణలక్షణము సమగ్రము కాదు. కొందరు దీని నుపపురాణ మందురు 3. వాయుపురాణము శైవము కావున శివపురాణమునందలి వాయవీయ సంహిత వాయుపురాణమునకు బీజ మని కొందఱును, వాయు సంహితకే వాయుపురాణ మాకర మని కొందఱును వ్రాసిరి.

ముద్రితమగు వాయుపురాణమున గుప్తవంశము వఱకును రాజుల వర్ణనము కలదు. వ్రాత ప్రతులయం దెందును లేదు. ఈ కారణమున వాయుపురాణ మంతయు నాధునిక మనరాదు. కొంద ఱాంగ్ల విమర్శకు లట్లనిరి. ప్రాత దేవళమును బాగుచేసి దానికి ముం దొక మండపమును, ప్రక్క నొక మట్టుపల్లిని కట్టించిన త మాత్రమున దానిని నూతన క్షేత్రముగా భావించువా రుందురా?

## బ్రహ్మవిద్య - కూసువిద్య

సూక్ష్మముగా పరిశీలించినచో సంహితా బ్రాహ్మణానుగతములును, భగవద్ బోధకములును జ్యోతి స్సంహితా ప్రతిపాదితములు నగు రహస్యము లిందు కన బడును. "రహస్యము లని అనినంతనే ఎవరికిని చెప్పదగనివి కాబోలు, అట్టి వున్న నేమి లేకున్న నేమి?" అని పలువు రనుకొనుట వినుచున్నాము. అది తెప్ప కాదు. జ్ఞాను లందఱును "ముందు నీ మనసును కనుగొనుము, పిదప నిన్ను కనుగొనుము" అని చెప్పుదురు. మనకు మనసే దొరకదాయె; ఇక 'నేను' దొరకు టెట్లు? ఇట్టివే రహస్యము లన్నియు. మన అధికారమునకు మించినది రహస్యము. మనకు తెలియనిది బ్రహ్మవిద్య; తెలిసినది కూసువిద్య.

## గాలి పురాణము

చాలకాలము నాటి తత్వవేత్తలయు, పండితులయు, పామరులయు ఎఱుకలో నున్న విషయముల విత్తనములు ఈ మూడు పురాణములందును గలవు. ఇందలి సంగీతశాస్త్రబీజములు హరివంశమున చిగురు పెట్టెను. ఇందలి ప్రతిమాలక్షణము మత్స్య, విష్ణు పురాణములలో స్ఫుటమాయెను. ఈ రీతిగా వ్రాయుచు పోయినచో నది ఒక గ్రంథ మగును. ఈ పురాణము

1. మద్వయం భద్వయం చైవ బ్రత్రయం వచతుష్టయం, అ నా ప లింగ కూ స్కాని....

2. కాశీ కలకత్తా బొంబాయి పూనాలలో అచ్చయిన నాగరలిపి పురాణములలో పరస్పరభేదములు కలవు. చెన్నపట్టణము మొదలగు చోట్ల అచ్చయిన తెలుగు లిపి పురాణములకును వానికిని భేదము కలదు. ఈ భేదములు స్వల్పములు. కొన్ని ముద్రణములలో కొన్ని శ్లోకములును కొన్ని భాగములును లేవు. ఇట్టివానిని ప్రక్షిప్తము లని ఊహింపవచ్చును. కాని ఈ భేదములకు కారణాంతరములు ఏమేని యున్నవో లేవో నిర్ధరింపనిదే ప్రక్షిప్తగోటిలో వీనిని పడవేయరాదు. శ్రీ ముదిగొండ నాగవీరయ్య శాస్త్రిగారు (సికిందరాబాద్, దక్కన్) మొన్న మొన్న ఈ శివపురాణమును మనోహరముగా తెలిగించిరి. వీరు కాశీ బొంబాయి ప్రతులు ఎఱుగుదురు. చూ. వారి పీఠిక. వారిది బొంబాయి ప్రతికి అనుసరణము. వారు వాయవీయ సంహితను వాయవీయ ఖండముగా మార్చిరి. వారే పీఠికలో ఆమాట చెప్పి ఉపకరించిరి. పురాణచరిత్రదృష్టిలో సంహిత వేఱు, ఖండము వేఱు.

3. చూ. దేవీ భాగవత.

నర్మద కుత్తరమున మాలవదేశమున ప్రసిద్ధమయి యుండ వచ్చు నని జొత్తిరేయులు వ్రాసిరి. దీనికి జన్మస్థలము గురవాయూర్, అనగా గురువాయుపురమని దాక్షిణాత్యులు. కాని రత్నావతి యను మాఱు పేరు కల దృషద్వతీతీరమున గల వాయుపురము దీనికి అభిజనదేశమని వా. ౫౯ అధ్యా4. వాయుపురాణము గాలిమాటల పోగు 5 అని కొందఱందురు. శబ్ద బ్రహ్మమునకు వాయువు వాహకమని అభిజ్ఞులు.

## మత్స్యపురాణము

ఇదియు శైవము. మన కిపుడు కనబడు వా. వి. మ. పురాణములకు మాతృక ఏదో ఉండవలయు నను ఊహా కాధారములు కల వను మాట పాఠకులకు గుఱుతుండుట మేలు. వాయుపురాణమున వ్రతాదికములు తక్కువ. దీన నెక్కువ. చైత్రామావాస్యనాడు పార్వతికుక్షిని భేదించుకొని షడాననుడు పుట్టె నని యిందు గలదు. భారతమున "కార్తికామావాస్యనాడు, లేక అగ్రహాయణ శుద్ధ ప్రతిపత్తునాడు శరవణమున కుమారోత్పత్తి" యని కలదు. దీర్ఘపసన్న కేశ విషయమున మత్స్య భారతము లొకటి.

కాళిదాసునకు కుమారసంభవకావ్యరచనలో శివపురాణముతో పాటు ఇందలి కుమారకథకూడ అలతి ఆధారము.

ఇందలి శ్రాద్ధకల్పము ప్రాచీనము. శ్రాద్ధమునకు ద్రవిడులును, కోకనులును (అనగా కొంకణులు) నిషిద్ధులు. ఇం దుత్తరదేశములయందు లేని దేవాలయ గోపురములను, దేవదాసికలను ప్రసంగ మున్నది. ఇందు ఐదు విష్ణ్వవతారముల ప్రశంస కలదు. ఇం దగు నాతనములగు విషయము లెన్ని, ఎపుడు చేరెనో చెప్ప నరిది. కాని క్రీస్తుశక మాఱవ శతాబ్దిలో ప్రక్షిప్త ప్రవేశమునకు భరతవాక్య మని ఊహింపనగును. ఎటు లనిన క్రీ. శ. ఆఱవశతాబ్దిని పుట్టిన దని పలువురు విమర్శకు లొప్పుకొనిన నాందీయమునందు మత్స్యము నందలి భవిష్యద్రాజసూచిక కలదు. "మత్స్యము నారదపురాణము నుదాహరించెనే?" అని ఏరే నడుగుదురు. అది బృహత్కల్పమునందలి నారద పురాణము. అనగా అది మూలనారదపురాణము కావలయు. 'అత్రాహ నారదో ధర్మాన్ బృహత్కల్పాశ్రయాణి (?) చ' (మ. ౫౩ అధ్యా) దీన భవిష్యద్రాజవంశము కలదు. ఎవరో ఇటీవలి పురాణములలోనో, ప్రాచీన పంచాంగములలోనో ఉన్న గుప్తవంశమును చేర్చి ముద్రించియుందు రని చాలమంది అభిప్రాయము. ఒఢ్ర దేశమునందును, వంగదేశమునందును పంచాంగకర్తల కీ రాజవంశమును చేర్చు నాచారము నూఱేండ్ల క్రిందటి వఱకును కలదు.

## విష్ణుపురాణము

ఇది వైష్ణవము. ఇందు ౬ అంశములు కలవు. మొదటి నాలు గంశములు వాయుపురాణమునకు సంగ్రహము. వాయుపురాణ శైలి వదులువదులుగా నుండును. విష్ణుపురాణమునం దా శ్లోకములే రూపాంతరము నొందెను. ఇది కావ్యమువలెను, తత్త్వముపట్ల ఉపనిషత్తువలెను ఉండును. ఈ పురాణమునందు వ్రతాదులు లేవు. ఇందలి ఐదవ అంశము శ్రీకృష్ణుని బాల్యలీల. ఇక ఆఱవ అంశమున ఆఱే అధ్యాయములు.

అసలు మొదట నాలు గంశములే కల వని తోచును. ఐదు, ఆఱు అంశములు పదపడి చేర్పు. నారద మతమున విష్ణుపురాణోత్తర భాగము పేరు విష్ణుధర్మోత్తరము. దీనియందును భవిష్యద్రాజవంశము కలదు.

విష్ణుపురాణము భాగవతమునకు మూల మని చెప్పవచ్చును. విశిష్టాద్వైతస్థాపనాచార్యులు రామానుజాచార్యులవారి శ్రీభాష్యమున ఎటట చూచినను విష్ణుపురాణమే.

## శింశుమారము

తైత్తిరీయారణ్యకము (౨ ప్ర. ౧౯ అ.) శింశుమారపు మొదలను ధ్రువుగను, క్రిందలను ధర్మునిగను, మీ ఱెక్కలిని బ్రహ్మగను, క్రీఱెక్కలిని యజ్ఞముగను,

4. బాణుడు విద్య ముగించుకొని తన గ్రామమునకు వచ్చినపుడు వాయుపురాణశ్రవణము జరుగుచున్నది. చూ. హర్షచరిత.

5. మత్స్యపురాణ మను పేరితో హరిభట్టారకుడు దీనిని తెలిగించెను. కవిత అను పత్రికలో విష్ణుధర్మోత్తరము ౧౯౧౭ పాలున అచ్చయినది. అది మత్స్యపురాణము కాదు. దీని గద్యగా మత్స్యపురాణ ఖండమగు విష్ణుధర్మోత్తర మని కలదు. హరిభట్టారకునకు దొరికిన ప్రతిలో నటు లుండియుండును. దీనివలనను వా. వి. మ. పురాణముల ఐక్యము కనబడును. మత్స్యపురాణము వేరె వడుగగా అచ్చుమగానే దీనిని నాకొసగిన విద్వత్కవులు మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారికి కృతజ్ఞుడను.

హృదయము విష్ణువుగను, ప్రజననము సంవత్సరముగను, ముందు కాళ్లు నశ్వినులగను, నడుము అత్రిగను, వెనుక కాళ్లు మిత్రావరుణులగను, తోక మొదటి భాగమున అగ్నిని, రెండవ భాగమున ఇంద్రుని, మూడవ భాగమున ప్రజాపతిని, నాలుగవ భాగమున అభయమగు బ్రహ్మమును భావన చేయుచున్నది ౬.

## నక్షత్ర ప్రజాపతి

తైత్తిరీయ బ్రాహ్మణము (౧ కాండ, ౫ ప్ర. ౨ అ) నక్షత్రప్రజాపతికి హస్తయే హస్తము, చిత్ర తల, స్వాతి హృదయము, విశాఖ తొడలు, కాళ్లు అనూరాధ అని భావించు చున్నది.

వాయు మత్స్య విష్ణు భాగవతము లీకల్పనలను కొంచెకొంచెముగా మార్చి విస్తృతము చేసెను.

వాయు మత్స్యములు "మీ తోక్కలి ఉత్తానపాదుడు, వెను కక్కులు మిత్రావరుణులు, అగ్రమున మిత్రుడు, ప్రజాపతి ప్రజాపతి" అని చెప్పి, తోక మీద ౧ అగ్ని, ౨ ఇంద్ర ౩ మరీచి, ౪ కశ్యప, ౫ ధ్రువులను చూపి "యీ నలుగురును ఎప్పుడు అస్తమింపరు" అని వర్ణించుచున్నవి. (వా. ౫౨-౯౦. ౫. మ. ౧౨౭-౨౧.౪) ఇందలి మరీచి సంస్కర్తల చేతులేమో! మరీచితో ఐదుగు రగుదురు కాని నలుగురు కారు కదా! ఇంతియ కాక విష్ణుపురాణము మరీచిని చెప్పలేదు. మిగిలినవాని నన్నిటిని చెప్పెను. (౨-౧౨-౩౧, ౪)

భాగవతము విష్ణుప్రోక్తమును, బ్రాహ్మణారణ్యకప్రారబ్ధము నగు శాక్వరము లక్ష్యము నగు నీ శింశుమారమునే తీసికొని ఆ కాలమునందలి పేరి చుక్కల నన్నిటి నందు జొనిపి భగవదాకారభావన చేసెను.

## చుక్కల అస్తమయము

పై యారణ్యకమున శింశుమారపు తోకమీద గల చుక్కల అస్తమయపు మాట లేదు. కాని శింశుమారమును "ధ్రువ స్త్వ మసి, ధ్రువస్య క్షిత మసి" అని అనుమనది.

ఈ చుక్కలు మేరుప్రాంతమున అస్తమింపవు. మఱియు మధురా ప్రాంతమునను అస్తమింపవు. మేరు ప్రాంతమున నివాస మసంభవమై చాల కాల మాయెను. కావున మధురా ప్రాంతములం దీ పురాణత్రయ రచన మయియుండవచ్చును.

## మనుతార

కొందఱీ నాలుగు చుక్కలలో నొక చుక్క మనుతార అని అందురు. మనుతార క్రీ. శ. మొదట మేరువునకు ౧౬౦ అంశల దవ్వున నుండెను. ఐదవ శతాబ్దిలో ౧౯౦ అంశల దవ్వున నుండెను. ఆంగ్ల తారాపటమున మనుతార Alpha Draconis.

## పురాణత్రయశ్రవణము

వాయుపురాణము —

నృపతిసత్తముడు విక్రాంతుడు అనఘుడు తేజుడు అగు అసీమకృష్ణుడు ధర్మము ననుసరించి భూమి నేలుచుండగా నైమిశారణ్యమున ధర్మక్షేత్రమగు కురుక్షేత్రమందు దృషద్వతీనదీతీరమున అరజస్కులును, శాంతులును, దాంతులును, సంశితాత్ములును, సత్యవ్రతులు నగు ఋషులు శాస్త్రోక్తపాకముగా దీక్షితులై ఒక దీర్ఘసత్రమును మొదలిడిరి. అపుడు పౌరాణికోత్తముడును, సూతకులజాతుడును నగు లోమహర్షణుడు వారల యాగమునకు వచ్చెను. అతని పలుకుల వలన వినువారికి పులకలెత్తెడివట. అతడు వేదవ్యాసులవారి శిష్యుడు. చాల మేధావి. త్రిలోకవిశ్రుతుడు. అతనిలో ఐదవ వేదము మూర్తీభవించెను. అపు డా సత్రమున గృహపతి ఋషులు కుతూహలము మెఱిసి "సూతా! నీ వితిహాసములను పురాణములను గురించి వ్యాసు నుపాసించితివి. ఇచట నున్న ఋషు లందఱును పురాణము వినగోరుచున్నారు. వీరు నానా గోత్రములవారు. వీ రందఱును నీవలన తమతమ పెద్దల వంశవృత్తాంతము వినగోరుచున్నారు. మేమీ యజ్ఞారంభమునకు మును పే నిన్ను తలపెట్టితిమి." అని అడిగినట్లు కలదు. ఈ అధిసీమ కృష్ణునకే అధిసోమకృష్ణు డని పాఠాంతరము.

---

౬. 'భూః ప్రపద్యే భువః ప్రపద్యే స్వః ప్రపద్యే భూర్భువఃస్వః ప్రపద్యే బ్రహ్మకోశం ప్రపద్యేఽమృతం ప్రపద్యేఽమృతకోశం ప్రపద్యే చతుర్జాలం బ్రహ్మకోశం యం మృత్యు ర్నావపశ్యతి తం ప్రపద్యే దేవాన్ ప్రపద్యే దేవపురం ప్రపద్యే పరీవృతో పరీవృతో బ్రహ్మణా వర్మణాఽహం తేజసా కశ్యపస్య. యస్మై నమ స్తచ్ఛిరో ధర్మో మూర్ధానం బ్రహ్మోత్తరా హను ర్యజ్ఞో ధరా విష్ణుర్హృదయం సంవత్సరః ప్రజననమశ్వినౌ పూర్వపాదా వత్రి ర్మధ్యం మిత్రావరుణా వపరపాదా వగ్నిః పుచ్ఛస్య ప్రథమం కాండం తత ఇంద్ర స్తతః ప్రజాపతి రభయం చతుర్థమ్. — స వా ఏష దివ్యః శాక్వరః శింశుమార స్తం హ.' మొదటి వాక్యమునందలి 'చతుర్జాలం' గమనింపదగినది. తోకమీది నాలుగు నక్షత్రములను అన్నమయాది మొదలగు నాలుగు కోశములని రూపకము. ఈ భావనను అన్ని పురాణములును వదలి సమగ్రభావనచే వివరింప బొరబాటెను.

మఱియు తొంబదితొమ్మిదవ అధ్యాయమున—

"ఇపుడు ధర్మాత్ముడును, మహాయశస్కుడు నగు అధిసీమకృష్ణుని ఏలుబడిలో దృషద్వతీతీరమున దుశ్చరమగు దీర్ఘసత్రము మొదలికి రెండేండ్లు దాటెను...... పౌరవుడగు అధిసీమకృష్ణు డిపుడు రేడు" అని కలదు.

విష్ణు మత్స్యములందును ఈ అధిసీమకృష్ణుని మాట కలదు.

## అధిసీమకృష్ణుడు

### ఈ క్రొత్త కృష్ణు డెవడు?

పరీక్షిత్తునకు కుమారుడు జనమేజయుడు, వాని కొడుకు శతానీకుడు, వాని కొడుకు అశ్వమేధదత్తుడు, వాని కొడుకు అధిసీమకృష్ణుడు. కాగా ఇతడు పరీక్షిత్తునకు నాలవవాడు. కురుసంగ్రామ సంవత్సరమున పరీక్షిజ్జననము. కావున పరీక్షిత్తునకు సుమారు నూరేండ్ల పిదప ఈ వాయుపురాణశ్రవణము. మరియు కొంత రచనము. పురాణము లన్నియు పూర్వకాలమున చెప్పకయే ఒక్కసారి ఆవిర్భవించె నని అనుకొనువారు పరీక్షిత్కాలమున గూడ పురాణరచనము కల దని వినుచో వింత పొందుదురు. విష్ణుపురాణము పరీక్షిత్పర్యంతము చెప్పికొని వచ్చి "ఇల్లిత డిపుడు ఈ భూమండలము నఖండాయతి ధర్మముగా ఏలుచున్నాడు" 7 అని చెప్పెను. వాయు మత్స్యములు రెండును అధిసీమకృష్ణుని పిమ్మటి రాజవంశమును, విష్ణుపురాణము పరీక్షిన్నంతర రాజవంశమును వర్ణించెను. మత్స్యపురాణమున శౌనకుడు శతానీకునకు యయాతి చరితము చెప్పె నని కలదు. విష్ణుపురాణమున—

"ఎవ డిపుడు రేడో, అతనికి నలుగురు కొడుకులు పుట్టగలరు. పెద్దవాడు జనమేజయుడు. వాని కొడుకు శతానీకుడు, వాని కొడుకశ్వమేధదత్తుడు. వాని కొడుకధిసీమకృష్ణుడు".

అని కలదు. కావున పరీక్షిత్కాలమున విష్ణు భాగవత పురాణములును, జనమేజయుని కాలమున భారతేతిహాసమును, శతానీకుని కాలమున మూలపురాణము నందు కొన్ని అంశములును, అధిసీమకృష్ణుని కాలమున వాయుపురాణమును; తదనంతరమున మత్స్య పురాణము విస్తృతము అయియుండును.

## పురాణవక్తలు

"వేదవ్యాసులు వేదములను విభజింప దలపెట్టి పైల వైశంపాయన జైమిని సుమంతులు అను నలుగురను వేదపారగులను శ్రావకులనుగా చేసెను. పిదప అతడు సూతకులమున బుట్టిన లోమహర్షణునకు ఇతిహాసములను, పురాణములను చెప్పెను" 8 అని విష్ణు పురాణము.

ఈ ఐదుగురు శిష్యులకును పలువురు శిష్యులు కలరు. లోమహర్షణునకు ఆరుగురు శిష్యులు. వారిలో మూవురు గురువు చెప్పిన సంహిత నవలంబించి మూడు సంహితలు చేసిరి. ఈ రీతిగా గురువుగారి దొకటియు, శిష్యులవి మూడును గలిసి నాలుగు సంహితలాయెను. ఈ నాలుగు సంహితల సారమే విష్ణుపురాణము 9. వేదవ్యాసులు భారతసంహితను, పురాణ సంహితలను జెప్పిరి. వారు చెప్పిన సంహిత లిపుడు దొరకుట లేదు. కాని వారి పురాణసంహితలకు మూల గ్రంథకర్త ఒకడే యగుటవల్లను, లేక పలువు రయినను వారి గ్రంథములకు మూలము వేదమును, గురుసంప్రదాయమును, జనశ్రుతియు ఒకటియే యగుటవల్లను భారతమునందును, మిగిలిన పురాణములందును భేదముకంటె ఐక్యమే ఎక్కువ కానగును. పరీక్షిత్తు లయినవాని యందును ఈ ఐక్యము చెడలేదు. బ్రహ్మసృష్టియు, ఋషివంశమును, రాజవంశమును, భూవిన్యాస వర్ణనమును, జ్యోతిశ్చక్రవర్ణనమును, మన్వంతర వర్ణనమును, సప్తద్వీపముల వర్ణనమును, ఇంకను చాల విషయములు వాయు విష్ణు మత్స్య పురాణములందు అవికలముగా ఒకటి. ఈ మాటను ఈ ఐక్యము లేనిచో ఈ మూటికిని మూల మొకటియే యని అనుమింపుటకు వీలులేదు. వెనుకటి మాట ఏమైనను అనుకొన్నను అన్నియు ఈ విషయములు వేదవ్యాసుల నాటినుండి యైనను సమానముగా వచ్చుచున్నవి.

## పురాణముల మూలము

వేదవ్యాసులవారికి ఇన్ని పురాణములు చెప్పుట కుపకరణ మెచటిది? పురాణకథ లల్పములు కావు. అల్పకాలమునకు సంబంధించినవియు కావు. అనినచో దీనికి ప్రత్యుత్తరము పురాణములందే కలదు. వ్యాసు డొకడు కాడు. వ్యాసనామ మొక యుపాధి. అనగా పురాణకర్తలందఱకును వేఱు వేఱు పేరు లున్నవి. నేడు పండితులు రామశాస్త్రి, సోమశాస్త్రి యని 10

7. ౪-౧-౨౩. గోరఖ్‌పూర్ ప్రతి. 8. ౩-౬-౧౩. 9. ౩-౬-౧౮. 10. ఈ సమాసము దక్షమని 'విశేషణం విశేష్యేణ బహుళమ్' అను సూత్రము మీద మహాభాష్యోద్యోతమున నాగేశుడు. విశేష్య విశేషణభావము కామచారము అగుట దీనికి బీజము

వ్యవహరించుకొనుచున్నటులు వాడు పురాణకర్తలకు 'జయవ్యాస' 'శక్తివ్యాస' 'కృష్ణద్వైపాయన వ్యాస' ఈ రీతిగా వ్యవహార ముండెడిది. ఆయాయీ యుగములం దాయాయీ వ్యాసులు పుట్టిరి. వారు వేదసంహితలను, పురాణసంహితలను జేసిరి. గత వ్యాసుడు కృష్ణద్వైపాయనుడు. ఇతని తిరోధానాత్ ఇంత వాడు ఇప్పటికి మఱి పుట్టలేదు. పుట్టబోవు శ్రేణి వ్యాసుల సంగతి మనము చెప్పజాలము. ద్వైపాయన వ్యాసుడు పూర్వసంహితలను గురువులకడ నోట చెప్పకొనుగాక, లేక వ్రాసినవానిని పఠించుగాక, సంపూర్ణముగా గ్రహించి వానిని వ్యాసపఱచెను. వ్యాస మనగా విపులము, లేక విభజనము. సమాస మనగా సంగ్రహము. సరియ. ఇతనికి మూల మెచట? విష్ణుపురాణమున—"దీనికి వక్త పరాశరుడు, శ్రోత మైత్రేయుడు." అని కలదు. పరాశరుడు ద్వైపాయనుని తండ్రి. మైత్రేయుడు పరాశరుని శిష్యుడు. మఱియు నొకచోట ఆ విష్ణుపురాణమునందే వసిష్ఠునికడ పరాశరుడు వినినటులు కలదు. కావున పురాణములు పరాశరుని కడకును, అతని ముత్తాత వసిష్ఠునికడకును వేళ్లు పెట్టెను[11]. విద్యావంశమున వసిష్ఠునకు కృష్ణద్వైపాయనుడు ఇరువది యొకటవవాడు (మా: వా. ౧౦౩-౨౩,౬౬) దీనిబట్టి చూడ ఈవసిష్ఠుడు పరాశరునకు తాతగాని ముత్తాతగాని కాడు. అది యటుండె. ఆ వంశమున పుత్రపౌత్ర పారంపర్యముగా పురాణ విద్యయు, దానికి మూలమగు బ్రహ్మవిద్యయు వచ్చుచున్న దని ఇం దసంగత మేమున్నది?

## లోమహర్షణుడు- అధిసీమకృష్ణుడు

పరీక్షిత్కాలమున ద్వైపాయనుని కుమారుడు శుకు డుండవచ్చును. మఱియు ద్వైపాయనుడును ఉండవచ్చును. కాని ద్వైపాయనుని తండ్రి ఎటు లుండగలడు? ఒక వేళ నాటికిని బ్రతికి యున్నాడా?

భాగవత ప్రథమశ్రోత పరీక్షిత్తు. వక్త శుకుడు. శుకుని కాలమున లోమహర్షణుడు కలడు. అతడు పరీక్షిత్ ప్రప్రపౌత్రుడు — అధసీమకృష్ణుని కాలమున నున్నాడా?

పరీక్షిత్కాలమునందే లోమహర్షణుడు లేడు. ఒక సత్రమున నతడు పురాణము చెప్పుచుండగా బలదేవు డచటికి వచ్చెను. ఋషు లందఱును లేచి నిలుచుండిరి. సూతుడు లేవలేదు. బలరాముడు కోపించి సూతుని తునిమెనుగదా. అప్పుడు మరణించిన లోమహర్షణుడు పరీక్షిత్ ప్రప్రపౌత్రుని కాలమున నున్నాడా?

ఈ ప్రశ్నలకు ఆంగ్లేయులకు సమాధానము దొరకకుండెను. వారందఱు నిట్టి విషయములు సూచినంతమాత్రముననివి యన్నియు అసంగతము లని త్రోసి వేసిరి.

ఈ పై శంకలకు సమాధానము కడు సులభము. ద్వైపాయనుడే ప్రథమ సంహితాకారుడు కాడు. అతని తండ్రి పరాశరుడును సంహితాకారుడు. అతని తాతయు సంహితాకారుడు. కాని, ద్వైపాయనుడొనరించిన సంహితలనే అతని శిష్యులును, ప్రశిష్యులును ప్రచార మొనరించిరి. ఒకటి రెండేమి ఎన్నియో సంహితలు ఇంకను మిగిలి పోయియుండును. వానిలో నొకటి మూలవిష్ణు పురాణమున కాధారము. తత్కర్త ద్వైపాయనుని తండ్రి పరాశరుడు.

## ఆదికర్తయే గ్రంథభర్త

ఆ కాలమువారు సత్యసంధులు. వారు కీర్తి కొఱకు ఇతరుల ద్రవ్యమును దొంగిలించువారు కారు. వారు ప్రాచీనవిషయములను కొన్నింటిని పరివర్తించియు, నూతనవిషయములను కొన్నింటి ననువర్తించియు మూలమును భ్రమింపువారు కారు. సంహితకాదికర్త పరాశరుడయినచో దానికి సంస్కరణములును, లోపములును, గ్రంథపాతములును, ప్రక్షేపములును, అంతస్థాపనములును, ఇట్టి వెన్నియో జరిగినను కర్త మాఱడు. అతడు పరాశరుడే. తమ్ము తమతమ గురువులలో లయము చేసికొనగల భక్తి యా శిష్యులకు గలదు. కేవలము పురాణముల మాటయే కాదు. అన్ని దర్శనము లందును ఇంతే. పరాశరుడిపుడు మనకు కనిపించు విష్ణుపురాణకర్త కాడు; అతని శిష్యశిష్యు డెవడో. పరాశరు డాది సంహితాకర్త కావున సంస్కరణములచే బలసిన నేటి విష్ణుపురాణమునకును అతడే కర్త. ఇది పరాశరోపజ్ఞము. కావున నతడే వక్త. అతని శిష్యుడు పరీక్షిత్ కాలమున నుండవచ్చును. అందు అసంగత మేమియు లేదు. లోమహర్షణుని సంగతియు గూడ

11. వసిష్ఠ మునుడు పరాశరు డని విరుక్తము.

నింగిదే. పీటమీద కూర్చున్నవాడు వసిష్ఠు. వ్యాస పీఠము పట్టినవాడు లోమహర్షణుడు. 12

పరీక్షిత్తు పేరును, అధిసీమ కృష్ణుని పేరును జెప్పి అధునాతను డొకడు దీనికి పురాణత్వము కల్పించె నని కొందఱు తలపోయవచ్చును. మఱియు ఇంతమంది వ్యాసులనుట అసత్యము, ద్వైపాయను డొకడే నిక్కము; అతని కిటీవల నెంతోమంది వ్యాసులు అంబికాదత్తవ్యాసులవలె బయలుదేఱి కొన్ని పురాణములు రచించి ద్వైపాయనుని కంటగట్టి యుందురు అని యెందఱో బుద్ధిమంతులు ఎన్నో వికల్పములు చేయవచ్చును. ఇట్టి వికల్పములకంటె ప్రాచీన లోనన్ బహు 13 వ్యాసావిష్కార వాదము దొడ్డది కాదా? మఱియు వ్యాసు డొకడే పదునెనిమిది మూల పురాణములను చెప్పవచ్చును. దానఁజేసి బృహత్కాయములు గల వీని యన్నింటికిని వ్యాసుఁడే ఆదికర్త. ప్రకృతము మనకు కనుపట్టు నీ పెద్దపెద్ద సంస్కరణము లొక నాటివి కావు.

పరాశరుడు వక్త యని విష్ణుపురాణమున జూచితిమి. అతడు వసిష్ఠునికడ వినెను. అత డెవనికడనో వినియుండవలెను. అతడు ఇంద్రునికడ, అతడు మృత్యువుకడ, అతడు సవితకడ, అతడు బృహస్పతికడ, అతడు శుక్రునికడ, అతడు వాయువుకడ, అతడు బ్రహ్మకడ వినెను. ఈ రీతిగా ఇది అనాది. వేదము లనాది యనినతో ఈ చింతాధారలో తార్కికుని మనస్సుకూడ నెదురు తిరుగదు. వారికి పూర్వము ఎన్ని పురాణములు, ఎన్ని వేదములు, ఎంత విజ్ఞానము ఉండెనో ఆ సంగతి ఊహాగమ్యమా? ప్రపంచ మనాది. జ్ఞాన మనాది.

## సూతులు

"మహాత్ములగు ఋషులయు, రాజులయు వంశచరిత్రమును ధారణపట్టుట సూతుల పని" అని వాయు పురాణము 14.

పూర్వము భరతఖండమున ఎన్నియో దేశము లుండెడివి. ఒక్కొక్క దేశమున కొక్కొక్క రాజుండెడివాడు.

ఋషులును, రాజులను తఱచు యజ్ఞములు చేయుచుండెడివారు. రాజులందఱికడను సూతు లుండెడివారు. వారు తమతమ ఏలికల వంశచరిత్రమును, యశఃకలాపమును గానము చేయుచుండెడివారు.

తెలుగువాడులో భట్రాజులు సూతు లను కొందురు. భట్టరాజ భట్టమూర్తి భట్టవర్తి ఈనామము లెందలగు పదముల చరిత్రమును తెలిచి చూచునది.

ఈ రీతిగా సూతులు State Historians. యుద్ధములందును, వివాహములందును తమ రాజుల కుత్సాహము కలిగించుట కై సూతులు తమ చుట్టు ప్రక్కల నున్న ద్వాదశరాజమండలము చరిత్రమును గూడ కంఠస్థము కావించుకొనెడివారు. అట్టియెడ సూతులు సత్యవ్రతపరాయణు లని పురాణము చెప్పును. వీరప్పటి Department of Imperial records. కాని, వీ రతిరంజనము చేయకమానరు. కావుననే 'బూరు పొగడినట్లు పొగడెను' అని భారతము, సభా. ౨-౮౫.

---

12. వసిష్ఠులు పలువురు. మూలపురుషుని పేరనే వ్యక్తుల చలామణి. ఉపనిషత్తులయందీ వ్యవహారము బహుళము. ఈ వ్యవహారము నేటికిని ఉత్తరదేశములలో గలదు. మనలో తాతతండ్రుల పేరే ఆ స్త్రీతోపాటు బహుళముగా సంక్రమించుచున్నది. పై రీతిగా వసిష్ఠగోత్రము వారందఱును వసిష్ఠులే. ఇంతియకాక ఇంకొక గోత్రము వా డయినను పీట నెక్కిన యెడల వాడు వసిష్ఠు. నేటి పురోహితునకు వసిష్ఠ పర్యాయపదము. మొదటి వసిష్ఠుడు బ్రహ్మమానసపుత్రుడు. ఆ స్మృతి యావిధముగా నేటికిని మనము రక్షించుకొనుచున్నాము.

13. వైవస్వతమన్వంతరమున ప్రత్యేక ద్వాపరయుగముల మహర్షులు వేదము నిప్పటికి ఇరువది ఎనిమిది మాఱులు విభజించిరి. వారికి వ్యాసు లని పేరు. ఆ వ్యాసులు వీరు—స్వయంభువు ప్రజాపతి శుక్రుడు బృహస్పతి సవిత మృత్యువు ఇంద్రుడు వసిష్ఠుడు సారస్వతుడు త్రిధాముడు త్రిశిఖుడు భరద్వాజుడు అంతరిక్షుడు వర్ణి త్రయ్యారుణుడు ధనంజయుడు క్రతుంజయుడు జయుడు భరద్వాజుడు గౌతముడు హర్యాత్మ వాజశ్రవుడు తృణబిందుడు ఋక్షుడు (వీరికి వాల్మీకి యనియు పేరు) శక్తి పరాశరుడు జాతుకర్ణుడు కృష్ణద్వైపాయనుడు. (చూ. విష్ణు. ౩-౩. ౯...౧౯.)

14. స్వధర్మ ఏష సూతస్య సద్భిర్దృష్టః పురాతనైః। దేవతానా మృషీణాం చ రాజ్ఞాం చామితతేజసామ్. వంశానాం ధారణం కార్యం శ్రుతానాం చ మహాత్మనామ్. నహి వేదే ష్వధికారః కశ్చి త్సూతస్య దృశ్యతే. వైన్యస్య హి పృథో ర్యజ్ఞే వర్తమానే మహాత్మనః. సుత్యాయా మభవ త్సూతః ప్రథమం వర్ణవైకృతః. —వాయు—౧-౩౧,....ఇటీవలి స్మృతులలో సూతమాగధులు ప్రతిలోమ జాతివారు.

వేదాంగజ్యోతిషముకూడ ధనిష్ఠలో ఉత్తరాయణ ప్రవేశము చెప్పెను 15.

“పూర్వశాస్త్రములందు ఆశ్లేషార్ధమున దక్షిణాయనమును, ధనిష్ఠాదిని ఉత్తరాయణమును ఆమోదించి” అని తెలుపు బృహత్సంహితలో వరాహ 16 మిహిరుడు. “ఈ పూర్వశాస్త్రములు పరాశరాదులు చెప్పినవి” అని భట్టోత్పలుడు. “సౌమ్యాద్యా శ్లేషార్ధాన్తం గ్రీష్మః” అని పరాశరసంహితనుండి అతని ఉద్ధరణము 17.

ఇప్పుడు ఆర్ద్రాదిలో ఉత్తరాయణ మంత్య మగుచున్నది. వాటికిని వీటికిని అయనము ౪౭° నక్షత్రములు వెనుకబట్టెను. ఇంత వెనుకబట్టుటకు ౩౩౬౦ ఏండ్లు పట్టును.

## అగస్త్యుడు

అగస్త్యునిగురించి ఈ మూడు పురాణములందును గలదు. బృహత్సంహితకు వ్యాఖ్య వ్రాసిన భట్టోత్పలుడు పరాశరుని గ్రంథమునుండి అగస్త్య ఉదయాస్తమయముల గణనము నుదాహరించెను—“రవి హస్తలో చేరబడును అగస్త్య ఉదయము. రోహిణిలో చేరబడును అస్తమయము.”

కోల్ బ్రూక్ 18 లెక్కవేసి “క్రీ. పూ. ౧౩వ శతాబ్దిలో అగస్త్య ఉదయాస్తమయములు ఇటులు జరుగును” అని చెప్పెను.

క్రీ. పూ. ౧౩౭౨వ అబ్దమున ధనిష్ఠలో ఉత్తరాయణ ప్రవేశము. దానికి మునుపటి మహా దేవతుల మాట యీ మాటను ఉన్నది కాని ధనిష్ఠకు పిదప అయనప్రవేశముమాట లేదు. కావున పరాశరుడును, ఈ మాటి మూలమును క్రీ. పూ. పదునాలుగవ శతాబ్దికి చెందినవి.

ధనిష్ఠ క్రీ.పూ. ౧౩౭౨లో ధ్రువక ౨౯౬°-౪౧' స. విభాగ ౨౭౦°-౦' మున ఉన్నది. ధనిష్ఠ Alpha Delphini కాదు, మరి Beta Delphini. ఇది పారాశర్యసంహితా సూర్యసిద్ధాంతములకు కొంచెము భిన్నము. దానికి గల ఉపపత్తినిగూర్చి విడిగా వ్రాయవలసియున్నది.

## భూగోళచిత్రము

భారతమునందలి పండితులు భూగోళ మెఱుగరనియు, కావుననే భూగోళచిత్ర మెఱుగరనియు, గ్రీకు దేశమునందలి హికేటూస్ అను పండితుడు జగత్తులో నెల్ల మొదటి భూగోళకర్త యనియు, అతని సమయము క్రీ. పూ. ౫౫౦-౪౭౫ అనియు కొందఱు తలతురు. పరాశరుడు భూగోళచిత్రమునేకాక, ఖగోళచిత్రమునేకాక, కాలతలతో గూడ బ్రహ్మాండచిత్రమునే మన మనఃఫలకముల మీద చిత్రించెననియు, అదియు క్రీస్తుకు పదునాలుగు శతాబ్దుల వెనుక ననియు పాఠకులు గట్టిగా తెలిసికొని

---

15. మాఘశుక్లప్రపన్నస్య పౌషకృష్ణసమాపినః, యుగస్య పంచవర్షస్య కాలజ్ఞానం ప్రచక్షతే. వే. జ్యో. ౫. ఆ నాళ్లలో మాఘ శు. పాడ్యమి ఉగాది. మాఘ ౧౫ మఘ. దానికి ౧౪ నక్షత్రముల వెనుక శతభిష. దానికి పిదప ధనిష్ఠ. మాఘపూర్ణిమకు వెనుక ౧౪ న రవి ధనిష్ఠలో నుండును. ధనిష్ఠాదిని దక్షిణాయనము ముగియుచో నటకు ౯౦ అంశల వెనుక విషువము. ౯౦ అంశములు అనిన నెంతో ౬¾ నక్షత్రములైనను అంతే. కావున వేదాంగజ్యోతిషకాలమున ధనిష్ఠనుండి అనులోమముగా ఏడవదగు భరణి శేషపాదమునందు విషువ మాయెనిది. ‘శ్రవణాంతం శ్రవిష్ఠాదియుగం స్యాత్పంచవాత్సరమ్’ వాయు—౫౩.

16. ఆశ్లేషార్ధాద్దక్షిణ ముత్తర మయనం రవే ర్ధనిష్ఠాద్యమ్. నూనం కదాచి దాసీ ద్యేనోక్తం పూర్వ శాస్త్రేషు. —బృహత్సం.

17. మృగశిర మొదలునుండి ఆశ్లేషార్ధమువఱకు గ్రీష్మము. ఉత్తరాయణాంతముతో గ్రీష్మాంతము. రవి దక్షిణాశనుండి ఉత్తరాశ నారోహించుట ఉత్తరాయణ మనియు, ఉత్తరాశనుండి దక్షిణాశ కవరోహించుట దక్షిణాయన మనియు ప్రాచీనులు. కాని యీ నియమ మెల్లెడల నుండలేదు. కొంత కాలము తరువాత విషువత్ప్రవృత్తమునకు ఉత్తర దక్షిణముల రవిభ్రమణము క్రమముగా ఉత్తర దక్షిణాయనము లని వ్యవహారములోనికి వచ్చెను.

18. శ్రీ కోల్ బ్రూక్ క్రీస్తుకు వెనుక ఇన్ని శతాబ్దుల చూపలేక — ‘ఆఁ, వట్టిమాట, పరాశరు డేమిటి ఇంత ప్రాచీను డేమిటి’, అని గుండె బాదుకొని, ‘అత డే పూర్వుల మాటనో గ్రంథస్థము చేసియుండును.’ అని వ్రాసెను. సింప్రాసి వారు క్రీస్తు వెనుక కాలమే లే దందురు.

యుందురు. మఱియు భూగోళానుసార మాలయములు కట్టుట సంప్రదాయము. ఇది తెలిగని చిత్రగుప్త కదా [19].

## ముక్కారు పంట

ఈదేశ పురాణములు చాల ప్రాచీనములు. మూలపురాణము మూడువేల అరున్నూటేండ్ల వెనుక రచితమై పదపటి వేయేండ్లలో నొకమాఱును, ఇరువది రెండువేల యేండ్లక్రింద రెండవమారును, పదేనువందల యేండ్లక్రింద మఱొకమాఱును పరివర్తితమును, సంస్కృతమును, ప్రక్షిప్తపూర్ణము నాయెను. కాన భూగోళ రచన సుమారు ౩౩౦౦ యేండ్లక్రింద ఎంతో వెనుక మొదలై క్రీ. శ. ౪౦౦ యేండ్లవఱకు పరిపుష్ట మగుచు వచ్చె ననిన అసంగతము కాదు. ఇందలి పాఠభేదముల కిపుడు కారణము కనుగొనుట మిగుల సులభము.

మొదట భూమి చతుర్ద్వీప, చతుస్సాగర. నడుమ సప్తద్వీప, సప్తసాగర. చరమకాలమున నవవర్ష, బహువర్ష, అష్టాదశద్వీప, అనంతద్వీప. బహుసాగర, అనంతసాగర.

---

19. '... పదరహీ గణపతిగారి కుమారుడైన శ్రీ గణపతిగారి హయాములో పిన్నచోడరాజు సేనాధిపత్యం వహించి ఈ దేశానికి ప్రభుత్వం చేసే కాలమందు అతను చేబ్రోలులో భూగోళ ప్రకారంగా శివాలయం కట్టించి చోడేశ్వరు డనే లింగమూర్తిని ప్రతిష్ఠచేసి, ఆ దేవునికి ఈ గ్రామం శా.శ.౧౧౫౩ వందు యీనాం యిప్పించి శ్రీవీరభద్రేశ్వరస్వామివారి ఆలయం బాగుగా కట్టించినారు.' మెకంజీ వాల్యూం. ౧౪-౨౨.

---

### ౪ వ వ్యాసములో సవరణ

౪౩౫ పుట. రెండవ దళము, ౨౩ పంక్తి—'సూర్యచంద్రుల ప్రకాశము—సూర్యచంద్రుల అప్రకాశము' అని దిద్దుకొనవలెను.



# అష్టమసర్గ

[కథానకము]



— శ్రీ శివశంకరశాస్త్రి —

వర్షము కురవడము లేదు. కాని పశ్చిమదిక్కునుంచి ఆర్ద్రవాయువు వీస్తున్నది. త్వరలోనే వాన పడుతుంది. ఆకాశాన త్వరత్వరగా పోతున్న మేఘాలు నిండుగా ప్రవహిస్తున్న సిప్రానదీవక్షముమీద ధూసరచ్ఛాయ వేస్తున్నవి. సిప్రానదీ తూర్పుఘట్టమున అనేకశిలా సోపానములు కట్టి ఉన్నవి. వాటిపక్కన జలధార నదీగర్భాన ప్రవేశిస్తున్నది. అక్కడ నీరు సుడి తిరుగుతున్నది.

ఘట్టాన ఎవరూ లేరు. మరొక రోజున అయితే స్నానముచేసే స్త్రీలగుంపు కనబడేదే. ఇంతలో ఒకానొక యువతి వచ్చి ఆకాశమువంక చూసి కలశము నిండా నీరు నింపుకొని తొందరగా వెళ్ళిపోతున్నది. ఒక కన్య మంజీరములు మోగుతుండగా పాదన్యాసము చేస్తూ వేగిరము స్నానముచేసి పూర్ణ ఘటము చంకన ఎత్తుకొని సోపానము లెక్కి వెళ్ళిపోతున్నది.

ఒకానొక పురుషుడు జలపాతము దగ్గిర చింతామగ్నుడై కూర్చున్నాడు. అతనికి రమారమి ముప్ఫయి అయిదు సంవత్సరా లుంటవి. శరీరము కరిగిపోసిన బంగారమువలె ఉన్నది. యజ్ఞోపవీతము కనబడుతున్నది. లలాటమున ధవళచందన త్రిపుండ్రము. మేఘచ్ఛన్నమైన ఆ వర్షాసంధ్యాకాలపు మసకలోకూడా ఖడ్గము వంటి అతని నాసిక, విశాల నేత్రములూ కనిపిస్తూనే ఉన్నవి. ఆయన మధ్యమధ్య ఆకాశముకేసీ, నదీతరంగములకేసీ చూస్తున్నాడు.

అతని ముఖము చింతాక్రాంతము. రెండురోజుల నుంచీ ఒక జటిలప్రశ్నకు సమాధానము దొరకక ఆయన ఆలోచనలో పడ్డాడు. అలంకారశాస్త్రము తిరగవేసి చూడు, సమాధానము రాలేదు. అవంతీ ప్రభువూ, ఆయన పరిషత్సభ్యులైన రసికులూ సమాధానముకోసము వ్యగ్రతతో ప్రతీక్షిస్తున్నారు. అతని ఔదాసీన్యమూ, పరధ్యానమూ చూచి ఇల్లాలు సందిగ్ధమనస్కురాలు అయింది. ఆమెకు వివిధ చింతలవల్ల రాత్రి నిద్ర పట్టలేదు.

ఇంతలో కొంతమంది కోమలాంగులు మంజీర ధ్వనులతో సోపానాలు దిగినారు. అతనిని గమనించలేదు. ఉత్తరీయములూ, కలశములూ మెట్లమీద ఉంచి నీళ్ళలో దిగి జలక్రీడ చేస్తున్నారు. కొంచెము దూరములో ఉన్న ఆ పురుషుడు ఉలికిపడి వారివైపు చూచి తల వంచుకొని వారి ఆలాపములు వింటున్నాడు.

"నిన్న మీ ఆయన దేశాంతరమునుంచి వచ్చాడు. కాబట్టి..." మిగిలిన పలుకులు హాస్యధ్వనులలో లీనమైపోయినవి.

"ఏమిటే, ఏమిటే, ఏ మయింది!"

"ఏమీ లేదు. చెప్పను!"

"...పాపం, లోలకు ఎంతకష్టం! ఆమె భర్త ఇంతవరకూ తిరిగి రాలేదు. ఎవరికి తెలుసు! యవద్వీపము ఎంతదూరమో చెప్పగలవా?"

"సింహళము దాటిపోవాలి. ఆరుమాసాల ప్రయాణము. కష్టం వేస్తుంది లోలకోసము!"

"చూడు, మేఘాలు తూర్పుగా వెళ్ళుతున్నవి."

"అవును. ఇవి అలకానగరము వెళ్ళవు."

పురుషుడు చెవులు నిక్కించి వారిమాటలు విన డానికి యత్నించినాడు. కాని అట్టే వినబడలేదు. యువతులు స్నానాలు చేసి సోపానాలు ఎక్కినారు.

అందులో ఒక తరుణి పురుషుని గుర్తుపట్టి చప్పున వస్త్రము చుట్టుకొని "మయూరికా, ఒక్కమాటు ఇలా రావే" అన్నది.

ఉలికిపడి అందరూ అటు చూచి కొంచెము సిగ్గుపడినారు. ఉత్తరీయాలు గబగబ కప్పుకొన్నారు.

మయూరిక మందరస్వరాన పురుషుని పేరు ఉచ్చరించింది. నిముషములో కనుసంజ్ఞ జరిగింది. తర్వాత తరుణు లంతా శాంతంగా ఆయనదగ్గిరికి వెళ్లి నిలుచున్నారు.

"భట్టుమహాశయులు మా అందరి ప్రణామాలు స్వీకరింతురుగాక!" అని మయూరిక చేతులు జోడించింది.

"ఆయుష్మతీభవ! మీ రందరూ ఏదో అనుకొంటున్నారే" అని భట్టు చిరునవ్వుతో అన్నాడు.

యువతులు ఒకరి ముఖము ఒకరు చూచుకొన్నారు. ఆ మాటలు పురుషునికి— అందులో భట్ట మహాశయునికి, చెప్పడము ఎలాగు!

అందరిలో కొత్త ప్రగల్భురా లయిన మంజరిక కౌతుకచంచలదృష్టితో చూచి "భట్టమహాశయా, ఈవేళ మేఘాలు తూర్పుదిక్కుగా వెళ్లుతున్నవి. ఉత్తరాన ఉన్న అలకానగరికి వెళ్ళ వని ఆక్షేపిస్తున్నాము" అన్నది.

"అందుకోసము ఆక్షేపించాలా?"

"యక్షపత్ని విరహవేదనతో కాలము గడుపుతున్నది. యక్షుని వృత్తాంతము తెలియలేదు. అందుకని—"

"మీరు మేఘదూత కావ్యముసంగతి అంటున్నారు. మంచిది; కావ్యశిల్పములో చతురురాండ్రవలె కనబడుతున్నారు. నా ప్రశ్నకు సమాధానము చెపుతారా?"

"సెల వియ్యండి" అన్నారు చేతులు జోడించి అందరూ. భట్టు ఆలోచించి శిరఃకంపము చేసి "అది చాలా కఠిన ప్రశ్న. మీరు చెప్పలేరేమో" అన్నాడు.

"అయినా సెల వియ్యండి ఆర్యా!" అని మంజరిక అనునయముతో అన్నది.

"మంచిది. వినండి. కావ్యములో నాయికానాయకులకు వివాహము సమకూడితే, కవి ఇంకా చెప్పవలసినది ఏ మయినా ఉంటుందా?"

భట్టుమాటలకు అందరూ ఆశ్చర్యముతో నిశ్శబ్దముగా ఉండిపోయినారు. తమవంటి అపరిణతబుద్ధు లయిన యువతులను కావ్యమీమాంసావిషయమై ఆయన అడుగుతా డని వారు భావించలేదు.

చివరకు మయూరిక మెల్లిగా "ఆర్యా, నాయికానాయకుల సమ్మేళనము కాగానే కావ్యము సమాప్త మయినట్టే. ఆ తర్వాత కవి చెప్పవలసినది ఏ ముంటుంది?" అన్నది.

"నేను సమ్మేళనముసంగతి చెప్పలేదు. వివాహము మాట అన్నాను" అని భట్టు భేదము నిరూపించినాడు.

మంజరిక ఆశ్చర్యముతో. "రెండూ ఒకటే కాదా?" అన్నది.

"ఇదే ప్రశ్న!" అన్నాడు భట్టు చిరునవ్వుతో.

యువతులు అతని భావములో మర్మము గ్రహించలేక మౌనము వహించారు. భట్టు బొమలుముడిచి చింతాసక్తు డయినాడు.

అందరిలోకీ చతురురా లయినది అరుణిక. ఇంతవరకూ ఏమీ మాటాడనిది, ఇప్పుడు ముఖము తిప్పి "భట్టమహాశయా, ఈ మాట భట్టిని మహాశయను ఎన్నడూ అడగలేదా?" అన్నది.

భట్టు కొంచెము అదిరుతో ఆమెకేసి చూచాడు. ఆమె శోణాధరముమీద మందహాసరేఖ ఆడుతున్నది.

"లేదు. ఆమెను అడిగినట్టు జ్ఞాపకము లేదు. ఈవేళ ఇంటికి వెళ్ళిన తరువాత అడుగుతాను. మీరు విలంబము చేయకండి. ఇళ్ళకు వెళ్ళండి. పొద్దు పోతున్నది" అన్నాడు భట్టు.

ఇందులో వక్రోక్తి అందరికీ గోచరించలేదు. అరుణికమాత్రము గ్రహించింది. భట్టు మృదువుగా అప్పు తీర్చినా డని తెలుసుకొన్నది.

అంతట యువకులు చేతులు జోడించి "ఆర్యా, ఆశీర్వదించండి" అన్నారు.

భట్టు నవ్వి "ఏమి ఆశీర్వదించను! నేను శంకర కింకరుడను. స్వయంగా శంకరుని కృప మీకు సహాయము! మంచిది. ఆశీర్వదిస్తాను" అని క్షణము సేపు ఆగి, మేఘగంభీరస్వరముతో "మా భూదేవం క్షణమపి చ తే స్వామినా విప్రయోగః!" అని పలికినాడు.

కపోతహస్తములతో అందరూ ఆశీర్వచనము శిరసా వహించారు; ప్రఫుల్ల హృదయాలతో ప్రీతి ప్రముఖముఖములతో శ్రోణికలశభారమంధరగమనములతో బయలుదేరినారు.

౨

భట్టు అక్కడనే కూర్చున్నాడు. యువతుల నూపురస్వనములు క్రమక్రమంగా చెవికి దూరమయిపోయినవి. భట్టు మళ్ళీ ఆలోచనాపరుడయినాడు. ఏమి చెయ్యవలె! నాయికానాయకుల వివాహముతో కవి కర్తవ్యము పూర్తి అవుతుంది. కాని అతని మనస్సు కుదుటపడలేదు. కావ్యము ముగిసింది. కవి ఇక శాస్త్ర రచన చేసినా ప్రతిజ్ఞాభంగ మవుతుంది. నాయిక ముఖాన లజ్జాన్వితహాసము అంకురింపజేయడము ఉచితము. అక్కడ ఆగితే రసభంగ మయిపోతుంది. కవికి ఏమీ పాలుపోవడము లేదు.

పొద్దు పోతున్నది. సంధ్యావందనముసంగతి కవి మరచిపోయినాడు. లేతామని భట్టు ఇటూ అటూ చూచినాడు. కలశము పట్టుకొని ఎవరో యువతి వస్తున్నది. ఆమెను చూచి భట్టు మళ్ళీ చతికిలబడినాడు.

ఆ తరుణి విచారముతో నడుస్తున్నది. ఆమెకు శరీరసౌభాగ్యముతప్ప అలంకారాలు లేవు. ఆమె తల దువ్వుకొనలేదు. మెలికగా చుట్టిన కేశపాశము బుజాన వాలి ఉన్నది. కళ్లకు కాటుక లేదు.

భట్టు ఆమెను గుర్తు పట్టినాడు; చిన్నప్పటి నుంచీ ఆమె బాగా తెలిసినదే. అయితే కొంతకాలము నుంచీ ఆ యువతి కనబడడము లేదు.

కవికళ్లు చెమ్మగిల్లినవి. "లోలా!" అని ఆమెను కవి పిలిచినాడు.

ఆ పిలుపువల్ల ఆమెమాంద్యము తొలగింది. దగ్గరిగా వచ్చి ఆమె కవిసమీపాన అధోముఖిగా నిలుచున్నది.

"నీవు నావిక రైవతకుని భార్యవు కావా?" అన్నాడు కవి. ఆమె తల ఎత్తలేదు. పెదవులు కంపించినవి.

కవి మళ్ళీ ఆమెతో "నీ భర్త తనమిత్ర శ్రేష్ఠిని గతసంవత్సరము యవద్వీపానికి తీసుకువెళ్లలేదా? ఇంకా రాలేదు కాదా!" అన్నాడు.

లోల కన్నులవెంట బాష్పాలు రాలినవి. ఆమె తల ఆడించింది.

భట్టు మందహాసముతో "భయము లేదు. రైవతకుడు క్షేమమే" అన్నాడు.

లోల విచారదృష్టితో అతని ముఖముకేసి చూచింది.

"ఈవేళ దర్బారుకు తెలిసింది; రైవతకుడు పడవలతో సాగరసంగమప్రదేశానికి వచ్చాడనీ, త్వరలోనే ఉజ్జయినికి వస్తాడనీ. నీవు నిశ్చింతగా ఉండు" అని అనునయవచనాలు పలికినాడు కవి.

లోల మెడకు కొంగు చుట్టుకొని, అశ్రువులు ఊరుతున్న నేత్రాలతో కవిని చూచి ప్రణామము చేసి గద్గదకంఠముతో "స్వామీ, తమకు మహాకాలస్వామి సమస్తజయములు ఇచ్చునుగాక!" అని దుఃఖము అణచుకొని "ఈవేళ ఏ మయినా వృత్తాంతము తెలిసినదా?" అన్నది.

"తెలిసింది."

"అంతా అపాయము లేకుండా ఉన్నారు గదా?"

"ఆ. లోలా, నీవు సాటిలేనిదానవు. రైవతకుడు వస్తే అతనిని నాకడకు పంపించు. అతనికి నీ సంగతి చెపుతాను."

కన్నీరు తుడుచుకొని మందహాసముతో, అస్ఫుటస్వరముతో "చిత్తము" అన్నది లోల.

సన్నచినుకులు పడడము ఆరంభించినవి. భట్టు లేచి "లోలా, దుఃఖాంతమున సమ్మేళనము మధురము. నేను కుమారసంభవములో ఉమాదేవికి సమకూర్చిన దుఃఖాన్నిగురించి తలుచుకుంటే గుండెలు అదిరిపోతవి. చివరకు ఉమాదేవికి అభీష్టసిద్ధి అయింది. మదనుడు మళ్ళీ జీవము పొందినాడు. నీవుకూడా గౌరీదేవివలె సౌభాగ్యవతీ భవ! లేవు అమ్మవారికి పూజ చేయించు" అని సస్నేహముగా అన్నాడు.

లోల చేతులు జోడించి ఉన్నది. కవివాక్కులు బాగా గ్రహించలేకపోయింది. కాని ఆమెహృదయాన ఏదో చల్లదనమూ, సంతోషమూ అవహించినవి. భట్టు ఆమెశిరస్సుమీద హస్తముంచి, ఆశీర్వదించి సోపానములు దాటి త్వరితముగా నడిచినాడు.

## 3

కవి కొంచెము దూరము వెళ్ళినాడు. నల్లరాతితో కట్టిన మహోన్నతప్రాకారమూ, మహాకాలనాథ స్వామిమందిరశిఖరమూ ఎదురుగా కనబడినవి. నాలుగడుగులు వేసేసరికి మహాఘంటారవము వినబడ్డది. హారతివేళ అయింది. మందిరాంగణాన అనేకులు గుమిగూడి ఉన్నారు. కవి లోపలికి వెళ్ళకుండా అక్కడనుంచే భక్తితో చేతులు జోడించి ఇష్టదేవతాస్తుతి చేసినాడు. శంఖధ్వనులూ, ఘంటా నినాదములూ చెవులలో మోగుతున్నవి. కాలాగురుధూప, గుగ్గులు వాసనలు నాలుగుపక్కలా వ్యాపించినవి.

హారతి కాగానే కవి బయలుదేరినాడు. సన్నచినుకు పడుతునే ఉన్నది. చీకటి పడినది. మార్గాలకు ఇటూ అటూ ఉన్న మేడలలో దీపాలు వెలుగుతూ ఉన్నవి. అక్కడక్కడ తెరచిన వాతాయనములవెంట వెలుతురూ, జాతీ, కదంబ, కేతకీ, యూధికా మిశ్రమైన సువాసనలు పాంథులను పరవశులను చేస్తున్నవి. కవి నడిచిపోతున్నాడు.

ఉజ్జయినీ నగరములో మార్గములు చాలా సంకీర్ణములు. భట్టు పోయి పోయి, దీపోద్భాసిత సౌధ తోరణసమీపాన ఆగినాడు.

సింహద్వారానికి కొంత వెనుకవైపున పెద్ద సౌధము. దీపావళీ కాంతి అందులోనుంచి వస్తున్నది. అంగణములో పెద్దమనుష్యుల రథాలు, మేనాలు వంద లయినవి నిలిచి ఉన్నవి. సౌధములోనుంచి మధుర నాదములు వినబడుతున్నవి. ఈ వేళ ప్రియదర్శికా సౌధములో సమాపానక మనీ, తనకు ఆహ్వానము ఉన్నదనీ అతనికి జ్ఞాపకము వచ్చింది.

భట్టువదనము హాస్యోత్ఫుల్ల మయినది. తనప్రశ్నకు సమాధానము ఈ ప్రియదర్శిక వల్లనే రావాలి. ఆమె చతుష్షష్టికళలలో నిపుణురాలు. అలోకసామాన్య అయిన గణికామణి. తన రచనలలో ఉన్న రామణీయకము అందరికన్నా బాగా గ్రహించింది ఈ ప్రియదర్శిక. ఈమెవంటి కళాభిజ్ఞ అవంతీరాజ్యములో లేదు. మహామండలేశ్వరుడుకూడా ఆమె రూపముగ్ధుడు మాత్రమే కాక ఆమెరసికతకు ముఖ్యముగా ముగ్ధుడై ఆదరిస్తాడు.

భట్టు అంగణములో ప్రవేశించినాడు. అప్పుడు తన యిల్లాలు కనిపెట్టుకొని ఉంటుం దని జ్ఞప్తికి వచ్చి కొంచెము విషణ్ణు డయినాడు. తనభర్త ప్రియదర్శికా సౌధానికి వెళ్ళుతుంటా డని ఆమెకు అసంతృప్తి. అప్రియ వార్తలు వ్యాపనచేసేవారికి కొదవ లేదు. తన భర్తకూ, గణికకూ గూఢానురాగ మున్న దని ఆమెకు అనుమానము కూడా కలగక పోలేదు. గణికపేరు వినబడితే ఆమెకు కష్టముగా ఉంటున్నది. అర్ధరాత్రమువరకూ భట్టు గణికా గృహములో జరిగే గోష్ఠిలో ఉండక తప్పదు. చాలా చిక్కే!

భట్టును ద్వారపాలికలు మధురకంఠాలతో "కవీంద్రా, స్వాగతము! పండితప్రవరా, లోపలికి దయ చెయ్యండి. ఆర్యప్రియదర్శిక తమ ఆగమనముకోసమై ఎదురు చూస్తున్నది. దయచెయ్యండి మహాభాగా! మీరు రాకపోవడముచేత సభానవరత్నమాలికలో నాయకరత్నము కొరతపడ్డది. స్వాగతము!" అని పలికినారు.

పాలిక లందరూ సుందరయువతులు, రసికలు. వారు పుష్పమాలికలతో, పూర్ణకుంభములతో, సుగంధద్రవ్యములతో నిలిచి ఉన్నారు. అతిథులను వారు

సమ్మానపూర్వకముగా ఆహ్వానించారు. కవికి చాలా మధురముగా స్వాగతము చెప్పినారు. ఆయన గ్రహించి మౌని ఉల్లాసముతో లోపలికి బయలుదేరినాడు.

కవి కట్టెపుసోపానము మీద నిలవగానే ఒక పరిచారిక ఆయనపాదాలమీద నీరు పోసింది. ఇంకొకతె పాద సన్నిధానములో కూచుని కాళ్లు కడిగింది. మరొకతె తెల్లని కార్పాసముతో పాదములు తుడిచింది. ఉజ్జయినీనగరములో ఈ కవీశ్వరునిమీద నాగరకులకు ఉన్న ఆదరానురాగములు మరెవరిమీదా లేవు. ఆయన సేవాభాగ్యముకోసము అందరూ వ్యగ్రతతో ఉన్నారు.

చందనపు గిన్నె పనికత్తె అందించే సరికి కవి వేలితో గంధము తీసుకొని, లలాటమున తిలకము పెట్టుకొన్నాడు. ఒకతె పువ్వుమాలిక కవిమెడలో వేసింది.

“సులోచనా, ఇది యేమి! నా మెడలో పూల దండ వేసినావే!” అన్నాడు కవి.

సులోచన కుటిలహాసముతో “కవీశా, ఇక్కడ మేమంతా ప్రియదర్శికా దేవి ప్రతినిధులము” అన్నది.

కవి చిరునవ్వుతో ఉద్యానము వెంట నడిచి సౌధములోకి వెళ్లినాడు. మొదట నాట్యశాల చూచి, అనంతరము వేతాళభట్టు కథ చెప్పుతున్న భవనము దాటి, కక్ష్యాంతరాలు గడిచి నీలచీనాంశుకము కప్పిన పీఠముమీద కూర్చున్న ప్రియదర్శికను చూచినాడు. ఆమెకు ఎదురుగా పీఠము మీద, వరాహమిహిరాచార్యుడు చేతులు తిప్పుతూ తీవ్రస్వరముతో మాటాడుతున్నాడు. ప్రియదర్శిక అతని ధోరణి తప్పించుకో లేక చిక్కున పడినట్టు కవి గ్రహించినాడు.

ప్రియదర్శిక కవిని చూచి మందహాసము చేసి కనుసైగతో ఆహ్వానించింది. ఆయన వారి వద్దకు వెళ్ళినాడు. కవి పురుషుని చూచి “ఏమిటి! వరాహ... మిహిర భట్టుమహాశయులా!” అని, ప్రియదర్శికతో “ఈ జ్యోతిర్విశారదులు నీ భాగ్య విషయము తెలుపుతున్నారా?” అని మందహాసము చేసినాడు.

ప్రియదర్శిక కవిని అప్పుడే చూచినట్టు అభినయించి చప్పున లేచి ప్రణామము చేసింది. ఆమె కర్ణాభరణమైన నీలకాంతమణిభూషణము ఊగులాడింది. ఆమె మధురకంఠముతో “కాళిదాస కవీంద్రా, స్వాగతము! నేడు తమ పాదార్పణముగల్ల మా గృహము ధన్యమయింది. పీఠము అలంకరించండి ఆర్యమహాశయా! వకుళా, కవీంద్రునికి పానీయము పట్టుకు రావే!” అన్నది.

కాళిదాసు వరాహమిహిరభట్టుతో “ఆచార్యా, ఏమిటో ఆలోచన చేస్తున్నారే. జ్యోతిషవిషయమా? నా అదృష్టము ఎలా ఉన్నదో గుణించి చెప్పగలరా! ప్రస్తుతము చాలా చిక్కులో ఉన్నాను” అన్నాడు.

మిహిరుడు నవ్వి “కవీ, నీవు ఋతుసంహార కావ్యము ఒకటి ఏలాగో రచించావు. నేను వివరిస్తున్న విషయాలు గ్రహించడానికి చాలా కష్టమయినవి సుమీ” అన్నాడు.

ఇంతలో వకుళ స్ఫటికపాత్రలో ఆసవము తెచ్చింది. ప్రియదర్శిక స్వహస్తాలతో అందించగా కవి పానీయము పుచ్చుకొని పాత్రిక పరిచారిక కిచ్చి “ఆచార్యా, ఎందుకు గ్రహించలేము? ద్వాదశరాశులు, ఇరువై యేడు నక్షత్రములు, నవగ్రహములు—వీటితో గదా వ్యాపారము?” అన్నాడు.

“మన అపౌరుషేయ శాస్త్రముమీద అర్వాచీన యావనికవిద్య బలాత్కారంగా వచ్చి కూర్చుంటున్నది. తికమక అవుతున్నది. భచక్రము రథచక్రము కాదు. గ్రహతారామండితవ్యోమము నిరంతరఘూర్ణమాన—”

కవి ఆచార్యుని మాటకు అడ్డుతగిలి “ఆచార్య మహాశయా, పొరపాటు! ఆకాశచక్రము నిజంగా రథచక్రమే. నిరంతరము తిరుగుతున్నా దానితోపాటు మనమూ తిరుగుతూ ఉన్నాము” అన్నాడు.

వరాహమిహిరుడు నవీనులను నిందిస్తూ మళ్ళీ ఉపన్యాసము ప్రారంభించినాడు. కాళిదాసు నెమ్మదిగా లేచివెళ్ళుతూ ఉంటే ప్రియదర్శిక కవివైపు దీనముగా చూచింది. గ్రహించి కవి వెడలిపోయినాడు. ఇంటికి పోదామా అనుకొంటున్న కాళిదాసుకు కక్ష్యాంతరములో అమరసింహుడు కనిపించినాడు. కవి అతని దగ్గిరికి వెళ్ళి “మహాశయా, ఒంటరిగా కూచున్నారేమి?” అని అడిగినాడు.

"ప్రియదర్శికతో మాటాడాలి. ఆ పాషండ మిహిరుడు ఆమెను విడిచిపెట్టకుండా ఉన్నాడు" అన్నాడు అమరుడు. కాళిదాసు ఆలోచించి "మహాశయా, నేను విడిచిపెట్టిస్తాను. పృథివికి ఆహ్నికగతి ఉన్నదని మీరు అంగీకరిస్తారా! చెప్పండి" అన్నాడు.

"పృథివికి ఆహ్నికగతి ఉంటేనీ, ఉండక పోనీ—"

"అలా కాదు. వరాహమిహిరభట్టు ఈ విషయము అంగీకరించడు."

"అలాగా! అయితే నేను తప్పకుండా విశ్వసిస్తాను!"

కాళిదాసు వెంటనే వరాహ మిహిరాచార్యుని వద్దకు వచ్చి "మహాచార్యా! అమరసింహుడు ఆర్యభట్టు సిద్ధాంతము మంచిది అంటున్నాడు. పైగా ఆహ్నిక శబ్దము నూతనముగా అమరకోశములో చేరుస్తాడట. దానివల్ల ఆర్యభట్టసిద్ధాంతము—" అంటూ ఉంటే, వరాహ మిహిరుడు లేచి "ఆ నాస్తికుడు! జడబుద్ధి! ఏడీ, ఎక్కడున్నాడు?" అని కేక వేసినాడు.

కాళిదాసు చిరునవ్వుతో కరసంజ్ఞతో గది చూపించగా వరాహమిహిరుడు గబగబ వెడలిపోయినాడు.

౪

ప్రియదర్శికా కాళిదాసులు అన్యోన్యముఖావలోకనము చేసినారు. ఉభయులకూ అంతరంగిక గ్రహణశక్తి ఉండడముచేత మాటాడకుండా ముఖావలోకనమువల్లనే పరస్పరభావములు ద్యోతక మవుతవి. కవిమనస్సులో ఉద్వేగము ఉన్నట్టు ప్రియదర్శికకు గోచరించింది. ఆ సంగతి ఎత్తకుండా ఆమె అస్ఫుట కాకలీస్వరముతో "కవీంద్రా, అబలార్థావిమోచనమువల్ల పుణ్యము కలిగితే, అది మీదే!" అన్నది.

కాళిదాసుహృదయములో అనిర్వచనీయశాంతి ఉదయించింది. ఈ గణికారత్నమును చూడడమువల్లనే ఆయన ప్రసన్నుడయినాడు. కవి పర్యంకముమీద అర్ధశయానుడయి ఆమెవంక చూచినాడు. ప్రియదర్శిక అతని బాహువులకింద ఉపధానములు ఉంచింది.

ఉభయులూ అభిముఖముగా పరస్పరము భావలోకనము చేసినారు. కవి శాంతచిత్తుడయినాడు. గణిక మాత్రము ఈషచ్చలితచిత్త అయింది.

ప్రియదర్శిక అవనతవదన అయి తాంబూలకరండము కవిముందర పెట్టి "భట్టినీవిశేషా లేమిటి?" అన్నది.

కవి కొంచెము చలించి తాంబూలము గ్రహించి బొమముడిపాటుతో "భట్టినివిశేషాలు ఏమీ లేవు. ఆమె ఇంటిలోనే ఉన్నది" అన్నాడు.

ఏదో వ్యథాచ్ఛాయ ఆమెముఖాన క్షణమాత్రము గోచరించి వెంటనే తొలిగిపోయింది. గణిక మందహాసముతో "ఆహా, కవీశా, సప్తద్వీపవసుంధర మీ గుణగణముగ్ధ! కాని మీ గృహిణికి మాత్రము మీ గుణగణాలు గోచరించలేదు" అన్నది.

"గోచరించలేదా! కాని ఆమె నన్ను—"

ప్రియదర్శిక అతని మాటకు అడ్డువచ్చి నిండు చూపు అతని ముఖాన నిలిపి కంఠాన వ్యథారేఖతో "నాకు అన్నీ తెలుసును కవీశా! నావద్ద గోపన ప్రయత్న మెందుకు?" అని, స్వరము మార్చి "ఆ సంగతి పోనివ్వండి— నేడు కవీశుని లలాటమున చింతారేఖ గోచరిస్తున్న దేమి? ఏ కావ్యము పూర్తి కావడానికి అట్టే విలంబము లేదని అందరినీ ఊరిస్తున్నారో ఆ కావ్యము పూర్తికాలేదా?" అని అడిగింది.

కాళిదాసు లేచి "ప్రియదర్శికా, చాలా చిక్కులో పడినాను! మూడురాత్రులు సరిగా నిద్ర లేదు. నీ సలహా కావాలి" అన్నాడు.

ప్రియదర్శిక ఆశ్చర్యముతో "ఏమి సంభవించింది?" అని ప్రశ్నించింది.

"నేను రచిస్తున్న కావ్యమును గురించి ఏమీ స్థిరము చెయ్యలేక పోతున్నాను. నీ ఆలోచన అవసరము."

ప్రీతితో ప్రియదర్శికవదనము ఉత్ఫుల్లమయినది.

"కవీశా, మీకు నేను ఆలోచన చెప్పవలెనా! ఎందుకు నన్ను సిగ్గుపాలు చేస్తారు!"

ప్రియదర్శికాజానువు అంగుళితో స్పృశిస్తూ కవి "అవంతీ రాజ్యములో నీకంటె ఎక్కువ రసాస్వాదశ్రేష్ఠ ఎవరు! చాలామంది మధురశబ్దముగ్ధులు శాస్త్ర

సౌందర్యోపాస్తుడు. రససాగరములో అడుగు ముట్టేవాడు లేడు—నీవు తప్ప!" అన్నాడు.

ఆనందబాష్ప పూర్ణ నేత్రములతో ఘటితాంజలితో ప్రియదర్శిక "కవీశా, మాచిక్కు ఏమిటి? కావ్యము పూర్తి కాలేదా?" అన్నది.

"కావ్యము పూర్తి అయిందో కాలేదో తెలియడము లేదు."

"కావ్యము పూర్తి అయిందో కాలేదో మీకు తెలియడము లేదా? చాలా ఆశ్చర్యము!"

కాళిదాసు ఆమెదగ్గరికి జరిగి ఆవేశముతో ఇలా పలికినాడు: "ఇంతవరకూ ఎవరితో చెప్పని విషయము నీకే ప్రథమతః చెప్తున్నాను. కావ్యనామము కుమారసంభవము. మహేశ్వరుడే కథానాయకుడు. పార్వతీదేవి నాయిక. కావ్యవిషయము తారకాసురుడు పెట్టేబాధలు పడలేక దేవతలు బ్రహ్మసన్నిధికి వెళ్ళినారు. మహాదేవుని ఔరసపుత్రుడు కుమారస్వామి తారకసంహారము చేస్తాడని బ్రహ్మ వారిని సంతోషపరచి పంపినాడు. సతీదేవి దేహత్యాగము చేసినతర్వాత మహేశ్వరుడు ధ్యానమగ్నుడయినాడు. సతి హిమవత్పుత్రికగా జన్మించి ఉమానామముతో పెరిగి పెద్దదయి, మహేశ్వరుడు తపస్సు చేస్తున్న ప్రదేశము చేరి పరిచర్యలు చేస్తున్నది. దేవతలు మహేశ్వరతపోభంగము చేయడానికి మదనుని నియోగించినారు. మన్మథుడు మహాదేవునికి కొద్దిగా చలనము కలిగించినాడు; కాని ఆ త్రినేత్రుని ఫాలాగ్నిలో భస్మమయినాడు. మహేశ్వరుడు ఆ ప్రదేశము విడిచిపెట్టి వెళ్ళినాడు. ఉమాదేవి మహేశ్వరప్రీత్యర్థము ఘోరతపస్సు చేసింది. ఆయన క్రమంగా సుప్రీతుడై ఆమెకు ప్రత్యక్షమయినాడు. తర్వాత యథావిధిగా వారికి వివాహమయినది."

ఇంతవరకూ చెప్పి కవి విశ్రమించినాడు. ఏకాగ్రతతో వింటున్న ప్రియదర్శిక ముఖము పైకెత్తి చూచింది. మళ్ళీ కవి ఇలా అన్నాడు: "గౌరీశంకరుల వివాహముతో సప్తమసర్గ సమాప్తమయింది. నవవధూవదనాన లజ్జ అంకురించింది. మదనుడు ఉజ్జీవితుడయినాడు. కుమారసంభవ కావ్యములో ఏది ప్రతిపాద్యమో అది ప్రతిపాదితమయినది. కాబట్టి కావ్యకళానుగుణముగా గ్రంథము సమాప్తమయినట్టేనా?"

ప్రియదర్శిక ప్రశ్నార్థక మయ్యాక అతనివంక చూస్తూ ఉన్నది. తర్వాత కవి "శాస్త్రానుసారముగా కావ్యము ఇంతటితో సమాప్తము కావడము ఉచితమనిపిస్తుంది. అయినా సందేహము వేధిస్తున్నది" అన్నాడు.

"ఏమని సందేహము?"

"కావ్యము ఎందుచేతనో కానట్టు. ఉమామహేశ్వరుల పూర్వరాగమూ, కల్యాణమూ వర్ణించినాను. కాని కావ్యానికి మూలభూతమైన కథ చెప్పనే లేదు. ప్రియదర్శికా, నీకు ఏమనిపిస్తున్నది? దేవదంపతుల వివాహానంతర జీవనము వర్ణించడము కావ్యకళాసంగతమేనా?"

"అలంకారశాస్త్రానుసారముగా కాదు. విషయాతిరిక్తవర్ణన వాగ్బాహుళ్యమంటారు. జగన్మాతృజగత్పితల దాంపత్యజీవనవర్ణన చాలా గర్హితమంటారు."

"అయితే, నీ మతప్రకారము వివాహముతో కావ్యము ముగించడము మంచిదన్నమాట."

ప్రియదర్శిక చెక్కిట చెయ్యి చేర్చి, కొంచెము సేపు ఆలోచించి "కవీశా, అలంకారశాస్త్రముకంటె సత్యమే ఘనమయినది. సత్యానుసరణములో శాస్త్రమును ఉల్లంఘించినా బాధ లేదు" అన్నది.

"ఇందులో ఏది సత్య మంటావు!"

"ఉమామహేశ్వరుల సమ్మేళనమే సత్యము."

"అది జరిగింది కదా?"

"జరిగిందా?"

"జరగలేదా?

"ఆవిషయము నేను చెప్పలేను. అది కవి అంతర్య విషయము."

కాళిదాసు కొంచెముసేపు ఆలోచించి "నా అంతర్యము నాకే తెలియలేదు. నీ అభిమతమేమిటో తెలియజెప్పు."

"నా అభిమతము వింటారా?" అంటూ ప్రియదర్శిక మందహాసము చేసింది.

"ఆ"

"మంచిది. మీరు ఇప్పుడు ఇంటికి వెళ్ళండి. ప్రొద్దు పోయింది. రేపు ఉదయానికి మీమనస్సులో ఇంకా సంశయము నిలచిఉంటే, నాఅభిమతము తెలియచేస్తాను" అని ప్రియదర్శిక లేచి నిలుచున్నది.

కవికి కొంచెము నిరాశ కలిగింది. అయినా ఆయన ఏమీ అనలేదు. ప్రియదర్శిక కవిని తోరణము వరకూ సాగనంపి, సెలవు తీసుకొనేటప్పుడు "మిహిర భట్ట, అమరసింహులనుంచి దూరముగా ఉండి, కావ్యవిషయము ఆలోచించండి" అన్నది. ఉభయులూ నవ్వుకొన్నారు.

౫

కాళిదాసు ఇంటికి వెళ్ళేసరికి అర్ధరాత్రి కావచ్చింది. చీకటి. తలుపు వేసిఉన్నది. కవి జాగరూకతతో వినడానికి ప్రయత్నించినా ఏమీ వినబడలేదు. అంతా నిద్రపోతున్నారని తలుపు తట్టినాడు.

"ఎవరు?" అని లోపలనుంచి కంఠధ్వని.

"నేను—కాళిదాసును" అని కవి మందముగా అన్నాడు.

ఇంతలో తలుపు తెరిచినారు. భయపడుతూ కవి లోపల ప్రవేశించినాడు. స్వయముగా దీపము చేత పుచ్చుకొని గృహిణి యెదురుగా నిలుచుని ఉన్నది!

"వచ్చారా! ఇంత పొద్దుపోయేదాకా ఎక్కడున్నారు?" అన్నది భార్య.

కవి ఇంటిలోకి వెళ్ళి ఇలా అన్నాడు: "ప్రియే, నీవు ఇంతవరకూ మేలుకొనే ఉన్నావేమి? దానితో—"

"మీరు ఇందాకా ఎక్కడున్నారు!" అని గృహిణి కఠినస్వరాన అడిగింది.

"గోష్ఠికి వెళ్ళాను."

ఇంతవరకూ అణుచుకున్న కోపము ఒక్కసారిగా పైకి ప్రజ్వరిల్లింది. నిప్పులు కక్కుతున్న కళ్ళతో కవి భార్య "ప్రియదర్శికయింటికి వెళ్ళారా! అలా చెప్పండి! సిగ్గు లేదు. చివాట్లు పెట్టేవాళ్లు లేక! మీరు మహాపండితులే, రాజాస్థానకవులే, ధర్మనిరత బ్రాహ్మణోత్తములే, రాత్రి వేశ్యయింట్లో కాలయాపన చేశారా! సిగ్గు లేదూ చెప్పడానికి!" అన్నది.

"ప్రియే!—"

"ఛీ! నన్ను ప్రియా అని సంబోధించడానికి సాహసిస్తున్నారా! ఎవరు మీ ప్రియురాలు? నేను కాను. సహస్రభోగ్య ఆ ప్రియదర్శిక!"

కవి ఏమీ మాట్లాడకుండా నిలుచుని ఉన్నాడు. ఆయనమౌనము పత్నికోపానికి ఇంధన మయింది.

"ఛీ! లంపటా! ఎందుకు ఇంటికి రావడము? అక్కడే రాత్రి గడపవలసింది! వేశ్యాస్పర్శవల్ల అపవిత్రమైన భర్తశరీరము తాకితే కులాంగన మైలపడుతుంది. స్నానముచేస్తేకాని మళ్ళీ శుచికాదు. వెళ్లండి. మీకు ఇంట్లో ఏమి ప్రయోజనము! ఇంతసేపూ ఉన్నచోటికే దయచెయ్యండి!" అని కేకలువేసి కవిపత్ని శయనాగారములోకి వెళ్లి తలుపు బిగించుకొన్నది.

కవి చీకటిలో నిశ్చలముగా నిలుచున్నాడు. ఇది ఆయన యిల్లు. ఈమె ఆయనభార్య; గృహిణి, సచివ, ప్రియశిష్య! నిట్టూర్పు విడిచి కవి తాను కావ్యరచన చేసే గదిలోకి వెళ్ళి దీపము వెలిగించి పాదప్రక్షాళనాదికము చేసి వ్యాఘ్రచర్మము పరుచుకొని కూర్చున్నాడు. కొయ్యపీటమీద పెట్టిన కుమారసంభవ గ్రంథముమీద అతని దృష్టి పడ్డది. వెంటనే మెరుపుతీగవలె భావము ప్రసరించింది. ప్రియదర్శిక చెప్పినమాట నిజమే. ఉదయానికి ఏమీ తోచకపోతే అప్పుడు ఆలోచన చెప్తానన్నది. ఇప్పుడు సంశయము తీరిపోయింది. భార్యతో ముఖాముఖి అయినమీదట అంధకారం తొలిగింది.

కవి లేచి దీపకంబము తెచ్చి దగ్గరపెట్టుకొని తాళపత్ర గ్రంథసమేతముగా కొయ్యపీట ఎదుట ఉంచుకొని తర్వాత లేచి మసీపాత్ర, లేఖిని తెచ్చుకున్నాడు.

క్రమంగా కాళిదాసు ఆలోచనామగ్నుడయి లేఖిని గుప్పిట పట్టి, తాళపత్రమును పరీక్షించి మెల్లిగా "అష్టమ స్సర్గః" అని వ్రాసినాడు.

అనంతరము కాళిదాసు నిర్నిమేషనయనాలతో గవాక్షమువెంట చూచినాడు. వెలుపల చీకటి. టపటప మని చినుకులు పడుతున్నవి. అది వర్ష ఋతు వయినప్పటికీ కాళిదాసుచిత్తములో వసంతఋతువు ప్రాదుర్భవించింది.

ఇంతలో కాళిదాస కవీంద్రుడు అవనతవదనుడై తాళపత్రముమీద వ్రాయ నారంభించినాడు. మంద స్వరముతో లేఖిని తాళపత్రముమీద సాగిపోతున్నది.

"పాణిపీడనవిధే రనంతరం
శైలరాజదుహితు ర్హరం ప్రతి
* * * *"

[రంగభూమిక ననుసరించి]

# నాటకరచనకు నా పూనిక ఎందుకంటే?

ఈ మధ్య నాటకరచనలో వచ్చిన మార్పులు
రచయిత లవలంబిస్తున్న కొత్త మార్గాలు

నేను నాటకరచనకి పూనుకోవడానికి కారణం చెప్పడం సులభం కాదు. నాకు చిన్నతనంనుంచీ నాటకాలంటే అమిత సరదా. కథలూ, నవలలూ కంటే నాటకాలంటే ఎందుకు ఎక్కువ ఇష్టమో చెప్పలేను. బహుశా నాకు నాటకాల్లో జీవం ఎక్కువగా కనబడుతుంది గనుక కాబోలు. "ఓం ప్రథమంగా" ఎప్పుడు ఏ నాటకం వ్రాశానో జ్ఞాపకం లేదు కాని రంగస్థలాన ప్రదర్శింపబడిన నాటకాల్లో మొదటిది "తప్పెవరిది?". ఈ నాటకం శ్రీ. శ్రీ రాఘవాచార్యులవారి ప్రోత్సాహం లేకపోతే వ్రాసియుండను. ౧౯౩౦ లో మద్రాసులో మొదట ప్రదర్శించారు మ్యూజియం థియేటర్లో. ఆనాటి నా మనోభావాలు నా జన్మలో మరిచిపోలేను. ఒక సీటు ఖాళీ లేకుండా క్రిక్కిరిసిపోయారు జనం. ఎంత చెప్పినా ముందర కూర్చోలేదు. ఎక్కడో వెనక ఒకమూల కూర్చున్నాను "తప్పెవరిదీ కాదు. నాదే" అన్నట్లు. నిజానికి నాకా నాటకం నచ్చలేదు. ముఖ్యముగా భాష. కృత్రిమభాషలో వ్రాశాను ఆ నాటకం. పద్యాలకూ, వ్యాసాలకూ, పౌరాణిక నాటకాలకూ ఆ భాష ఉపయోగిస్తే ఏమోగాని వర్తమానజీవితానికి సంబంధించిన నాటకాల్లో సంభాషణకి ఆ భాష ఉపయోగించడం అనుచితం అని అభిప్రాయం కలిగింది. ఆ నాటకం తప్ప మరి ఏ నాటకమూ అటువంటి భాషలో వ్రాయలేదు. తర్వాత వకీలువృత్తిమూలాన పెద్ద నాటకాలు ఎక్కువగా వ్రాయడానికి అవకాశం లేకపోయింది. ఆ కారణంచేత చిన్న నాటికలూ, ఏకాంకాలూ వ్రాయడానికి పూనుకొన్నాను. వాటిలో నా అభిమాన నాటిక "దయ్యాల లంక". నేను రచించిన నాటకాల్ని రంగస్థలంమీద ప్రదర్శించినప్పుడు ఎప్పుడో ఒకప్పుడు తప్ప సాధారణంగా నాకు తృప్తి కలుగలేదు. "నేను సృష్టించిన పాత్రలు వీరేనా" అని సందేహించేవాడిని. ఇందుకు ముఖ్యకారణం ఏమిటంటే, నటించేవారు ముందుగా పాత్రస్వభావం ఆలోచించి, అర్థం చేసుకోకపోవడం. నాటకరచయిత పాత్రల్ని సృష్టిస్తాడు; నటుడు పునఃసృష్టి చెయ్యాలి.

ఈ సందర్భంలో ఇంకొక గొప్పలోపం నాకు కనబడ్డది. నాటకప్రదర్శనకత్వం బాగా ఎరిగిన సూత్రధారుడు లేకపోవడం. నాటకం తయారు చెయ్యడంలో, నటింపచేయడంలో ఎంతో ఉంది. ఒక చిన్న తప్పుమూలాన నాటకం అంతా చెడిపోవడం సంభవిస్తుంది. తెరదింపడంలో ఒకనిమిషం ఆలస్యమవటంవల్ల నాటకం నీరసమైపోవడం నా స్వంత అనుభవంలోనిదే.

ప్రేక్షకుల్లో కూడా ఎంతో ఉంది, నాటకం జయప్రదం కావాలంటే. ఒక రకమైన నాటకాలు చూచి ఆనందించే ప్రేక్షకులకు ఇంకో రకమైన నాటకం నచ్చదు. ప్రేక్షకుల ఆమోదం, ఆదరం లేకపోతే నాటకం రక్తికట్టదు.

పి. వి. రాజమన్నారు

* మొన్న విజయదశమి నాడు ఆలిండియా రేడియో—మద్రాసు కేంద్రంలో జరిగిన ఆంధ్రనాటక రచయితల సమావేశం తాలూకు ప్రసంగాలు. రేడియోవారి అనుమతిని.

నేను నటుణ్ణికూడా అవడమే కారణము నేను నాటకరచనకు పూనుకోవడము. ఆ రోజులలో ధనాపేక్షకేగాక కళారాధన చేస్తూన్న బృందముతో నాకు నా పదహారవ ఏటనే పరిచయం కలిగి వారే నన్ను మొదట రంగాని కెక్కించారు. నటసార్వభౌములైన హరిప్రసాదరావుతో అప్పుడే నాకు సాహచర్య భాగ్యం లభిస్త. కీర్తిశేషులైన శ్రీమాన్ వంగీపురపు కృష్ణమాచార్యగురుపాదులు ఆ రోజులలో మాకు డైరెక్టరుగా ఉండి సమాజం నడిపిస్తూ ఉండేవారు. నాలుగు ఐదేళ్ల నాటక పరిచయంలోనే నాకు యత్కించిత్ భాషాప్రవేశం కలిగింది. నాకు పద్ధని మీద పంకొమిస్తే ఏ ట్లుండవచ్చు. ఏవో పదా లల్లుతూ ఉండేవాడిని. అభ్యాసనిమిత్తము ఏ రెండువందల పద్యాలో వ్రాశానుకాని 'బాలకవి' అనే బిరుదు వహించడానికి సాహసించలేదు. కాని ఏదో ఒక నాటకం వ్రాసి మా సమాజంవారిచేత ఆడింతామనే ఆశమాత్రం ఉండేది. ఆ ఉబలాటం నాటకరచనా బాధ్యతనుకూడా నన్ను గుర్తింపనిచ్చింది కాదు. బాల్యోద్రేకంలోనే రచించాను 'బుద్ధిమతీవిలాసం' అనే నాటకము. నటసార్వభౌముడు కథానాయకుడు, నేను శివయోగిగా చాలా పర్యాయాలు ఆడాము ఆ నాటకము. నా గ్రంథముకూడా ౫, ౬ కూర్పులు వెయ్య కలసివచ్చింది. కాని ఇరవై ఏళ్ల యీ మధ్య రంగస్థలాన ఆ నాటకాన్ని నేను చూడలేదు. రెండేళ్లక్రితం కాళోలు సినీమాప్రొడ్యూసరు ఒకరు ఆ నాటకాన్ని వెండితెర కెక్కిద్దా మని సంప్రదిస్తే, చదివాను. పనికి రాదని పంపించివేశాను. నాటకాన్ని మళ్లా చదివినప్పుడు నాకు కలిగిన మనోభావా లివి: సంవిధానంలో చక్కదనం లేకపోవడం; నాటకత్వానికి చాలినన్ని సంఘటనలు తక్కువవడము, సంభాషణలు దీర్ఘంగా ఉండడము; గద్యంతోనే చమత్కారంగా నడిపింపగల చోట్ల పద్యాలు చొప్పించడంవల్ల కథాగమనాన్ని నిరోధించడము. ఆ నాటకమే ఇప్పుడు తిరగరాయడమే తటస్థిస్తే ఆ లోపాలను కొంతవర కైనా సరిదిద్దగల నని తోచింది.

'హరిశ్చంద్ర' నా రెండవ నాటకం. కొంత సంస్కారం కలిగాకనే వ్రాసినది. వ్రాతప్రతిగా నుండగానే మా సమాజంవారు ఎన్ని పర్యాయములో ప్రదర్శించారు. ౧౯౧౧ లో మొదట వెలువడిన ఈ నాటకము ఇప్పటికిఎంత లేదన్నా యెనభైవేల కాపీలు అమ్మైనవి. కాని, ఈ హరిశ్చంద్రచిత్రణం సర్వాంగసుందర మని చెప్పలేను. ఇందులో కాటిసీనుమాత్రం దేశంలో అభిజ్ఞులు చాలామందిని ఆకర్షించినది. ఈ సీను పాంకంగానే కుదిరిం దని నా అభిప్రాయం. ఆ రంగం వ్రాసేటప్పటి నా అనుభవంమాత్రం నేను ఎప్పటికీ మరువలేను. ఒక మోస్తరు కవితాదీక్షతో వ్రాసినదే అనవచ్చు. కాపీయింగు పెన్సిలుతో వ్రాసినా, కన్నీటిధారతో వ్రాయడంవల్ల సిరాతో వ్రాసినట్లే తయారైంది. మా సమాజంలోనే నటించాము. హరిప్రసాదరావు హరిశ్చంద్రుడుగాను, నేను నక్షత్రకునిగాను కొన్ని వందల సార్లు ప్రదర్శించాము. కాటికాపరిగా, సురాభాండము నెత్తుకొని రంగస్థలం ప్రవేశించు ఆ నటసార్వభౌముడు—ఆ ప్రశాంతగంభీరమూర్తి ఇప్పుడు నా కన్నులలో ఆడుతున్నాడు. అన్ని విధాలా తన పాత్రను అర్హతతో ఒప్పించే హరిప్రసాదుని నటనలో లీనమైపోయిన ప్రేక్షకులు తాము నాటకము చూస్తున్నామనే మాటే మరచిపోయేవా రనడం అతిశయోక్తి గాదు. నా రచనలోని ఉద్దేశం సంపూర్ణంగా నెరవేరిం దనే నేను సంతోషించేవాణ్ణి. కాని, ఈరోజులలో, అనగా ౧౦, ౧౫ ఏళ్లలో, రంగస్థలంమీద కవిరచనోద్దేశం పూర్తిగా కొనసాగక పోడానికి కారణాలు ముఖ్యంగా సంగీతసాహిత్యాలకు సామరస్యం లేకపోవడం, ప్రక్కవాద్యాలఘోషలో పద్యగీతాలలోని శబ్దాలు వినపడకపోవడం, అశిక్షితమైన ప్రేక్షకవర్గాన్ని ఆకర్షించడానికి చౌకరకపు హావభావ చేష్టలు, తాను చెప్పిన మాటలకూ, చేసే అభినయానికీ పొత్తు కుదరకపోవడం.

బలిజేపల్లి లక్ష్మీకాంతం

* * *

పాఠకునకూ, ద్రష్టకూ రసానుభవం కలిగించి, తన సందేశం స్ఫుటంగా వినిపించాలంటే, రచయితకు, తక్కిన కావ్యాలకంటే నాటకం చాలా మంచి

సాధనం. కాని, నాటకరచన చాలా కష్టమైనది. కావ్య సామాన్యం రచించేటప్పటికంటే నాటకం రచించేటప్పుడు రచయిత గొప్ప బాధ్యత వహించ వలసివుంటుంది. తన జాతివారికి సభ్యత అలవడజేయడమూ, అది తప్పిపోకుండా చూడడమూ—ఇదే ఆ బాధ్యత. కవికి ఇంత శక్తీ, బాధ్యతా ఉందని తెలుసుకున్నప్పుడు, శక్తి ఉందా, లేదా అని చూసుకోకుండానే నేను నాటకరచనకు పూనుకున్నాను. నేను మొట్టమొదట రాసిన నాటకం—అంటే, నాకు నేనై రాసిన నాటకం—"వారకాంత." కాని, దాని కర్తృత్వం నేను మరిచిపోతున్నాను. నా నాటకాలలో నేను చెప్పుకోగలవి "ప్రేమపాశం", "నిగళబంధనం", "రాజరాజు"—ఇవి. వీటిలో ఒకటే రంగస్థలం ఎక్కలేదు. చదివినవారు మాత్రం అనుకూలంగానూ, ప్రతికూలంగానూ కూడా మాట్లాడారు. కొన్ని ఏకాంకికలున్నూ రాశాను. వాటిలో నాకు మిక్కిలీ ప్రీతిపాత్రం "కలంపోటు."

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

* * *

అబద్ధాలని మనకి రూఢిగా తెలిసిన పాత్రలవల్లా, సంఘటనలవల్లా ఏకకాలంలో చాలా మంది చిత్తవృత్తులు యథార్థంగా కలిగిపోతూంటాయి; గనక జగన్మిథ్యాత్వం సూచించగల కళ నాటకరచన ఒకటే.

అహంకార మమకారాలూ, తన వ్యక్తిత్వమూ వదులుకుని అన్యత్వం సిద్ధింపజేసే నటుని సృష్టికి కారణభూతం నాటకరచన. ప్రత్యక్షీకత్వం కలిగించవసం చేత సిద్ధించినప్పుడు నాటకరచనయొక్క వ్యాప్తి మరి దేనికీ ఉండదు. బహుముఖాల వృత్తాంతం కళ్లకి కట్టినట్లు తెలియపరుస్తూ చదువురానివాళ్లని సైతం రంజింపచెయ్యడానికి తోడ్పడేది నాటకరచనే. మానవుల సుఖదుఃఖాలూ, మానవస్వభావంయొక్క భిన్నత్వమూ పరిస్థితుల్నిబట్టి మానవస్వభావంయొక్క పరివర్తనా చాలా తక్కువ మాటఖర్చుతో విశదంచెయ్యగలది నాటకరచన. మంచి పాత్రలైనాసరే, చెడ్డపాత్రలైనాసరే, ఆయా పాత్రలయందు సమదృష్టి కర్తకి ఉన్నప్పుడే నాటకరచన సిద్ధిస్తుంది. ఇటువంటి లక్షణాలు ఎన్నోగలనాటకరచన రచయితకలాన్ని ఆకర్షించడంలో ఆశ్చర్యం లేదు అని నేనిప్పుడు అనుకుంటున్నాను. నా మొదటి ఆట రచన ౧౯౨౩ లో. కళాశాలా విద్యార్థులు తమ సంస్థగురించిన ఒక ఉత్సవసందర్భంలో నన్ను ఏదేనా ఆట రాసి ఇమ్మన్నారు. అట్టేవేషాలు రానీకుండా అట్టేసేపు పట్టకుండా, పద్యాలు పెట్టకుండా, స్త్రీలైనంతవరకు ఆడవేషంబాధ కలగకుండా, పోనీ, మొత్తంమీద బాగున్నాసరే, భయపడవద్దు, రాయమన్నారు. అప్పుడు నేను 'బాగు బాగు' అనే ప్రదర్శనం రాశాను. అదేలోపల నటులు చేసుకునే పూర్వాభ్యాసాలకి కొందరు నటేతరులు, అనగా విమర్శకులు వచ్చి, కఠినమైన మాటలూ అవీ లేకపోవడంవల్ల తీరాపోనీ ప్రదర్శనం బాగుండదేమో అని ధర్మార్థం జోస్యం చెప్పి, మానేస్తే బాగుంటుందని నటులకి సలహా యిచ్చారు. నటులు మానం అని ఆడారు. ఆట పట్టిచ్చింది. నటులూ, నేనూ ప్రజల్లో పడ్డాం. నా రచన ఆడగా నేను చూసేటప్పుడు అటూ ఇటూకూడా నాకు అనుభవం అవుతూంటుంది. సమర్థులైన నటులు రచనకి కట్టుబడి ఉంటే ప్రతీమాటా స్వంతం చేసుకుని, తమకి అది అప్పుడు తోచినా అన్నంత నిబ్బరంతో విసరడం చూస్తూంటాను. అసలు రచన తిన్నగా చూడని అసమర్థులు, వ్యావహారిక భాషలో స్వంతకవిత్వం జొనపడం వీలుగనక, ప్రవేశపెట్టి అసభ్యత్వం, కథావిఘాతం, పాత్రపతనం కలిగిస్తూండడం కూడా గమనిస్తూంటాను. నటులకి అవసరమైనంత పూర్వాభ్యాసం లేకపోవడంవల్లకూడా ప్రయోగంలో గద్యనాటకరచన తేలికైపోవచ్చు.

భమిడిపాటి కామేశ్వరరావు

* * *

నాటకరచనకు పూనుకోటానికి కారణమేమిటో, నిజం చెప్పాలంటే ఏమిటో ఇప్పుడు నేనూ కొంచెం ఆత్మపరీక్ష చేసుకోవలసివచ్చింది. ఇన్నాళ్లూ నాటకాలతో కాలక్షేపం ఎందుకోసమో? ఏం

సాధించినట్లో! ఇదిగో, ఈ అహర్యంతో, ఇందుకు పూనుకున్నా నని మాత్రం చెప్పకోగలిగి లేదు. కాని ఒకటి నిజం. మా నటమిత్రులు శ్రీ డి. వి. సుబ్బారావు గారి ప్రోత్సాహంచేతనూ, మన నిత్యజీవనంతో సన్నిహితత్వం గలిగిన చైతన్యకళ ఇది కావటంచేతనూ, మన భావాలు జనసామాన్యానికి గోచరింపజేయటానికి ఒక రసవంతమైన సాధన యౌటచేతనూ పలువురితో బాటే నన్నూ ఈ కళ ఆకర్షించి అరికట్టుకుంది. అంతే. ఇక రచనలద్వారా, ప్రదర్శనల ద్వారా ఈ కళతో నాకు గల సహవాసపు ఫలిత మేమిటో, కలుగుతూ వచ్చిన మనోభావాలేమిటో, సూక్ష్మంగా మనవి చేసుకుంటాను. ఎప్పుడో వ్రాసిన నాటకం కళ్లముందు రంగస్థలాన జరుగుతూన్నప్పుడు చూస్తే, చర్వితచర్వణంగా, ఎదగూ బొదగూ లేని జీవనంగా గడుపుతూన్న ఒక పరిచిత కుటుంబాన్ని ఎన్నాళ్లకో చూచినప్పుడు కలిగే భావం కలిగేది. ఆ కుటుంబంలోని వ్యక్తుల్ని క్రొత్త ప్రయత్నాలకి హెచ్చరిస్తూ పరామర్శించునట్లే నా నాటకంలోని పాత్రల్ని కూడా పరామర్శించ బుద్ధిపుట్టేది. అటువంటి సందర్భాల్లో నాలోని రసపిపాస నన్ను కొంచెం కొంచెతనానికి కవ్వించేది. ఆ పాత్రలకే పునర్జన్మలనిచ్చి వేరు వేరు దేశాలలోకీ, వేరువేరు సన్నివేశాలలోకీ విడిచి ఒకమాటూ, కేవల విరుద్ధశీలాలు గల పాత్రల్ని ఏక సమస్యమీద ప్రయోగించి ఒకమాటూ, నాటకం ఎలా ప్రవర్తిస్తుందో, ఎట్టి మనోజ్ఞ జీవనధర్మ మర్మాలు ద్యోతకమౌతాయో చూడ మనసయ్యేది. ఈ దిదృక్ష నా రచనల నొకటికొకటి పోలిక లేకుండా చేసుకోటానికి కొంతవరకైనా సహకరించిం దని మాత్రం చెప్పగలను. అసలు నా రచన మతన ప్రదర్శనలద్వారా నా ఉద్దేశాలు నెరవేరినా, లేకపోయినా అవి నూతనరచనలకి క్రొత్తదారులను చూపించగలిగాయి.

పింగళి నాగేంద్రరావు.

* * *

కావ్యపద్ధతులలో నాటకం ఉత్తమోత్తమం. కవిత్వపరాకాష్ఠ నాటకంలో మాత్రం వ్యక్త మవుతుంది. నాటకరచన కవికి కీర్తినీ, ధనాన్నీ కూడా సంపాదించి పెడుతుంది. కాని నేను నాటకరచనకు పూనుకోడానికి ఇవేవీ కారణాలు కావు. నేను, నాకు జ్ఞానంవచ్చినవాటినుండీ కూడా నాటకసాహిత్య వాతావరణంలోనే పెరిగాను. మా నాన్నగారు (విశ్వనాథ కవిరాజు) నాటక కర్త. ఆయన నాటకాలను డిక్టేట్ చేస్తూండడం, మిత్రులు దాన్ని గ్రంథస్థంచేస్తూ ఉండడం, మూడునాలుగేళ్ల వయస్సు మాత్రం గల నేను కూర్చుంటి అంతా వింటూ ఉండడం—ఇప్పటికూడా నా కళ్లెదుట ఒక చిత్రం మాదిరి గోచరిస్తూనే ఉంది. నేను ఆ వయస్సులోనే మైలవరంవారివీ, యడవల్లివారివీ, అంజనేయ నటేశం గారివీ, సురభి ఒంపెటివారివీ కొన్ని వందల ప్రదర్శనాలు చూశాను. తత్ఫలితంగా నాన్నగారి మాదిరి నాటకాలు రాయాలనే సంకల్పం కలిగింది. నాకు అప్పుడు శ్రుత పాండిత్యం జాస్తిగా ఉండేది. నాటకం రాసే పద్ధతి కూడా వినికిడివల్ల తెలిసిపోయింది. "ప్రవేశించు భీముడు; అందరూ నిష్క్రమింతురు; తెరపడును." మొదలయిన వాట్ని ఉపయోగించవలసిన చోట్లకూడా తెలుసును. కాని నాకు రాయడానికి అక్షరాలు రావు. ఇదే నా సమస్య. "గుండె గొంతుకలోన కొట్లాడుతాదీ, కూకుండనీదురా కూసింత సేపూ" అన్నట్టు ఉన్న నా అవస్థ నాన్నగారికి చెప్పాను. ఒక నోటుబుక్కూ, పెన్సిలు నాన్నగారు తెచ్చి ఇచ్చారు. నాకు కాదు, మా అమ్మకు. నేను నాటకాలు డిక్టేట్ చెయ్యడానికి ఒడంబడిక నాన్నగారు కుదిర్చారు. మొత్తానికి నాకు ఓనమాల అక్షరాభ్యాసం అయేనాటికి నేను రమారమి ఒక వందనాటకాలు రచించడం పూర్తి చేశాను. 'మూడో కన్ను' అనేది ప్రకటింపబడిన నా మొదటి నాటిక. నేను నాల్గవ ఫారము చదువుతున్న రోజుల్లో దాన్ని 'సమదర్శిని'లో ప్రకటించినట్టు జ్ఞాపకం. తిరువాత నన్ను రచయితగా గుర్తించి నేను పంపే రచనలను బరంపురంనుండి వెలువడే "భారతి" అనే దినపత్రికలో ప్రకటించినవారు న్యాపతి నారాయణ మూర్తిగారు. భారతి దిన పత్రికలోనే కంట్రాక్టు డ్రామా, అంటే అసంపూర్ణరామాయణం మొదటిసారి ప్రకటించాను. నేను యస్. యస్. యల్. సి. చదువు

తున్న రోజుల్లో దాన్ని విజయనగరం కాలేజీవార్షికోత్సవంలో ప్రదర్శించారు. నాటకం ఫలితం — కాలేజీ కీర్తిన్నీ నా పేరూ పెరిగాయి. విద్యార్థిలోకంలో ద్వంద్వాభిప్రాయం కలిగింది. "ఈ నాటకం అవధాని రాసిందే" అని కొందరు, "కాదు, అసంభవం, స్కూలు ఫైనలు చదువుతూన్న అవధాని ఇంత విమర్శగా నాటకం రచయించటం నమ్మటానికి వీల్లేదు. కవిరాజుగారే రాసి అవధానిపేరు పెట్టి ఉంటారు" అని మరొక శాఖ అనుకోవారంభించారు. కాని నేను ఏ మనుకొన్నానంటే, నాది అర్థం లేని అహంకారం కాదు, నేను సమర్థుడైన నాటక కర్తనూ, విమర్శకుడనూ అని.

నాది మొదటినుంచీ తాత్త్వికదృష్టి. సంఘంలో గాని, జీవితంలో గాని, కళలలో గాని పైపై స్వరూపం చూసి నే నూరుకోలేను. దాని ఆంతరంగిక తత్త్వాన్ని చూచి మంచికి మంచినీ, చెడ్డకు చెడ్డనూ నిర్మొగమాటంగా, జంకూ గొంకూ లేకుండా చెప్పేది నా స్వభావం. ఇదే నా నాటకాలన్నింటిలోను గోచరిస్తుంది. నేను జీవితానికీ, కళకూ కూడ ప్రయోజన మున్నదనే సిద్ధాంతానికి చెందినవాణ్ణి. నాటకరచయిత బుద్ధిని ఉపయోగించా లన్నదే నా వాదం. అభయం, సత్యసంపద్ది రచయిత కవసరం. సంఘంలోని చెడుగును నిర్భయంగా నిర్మూలించడానికి యత్నించాలి. ఇదే నాటకరచనలో — సాహిత్యకృషిలో — నా ఆశయాలు. వినోదనాటకం రాసినా, విషాదాంతనాటకం రాసినా, చారిత్రకనాటకం రాసినా, సాంఘిక నాటకం రాసినా, వ్యంగ్యనాటకం రాసినా, తత్వనాటకం రాసినా, ఏకాంకిక రాసినా, పంచాంకిక రాసినా — ఇవే నా ఆశయాలు. ఇదే నా ప్రయోజనం. "ఇది మాత్రం నా గొప్ప రచన" అని నేను ఒక్క నాటకానికి ప్రాధాన్యత ఇవ్వలేదు. గొప్ప ఆశయం గల ప్రతీ నాటకం గొప్పదే. నా ప్రతి నాటకం లోకసంగ్రహానికీ, ప్రజాశ్రేయస్సుకీ నిలుస్తుంది. ఇట్టి నాటకాలు ప్రదర్శించడానికి నటులకు విజ్ఞానసంస్కారం అవసరం. అది నేటి కిరాయినటకులకు లేదు. కళాశాలావిద్యార్థుల కే ఉంది. కనక నా నాటకాలను ప్రదర్శించే అధికారం కళాశాలావిద్యార్థులకే ఇచ్చాను. దేశంలోని అన్ని కాలేజీలలోనూ విద్యార్థులు వినోదనాటికలనూ, గంభీరనాటికలనూ కూడా విజయవంతముగా ప్రదర్శిస్తున్నారు. తెలుగు నాటకం పునస్సృష్టి కళాశాలలనుండే జరుగుతుంది.

మల్లాది అవధాని.

* * * *

చిన్నతనంలో నలుగురిలాగే వ్రాసి ఆడించాలనీ, పెద్దగినతర్వాత అవసరమై, నేను వ్రాసిన నాటకాలేవీ అచ్చయి రచ్చకెక్కలేదు. చూసే అవకాశమూ కలగలేదు. కాగా మిగిలింది నేను చదువుకోవడమే. ఎప్పుడైనా వాటిని తిరగవేస్తే, నా మనస్సుకు చిన్నతనమూ, బులపాటమూ కళ్లబడుతూ ఉంటుంది. గొప్పదని భ్రాంతి కలిగించే రచన నే నింతవరకు చేసినట్టు నాకు తోచలేదు. కాగా పోగా, నాకు సంబంధం ఉన్నది ఒక్క సినీకళే. నేను సినీమాకవి నవుతానని ఎన్నడూ అనుకోలేదు. కాని గ్రహబలం కాదనడానికి నా తరమా! వచ్చి గోదావరిలో పడ్డాను. కుస్తీలు పడుతున్నాను. నా విజయాన్ని నాటకకర్తవిజయంతో పోల్చడానికి వీలులేదు. నాటకకర్తకూ, సామాజికులకూ మధ్య నటుడొక్కడే. నా కథ అట్లాకాదు. నిర్మాత, దర్శకుడు, నటులు, ఛాయాగ్రాహకులు, శబ్దగ్రాహకులు, సోడాకేగోడీ పిల్లలు — మొదలైనవారెంతో మంది ఉన్నారు. ఇంతమందీ ఏకోన్ముఖంగా, సదుద్దేశంతోనే, కలిసి పనిచేస్తాం. కాని మధ్యలో ఒక్కడి కాలు జారితే మొత్తం ఘట్టమునిగి ఊరుకుంటుంది. ఆ ఫలితం అందరం సమానంగానే పంచుకొంటాం. ఈ పరిశ్రమలో సమష్టివిజయమే జయం కాని వ్యక్తివిజయం వాటికి రాదు. నా రచనతోపాటు, చిత్రం సమష్టిగా ప్రజాదరం పొందితే నేనూ సంతోషిస్తాను. రచన బాగున్నా చిత్రానికి డబ్బు రాకపోతే, నావాళ్లతో పాటు నేనూ కుంగిపోతాను. ఐనా, జీవితంలో నూ త్రిల్సు ఉంటాయి.

నా చిత్రంలో పాటే పాడుతూ రైల్లో ఎవడో బిచ్చగాడు నాకేసి చూసి చేయిచాస్తే, నా చేతికి వరం

ఉండదు. అలాగే నన్ను గక్కుండా వాళ్ళుంటే నా చిత్రాన్ని తిట్టిపోస్తూంటే నాకు నదుంపట్టూ ఉండదు.

సముద్రాల రాఘవాచార్యులు.

* * * *

నా చిన్నతనంలో మా వాచకాలలోని హరిశ్చంద్ర, గయోపాఖ్యానం నాటకాల్ని మా నోటి బడిపిల్లలు ఆడారు. వాటిని చూస్తే నాకు పట్టలేని సంతోషం కలిగింది. ఆ బాలనాటకసమాజానికి హంగుదారుణ్ణిగా చేరాను. రాజులకు కావలసిన కిరీటాలు చేయడానికి మాయింట్లో పటాలవెనక అట్టల్ని ఎత్తుకుపోయి మా అమ్మచేత దెబ్బలుతిన్నాను.

ఇది జరిగిన కొన్నాళ్ళకు మా ఊరి నడివీధిలో తోలుబొమ్మలు ఆడారు. దాన్ని చూచినమీదట పలచటి తెల్లకాగితం సంపాయించి సీత, రాముడు, లక్ష్మణుడు, ఆంజనేయుడు, జాంబవంతుడు, రావణాసురుడు మొదలైనవాళ్ల బొమ్మలు కత్తిరించి వాటికి రంగులద్ది, మా బడిలో తోలుబొమ్మల ప్రదర్శనం ఏర్పాటు చేశాను. అది కొత్త రక్తికట్టుతున్న వేళకి మా పంతులు వచ్చి నా చెవు లెక్కదీశారు.

ఈ బాక్ గ్రౌండ్ నాటకరచనలో నా అభిరుచిని కొంతవరకు విశదీకరించవచ్చు.

జర్నలిజమే జీవితపరమావధి అనుకోలేని స్థితి రాగా, సాహిత్యసృష్టికి సంబంధించిన పిపాస తీర్చుకోడానికి కొన్ని కథలు వ్రాసిచూచాను. కొన్ని వ్యాసాలు వ్రాసిచూచాను. ఒక నవలను ప్రారంభించి దానిని మధ్యలోనే ఆపివేశాను. ఈ వివిధప్రయత్నాలలో ఒక భాగంగా ఒక నాటికను వ్రాయడం జరగగానే దానిలో నేను నిమగ్నమైపోవటం తటస్థించింది. ఇంక ఆత్మతృప్తి ఏ యితర ప్రయత్నమూ ఇవ్వలేదు. నేను చేయగల సాహిత్యసేవకు నాటకమే తగు సాధనమని ఆనాడే నేను నిర్ణయించుకున్నాను.

నార్ల వెంకటేశ్వరరావు.

౨

ప్రశ్న:— ఈ పాతిక ముప్ఫై యేళ్లలో తెనుగు నాటకరచనలో ఏమైనా గొప్ప మార్పులు వచ్చాయా? మన రచయితలు ఏమైనా క్రొత్తమార్గాలను అనుసరిస్తున్నారా?

కాలప్రవాహంవల్ల కొద్దో గొప్పో మార్పులు కలుగుతూనే ఉంటాయి. పాత లంకెలు కొట్టుకుపోతాయి. కొత్తవి ఏర్పడతాయి. ఇక్కడి సరుకు అక్కడికి, అక్కడి సరుకు ఇక్కడకు రవాణా అవుతూనే ఉంటుంది. క్రొత్తసరుకులపై మోజు సంఘంలో పాతగిల్లిన అభిప్రాయాలను మార్చకుండా ఎల్లా ఉంటుంది? ఆ మార్పులు జాతి సాహిత్యంలోకి రానేవస్తవి. నాటక రచనలోకి కొన్ని మార్పులు వచ్చాయి. అదివరకు ప్రేక్షకులను ఆకర్షించిన కొన్నికొన్ని సంస్కృతనాటకాలు వ్యాఖ్యలై భాషాప్రియులకు పఠనయోగ్యంగా మాత్రం మిగిలిపోయాయి. ఆలోచనామృతంగా ఉండే ఆ నాటకసాహిత్యాన్ని అరుగంటలు సేపు ఆనందించే ఓపిక, అధికారం ఇప్పుడేదీ? పాత పురాణగాథలు వెనుకబడ్డాయి. ప్రతిక్షణం క్రొత్తదనం కావాలనే ఆందోళన అతిశయిల్లుతోంది. సురభివారి కల్యాణమల్లం ఇప్పుడు ఆధునికులకు ఒరవడి. ఆ గొప్ప సాంఘిక నాటకాలకి కొన్ని కొన్ని అనుకరణాలు కుక్కగొడుగుల్లా వెలిశాయి గాని అవి నిలవలేదు. సంఘంలో ఉన్న కుళ్ళునంతా బైట వేయడానికే ఉపక్రమిస్తున్నాయి గాని ప్రేక్షకలోకానికి నూతన సందేశాలను ఇవ్వలేకపోతున్నాయి ఇవి. కాని నవ్యసాహిత్యప్రియులు గద్యనాటికలు కొన్నిటిని రచిస్తున్నారు. భావుకులైన నటులతో వాటిని రంగానికి ఎక్కిస్తే క్రమేణ ప్రజాభిమానాన్ని పొందగలవని భావిస్తాను.

లక్ష్మీకాంతం

* * *

తెనుగులో రూపకరచన ప్రారంభం అయినాక, అదినుంచి ఒక్కొక్క సంవత్సరం గడచినకొద్దీ మార్పు

ప్రస్తుతము, పాశ్చాత్యనాటికలకు ఉన్నట్లు, మన నాటికలకు కొలబద్ద లేదు.

నాగేంద్రరావు

* * *

గతపాతికముప్పైయేళ్లలో తెలుగు నాటకరచనలో గొప్పమార్పులే కలిగై. నాటకకర్తలు పడమటి ముఖంగా తిరిగారు. నాటకాన్ని రాజులు, రాణీలు, సేవకులూ మాత్రమే గుత్తకొనడంగా చూచారు. నాటకంలో ఎంకన్నకీ, పుల్లమ్మకీకూడా రాజురాణీల వంటి స్థానం ఉందని రాసేరు. నాటకాన్ని ఆదర్శంనుంచి వాస్తవికతలోకి దించారు. గ్రాంథికంనుంచి వ్యావహారికానికి లాగేరు. పశ్చిమదేశాల ప్రభావం ప్రతిఫలించి రాగాన పడ్డది. మాట పాటలు వద్దన్నారు. పద్యాలు వద్దన్నారు. స్వగతాలు వద్దు, జనాంతికాలు వద్దు, నాటకంలో నృత్యం వద్దు, గీతం వద్దు—విదేశీనాటకాలపై కేవమంతా అయ్యింది. కాని భారతీయ దృక్పథంమాత్రమే పోయింది.

అవధాని.



ఆంధ్ర నాటక రచయితల గోష్ఠి

పై ప్రసంగములలోను, చర్చలలోను పాల్గొన్న నాటక రచయితలు—శ్రీయుతులు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి; భమిడిపాటి కామేశ్వరరావు; బలిజేపల్లి లక్ష్మీకాంతం; మల్లాది అవధాని; పి. వి. రాజమన్నారు (అధ్యక్షులు); సముద్రాల రాఘవాచార్యులు; వాస్త వెంకటేశ్వరరావు; పింగళి నాగేంద్రరావుగార్లు.

# హరిచరణుడు

[నవల]

= శ్రీ తల్లావఝ్ఝల కృత్తివాసతీర్థులు =

## ౧౩

సరిగ్గా ఇదేసమయంలో శాల్ సోనాపురంలో హరిచరణుడు కొంటెగా నవ్వుతూ వాళ్ళపిన్నిగారితో మాట్లాడుతున్నాడు. వసారాలో మాలీ కిశోరీ కాయసులు పగలబడి నవ్వుతున్నారు. పిన్ని "ఎంత చిత్రం చేశావురా హరీ! ఏళ్ళు మీదపడ్డా కొంటెతనం విడిచిపెట్టలేదు" అన్నది.

"పిన్నీ, నేను చచ్చిపోయాక లోకం ఎలా అనుకొంటుందో నాకు అర్థ మయింది. చచ్చి బతికాను."

"భాయీ! నీకోసం బెంగతో చచ్చి సగమైనాము. అబద్ధంగా ఇప్పుడు నువ్వు చనిపోయావు. నిజంగా నువ్వు చనిపోతే అప్పుడు మేము నమ్మడం కష్టం" అన్నాడు మాలీ.

"మీ రందరూ నాకోసం ఎలా విచారిస్తారో నాకు అర్థ మయింది. నేను మీకు పనికిరాని వాణ్ణి. అనవసరంగా మీరు విచారించారు" అన్నాడు హరిచరణుడు.

అతని పిన్నికి హరిమీద కొంత ఆదరం కలిగినమాట వాస్తవము. స్త్రీలకోపం రత్నపు తళతళ వంటిది. అలాగే ఆమె కోపంకూడాను.

"అబ్బాయీ, ఇక్క డుండిపో. కలకత్తా పోయి ఎలా పాడై పోయావో! వొళ్ళు ఎలా చెడిపోయిందో గదా" అని ఆలుగోజా స్వరంతో అంది.

"మీవాడి కేమీ ఫరవా లేదు. మే మంతా ఉన్నాము." అని మాలీ హామీ ఇచ్చాడు.

హరిచరణుకు బతికే ఉన్నట్టు వార్తాపత్రికలో అచ్చయింది. విహారి పొంగిపోతూ ఉత్తరం రాశాడు— మేఘాలమీద కలకత్తానించి సోనాపురం వస్తున్నానని. మాలీ మొద లైన చిత్పూర్ మిత్రులు సోనాపురంనుంచి వెళ్ళినారు.

హరిబాబుఆరోగ్యం క్రమేణా చెడిపోతున్నది. ఆయాసం అధిక మవుతున్నది. నీరసంవల్ల కోపం ఎక్కు వైంది. కోపం ఎక్కువైనకొద్దీ చిన్న మాట కూడా సహించలేకపోతున్నాడు. పిన్ని మొదట నాలుగైదురోజులు సరిగానే చూచింది. పెట్టిపోస్తున్నది కనుక అతన్ని ఒకటీ అరా మాటలు అనడం తప్ప లేదు. జలీఫుడు వర్తకంలో దెబ్బ తిని నిరాశతో గాడీయ మఠంలో సాధు వైనప్పటినించీ అతనికుటుంబాన్ని పోషిస్తూ వచ్చింది పిన్ని.

సాయంకాలం హరిబాబుకు ౧౦౧ డిగ్రీల జ్వరం వచ్చి మూలుగుతూ ఉంటే "మాయదారి జ్వరం! తిన్నగా తిని తిరిగితే ఎందుకు వస్తాయి రోగాలు?" అంటూ విసుక్కున్నది. పినతల్లిమాటలు అతని చెవి చేరాయి. "పిన్నీ, ఇలా వస్తావా?" అని మంచంలో పడుకొని ఆయాసంగా పిలిచినాడు హరి. పినతల్లి దగ్గిరికి వచ్చింది.

"నీకు విసుగుగావుంటే బండి చేయించి, కలకత్తా పంపించు. అక్కడ స్నేహితు లున్నారు" అన్నాడు. ఆ మాటకు ఆవిడకు కష్టంవేసి "చేయించుకోడం చేతనవును. పాపం, మాటమాత్రం అనాయిస్తి గాదు. ఎప్పుడన్నా కొంచెం విసుగు రాదురా? అంతలోకే అలా అనుకుంటావు" అన్నది.

అతనికి, బంధుకోటికి పడదు. మిత్రులు అతనికి దగ్గరైనట్టు బంధువులు కారు. అవసర మంటే బంధువులు దగ్గిర చేరుతారు.

సాయంకాలం వైద్యుణ్ణి పిలిపించింది పిన్ని. పల్లెలో హరిచరణ చక్రవర్తి ఇక్ష్వాకులనాటి పాత వైద్యం చేస్తాడు. కళ్ళజోడు కనుబొమ్మలపైకి ఎగసన తోసి తీవ్రంగా ఆలోచిస్తూ నాడి పరీక్షించాడు.

"ఎలా వుందండీ అబ్బాయికి ?" అని ఆదుర్దాగా అడిగింది, గుమ్మంలోపల తలుపు వోరవాకిలి వేసి పిన్ని.

"నాడి మందంగా ఉంది. విశ్రాంతి తీసుకుని, ఔషధం ఒక మండలం సేవించాలి. అప్పుడు నయ మవుతుంది. ప్రస్తుతం జ్వరం కట్టడానికి మందిస్తాను" అంటూ చక్రవర్తి లేచినాడు. జ్వరతీవ్రతలో హరిచరణుడు ప్రేలాపన మొదలుపెట్టినాడు. అపస్మారము వల్ల మనసులోంచి కమించిన భావాలు పైకి వస్తున్నాయి.

"ఎక్కడున్నాను, నే నెక్కడున్నాను ? పిలిపించవోయ్ దాన్ని...హ్హ హ్హ! వచ్చావా ! తారా ! వచ్చావా ! నీకోసం అంతా సిద్ధం చేశానే ! ఎప్పుడే ముహూర్తం ? హ్హ హ్హ! అన్నట్టు, భద్రకాళీ! నీకెలా సమాధానం చెప్పను ?"

మంచందగ్గిరగా కూర్చుని పినతల్లి "ఊరుకో నాయనా ! మాట్లాడితే ఆయాసం ఎక్కువవుతుంది" అంటూ చన్నీళ్ళల్లో పట్టీ తడిపి కాలుతున్న అతని నుదుట వేసింది.

హరిచరణుడు "అమ్మయ్య ! సుధాపానం చేసిన జీవితామూర్తిని ! ఎంత హాయి ! తాగినప్పుడు ఇంత హాయి అనుభవించాను ! అదే నా ఆపద్బంధువు."

ఆ ప్రేలాపన విని ఆమె "దిక్కుమాలిన తాగుడు గుండెల్ని పీల్చి పిప్పిచేసింది. వొళ్లు గుల్లయి పోయింది" అని జాలిగా అనుకొన్నదిగాని వినుకోలేదు.

తెల్లవారిన తరువాత విహారి వచ్చాడు. పచ్చి శోకంతో "పిన్నిగారూ, ఏడీ ఏడీ, హరి ?" అని ఆదుర్దాగా మంచంమీద వున్న హరిని చూచాడు. అతను పలకరిస్తే హరి పలకలేదు. తెల్లారింతరువాత జ్వరం జారింది. అతినీరసంవల్లా, పైత్య ప్రకోపంవల్లా వొళ్లు తెలియక హరిచరణుడు మాగన్నుతో ఉన్నాడు. విహారిని చూచి ఎవరైందీ పోల్చుకోలేక ఊరుకున్నాడు. జ్వరం క్రమేణా తగ్గుతున్నది కాని ఆయాసం తగ్గలేదు. త్వరగా పథ్యం పెట్టవద్దని చక్రవర్తి ఖచ్చితంగా ఇంట్లో చెప్పినాడు. విహారి అతనికి కావలసిన ఉపచారాలు చేస్తున్నాడు.

"నీ ఋణం ఎలా తీర్చుకుంటాను విహారీ ?"

"ఇంతమాత్రానికేనా ? "

"నాకు రెండు కోరిక లున్నాయి. అవి బతికి ఉండగా తీరుతాయా ? " అని మెల్లిగా విహారిని అడిగినాడు. కళ్ళలోతుల్లో కన్నీరు తూగాడింది.

"హరీ, ఏం కావాలి ? "

"తారను చూడా లనీ, భద్రకాళినికూడా చూడాలనీ అనిపిస్తున్నది."

"హరీ ! నువ్వు చనిపోయావన్న కబురు నీ ప్రియురాలికి అందచేస్తే, ఏ మన్నదో తెలుసునా ?"

హరిచరణుని ముఖంలో నవ్వు వెలుతురులా వ్యాపించింది. కొంత ఉత్కంఠ కనబరచి తదేక దృష్టితో మిత్రుణ్ణి " ఏ మన్నది ? ఏ మన్నది ? " అని అడిగినాడు.

"చెప్పేది నెమ్మదిగా విను. ఆందోళన పడి, ఆయాసపడకు. హరి పోయాడని అంటే, 'పాపం ఆయన మంచివాడు. నా కోసం త్యాగం చేశాడు' అంటూ పెదవుల చివర జాలిపలుకులు పలికింది."

"హరే కృష్ణ" అని చప్పున చరణుని పెదవుల మీద మ్లానహాసము ఉదయించింది, గుడ్డివెన్నెల లాగ.

"ఈ ఆశ్రమంలో బాబ్డ్‌జుట్టు పెంచింది. సీతాకోక చిలకలా వుంది. ఎత్తుజోళ్ళు వేసి తక్కుతూ తారుతూ ఐస్-పార్లర్‌లో ఉంది."

"అయ్యో! తారహృదయం మంచుగడ్డలా ఘనీభవించిందా ? శ్రీహరీ !"

"చరణ్! ఆ తన్నెలదాన్ని మరచిపో!"

క్షణం సేపు ఊరుకొని తెప్పరిల్లి హరిచరణుడు తన చెయ్యి మిత్రుని భుజాన వేస్తూ "చూడు, విహారీ! భద్రకాళిని ఎరుగుదువా!" అని అడిగినాడు.

"అంతా ఎరుగుదును. ఇప్పుడావిడ మడి కట్టుకున్నదట"

"అలా అనకు విహారీ."

"నీ స్త్రీపక్షపాతం ప్రమాదిస్తోంది సుమా! నిన్న మొన్నటిదాకా పహిలాపచ్చీస్‌గా ఉన్నచిన్నది పతివ్రత అయిందంటావా?"

"అబ్బ... వాదించలేను. భద్రకాళికి నేను ఇక్కడే ఉన్నట్టు తెలియచేశాను. కబురంపలేదు."

"దాన్ని ఇక్కడికి రమ్మనేనా?"

"అవును."

"పోనీ, వస్తుందే అనుకో, వస్తే మీ పిన్నిగారు ఎలా ఊరుకుంటారు? అసలే పల్లెటూరు. వేశ్యను సంసారగృహంలోకి ఎలా అడుగు పెట్టనిస్తారు? రెండుమూడు రోజులు విశ్రాంతి తీసుకొని కలకత్తా వద్దువు గాని."

"ఇక్... నేను మళ్ళీ కలకత్తా రాగలనా? అయ్యో, నాకు భద్రకాళి కనపడదు" అంటూ కళ్ళు మూసినాడు. కళ్ళకొసల కన్నీటిజడి జాలుగా వచ్చింది.

## ౧౪

భద్రకాళి మాలీ కిశోరులవల్ల హరిచరణుడు బతికే ఉన్నట్టు తెలిసి, యథార్థమా, స్వప్నమా అని ఆశ్చర్యములో మగ్నమైనది. అబద్ధమైన మరణవార్త విన్నప్పటి నుంచీ అపరిమితంగా శోకపడ్డది. అరుణతార బహుశా అంతగా బాధపడలేదు. తనప్రియుడు జీవించే ఉన్నాడని తెలిసినప్పటికీ భద్రకాళి బొటబొట కన్నీరు కార్చి నవ్వింది. ఆ ముఖంలో సంతోషమూ, దుఃఖమూ మిళితమై విడదీయడానికి సాధ్యంకాక కబళితమై పోయినవి. బాధలో, వియోగ వ్యథానుభవంలో భద్రకాళి నిగ్గుతేరి, తప్తకాంచనమువలె వన్నె తేరింది. బాధలో హృదయము పదును తేరుతుంది. తంత్రులు బిగిస్తే కాని దివ్యసంగీత ఝురులు పొంగవు. సంఘం అల్పంగా చూచిన ప్రాణిలో ఎంత మానవత్వమూ, ఎంత సహృదయమూ, కారుణ్యమూ ఉన్నవో గదా!

ముసలితల్లి భద్రకాళితీరు చూచి "అమ్మాయీ, మన కులంలో నువ్వు తప్ప పుట్టినాళ్ళు సుమీ. అతన్ని పెళ్ళాడితే నీ దోనణి బాగుండి పోతుంది. కులం వాళ్ళు మనను బహిష్కరించరు గద" అన్నది. ఆ మాటలకు భద్రకాళి "అమ్మా! కులభేదాలు గంగలో కలిసి పోవాలి. నా హృదయము అదివరకే హరిచరణునికి దత్తమైంది. వివాహము అయిపోయినట్టే."

"ఆయన సంఘభయంవల్ల నిన్ను విడిచిపెడితే?"

"ఆయన నన్ను ఏలకపోయినా, భీతివల్ల నా దగ్గర ఉండకపోయినా నేను ఆయనప్రియురాలిని. ఆయన దర్శనం ఇస్తే చాలు. ఆయన జీవించారనే సరికి పునర్జన్మ ఎత్తినట్టున్నది!"

"పోనీ, సోనాపురం వెళ్లి చూసి వస్తావా అతన్ని?" అని సందేహిస్తూ ముసలితల్లి కూతురిని అడిగింది.

"పల్లెటూరులో బ్రాహ్మలింట్లోకి నే నడుగు పెడితే అక్కడివాళ్లు దుమ్మెత్తి పోస్తారు! కాని వెళ్ళాలనే వుంది. ఏం చెయ్యను? ఆయనదర్శనంకోసం తపిస్తున్నాను. నాలో అణువణువూ ఆయనకోసమే తపిస్తున్నది" అని ఉద్వేగంలో ఆనందాశ్రువులు కురిపించింది.

"ఆయనే వస్తారే పిల్లా! నువ్వు వెడితే బ్రాహ్మలు ఊరుకోరు. అతనికీ అక్కడ గంగ పుట్టదు"

"మరే పాపం. ఆయనను బాధపెట్టడం ఎందుకు?"

"అమ్మాయీ! వడ్డీ సొమ్ముతో నెలవారీ ఖర్చు వెళ్ళేలాగా లేదు. ఎలాగో కాపరం గడవటం?"

"అమ్మా, నా గాజులు తెగనమ్మి సొమ్ము చేసుకొందాము. ఈ పట్టణంలో జీవించలేము. పాటల గ్రామం పోదాము. చిన్నపల్లె. సరళంగా జీవితం వెళ్లి పోతుంది."

"పిల్లా, దారిద్ర్యాన్ని ఎలా భరిస్తున్నావే! నీలాంటిది వేశ్యల్లో అరుదుగా వుంటుంది. ఇంతకూ

పెట్టి పట్టాలి. నిక్షేపంగా తల దువ్వుకొని, సింగారించుకొని ఏ పెద్దమనుష్యులతో షికారుచేసి నాలుగు రాళ్లు సంపాయించక పిచ్చిలో పడ్డావు?"

"అమ్మా, అలాంటిమాటలు మాట్లాడావంటే ఇంట్లోనుంచి నిన్ను తరిమివేస్తాను. నేను అలంకారం నిత్యమూ చేసుకొని ఆయన దర్శనంకోసం ఎదురుచూస్తూ ఉంటాను. నాజీవితం యావత్తూ ఈ నిరీక్షణలో గడిచినా ఆనందమే"

"అమ్మాయీ, నీ మాటలు కొత్తగా ఉన్నాయి. పలుకులు మారిపోతున్నాయి. అంతా బ్రాహ్మసిచలవ! ఆహా!" అంటూ విస్తుపోయింది తల్లి. కుమార్తెలో కలిగిన పరివర్తన ముసలితల్లి ఊహించనైనా లేకుండా ఉంది.

తల్లీకూతుళ్ళు పాటలిగ్రామంలో ఉండవలె నని నిశ్చయించుకొన్నారు. తను ఎక్కడ ఉన్నదీ తెలియక బాధపడతా డేమో నని, హరిచరణునకు ఉత్తరం రాదా మనుకొన్నది భద్ర. ఉత్తరం రాస్తే ఏ మనుకోడుగదా! పల్లెటూరు! ఎవరిచేతుల్లోనో పొరపాటున ఉత్తరం పడితే ఏ మవుతుంది? అతనికి ఉత్తరం రాయా లని హృదయం తొందరపడుతున్నది. హృదయంలో యుగయుగాల వియోగానంతరమాధుర్యఝురులు ఊటలూరుతున్నవి! హృదయాన్ని చిక్కబట్టడం కష్టమై భద్రకాళి ఉత్తరం రాసింది:

"ప్రియచరణా!

మీరు జీవించే నన్నిలా బాధ పెడతారా? మీ వియోగానికి సహించలేక శరీరత్యాగం చేదా మని సిద్ధ మైనాను. మా అమ్మ నా ప్రయత్నం కనిపెట్టి అడ్డు వచ్చింది. అమ్మయ్య! మీరు పునర్జన్మ మెత్తినట్టు నాకు తోస్తున్నది! నేను రెక్కలు కట్టుకొని అక్కడ వాలా లని తపిస్తున్నాను. అక్కడి బాంధవులు నన్ను బతకనీయ రని హృదయారాటం కష్టంమీద తగ్గించుకొన్నాను. మీ దర్శనం ఎప్పుడు? ఎప్పుడు? నేను జీవించి ఉండగా మీ దర్శనం ఇప్పించరా? నా జీవనాడులు మీకోసమే స్పందిస్తున్నాయి! నా తుది నిశ్వాసంకూడా మీకు వింజామరలు వేస్తుంది! నేను జీవితంలో కోరేది మిమ్మల్నే! ఒక్క మిమ్మల్నే! మళ్ళీ శరీరాలంకరణం ఆరంభిస్తున్నాను. నాచుట్టూ మీరే గాలిలాగ ఉన్నారని తలచుకొని పులకరించిపోతున్నాను. మీకు ఇష్టమైన చీర కట్టుకొని ఎదురు చూస్తున్నాను. పెట్టుకోడానికి నగలు లేవు. అన్నీ తెగనమ్మివేశాను. నాకు మీరే నగలు.

ఈ నగరంలో జీవించలేక గాజా లమ్మి ఆ ధనంతో పాటలిగ్రామం వెళ్లి పోతున్నాను. మీ రక్కడికి రారూ! రారూ! నిరీక్షిస్తూ ఉంటాను.

మీ

భద్రకాళి"

సరిగా ఉత్తరం రాసి ముగించిందో లేదో పక్క మేడమీద రేడియో మీరాబాయి గీతం పాడుతున్నది:

'ఎక దినో పంథ నిహారూం పికకో
బార బార ఉరలాగీరీ'

ఆ పాట విని భద్రకాళి "సరిగ్గా నాస్థితి అలాగే వుంది. పగళ్ళూ, రాత్రిళ్ళూ మార్గం చూస్తూనే ఉన్నాను. నా హృదయం బాధపడుతూ వుంది. ఈ చీకటిరాత్రి వియోగాగ్నికీలలా వుంది. అబ్బ!" అనుకొన్నది.

౧౫

సన్యాసిలం బ్రాహ్మసమాజపద్ధతిలో యథావిధిగా అరుణతారను కలకత్తా మందిరంలో వివాహం చేసుకొన్నాడని పత్రికాముఖంగా వెల్లడి అయింది. చిన్నతనంనుంచీ తారతోను పెరిగిన సరళాదేవి సన్యాసిలం ఇంట్లో లేని సమయం చూచి వచ్చింది.

కాళ్ళకు పారాణి, నెత్తిమీద ముసుగు చూచి "ఏమమ్మా, తారా, పెళ్ళయిందని విన్నాను. చూసి పోదా మని వచ్చాను" అన్నది.

"సరళా, వచ్చావా?" అంటూ తార ముందుకు వెళ్లి ఆమె రెండు చేతులూ పట్టుకొని ఆప్యాయంగా తీసుకొని వచ్చింది. పార్లర్‌లో తయారయిన ఐస్‌క్రీం,

కూల్ డ్రింక్ తెచ్చి ముందున్న బల్లమీద పెట్టి, ఎలెక్ట్రిక్ ఫాన్ వేసింది. సరళ క్రీం తిని, మెల్లిగా పానీయం గుక్కెళ్లు మింగుతూ "ఎంత చల్లనిదానివి తారా! అసలు తారలో తేజము ఉంటుం దంటారు. నువ్వు చల్లనిదానివి" అని నవ్వుతూ అన్నది. ఆ మాటల్లో వ్యంగ్యం గ్రహించలేదు తార.

"నీ ఆశీర్వచనం" అని ముక్తసరిగా అన్నది తార.

"నీ పెళ్లికి పిలవలే దేమి తారా? తెలిస్తే వచ్చేదాన్ని."

"హడావిడిగా జరిగింది. క్షమించాలి."

"పూర్వస్నేహం మరిచిపోతారు కొందరు. అన్నట్టు, మీ ఆయనకు ఈ చల్లని పానీయాలు అమ్మడమేనా పని?" అని కొంత వెటకారంగా, కొంత అన్నదాన్ని కప్పిపుచ్చి సౌమ్యంగా అన్నది సరళ.

"పూర్వస్నేహం మరిచిపోయా నంటా వేమిటి సరళా?"

"చిన్నతనంనుంచీ నిన్నెరుగుదును. నీకు కోపం రాకపోతే నా మాటలు విను. గొప్ప కుటుంబంలో పుట్టినదానివి. తల్లి, తండ్రీ పోయారు. ఆస్తి చితికి పోయినా కొంగున కట్టిన కస్తూరివలె ప్రతిష్ఠ మిగిలింది. ఆ ప్రతిష్ఠ గంగపాలు చేశావు!"

ఆ మాటలకు అరుణతారలో కోపోద్రేకం వచ్చింది.

"ఏం మాట లమ్మా!"

"ప్రేమించినవాణ్ణి పెళ్లాడక, నమ్మించి ద్రోహం చేశావు తారా?"

"ద్రోహం చెయ్యలేదు. మతిస్థిమితం లేని వాడు-తాగుబోతు. అతన్ని ఎలా పెళ్లాడను?" అంది తార.

"బాధ లన్నీ విరగడచేసుకొని అతను పోనే పోయాడుగదా!" అని జాలిగా అన్నది సరళ.

"లేదులేదు. బాగానే ఉన్నారని తరువాత తెలిసింది. ఎవరో గిట్టనివాళ్లు లేనిపోని అబద్ధం ప్రచారం చేశారు."

"అతను జీవించి ఉండగా మరొకరిని ఎలా పెళ్ళాడావు!"

"కారణం చెప్పాను గదా"

"కారణం చెపుతావు. నీ మూలాన అతని ఆరోగ్యం గంగలో కలిసిం దట. అన్నాహారాలు వదిలి జబ్బు పడ్డా డట. ఏవో రకరకాలుగా చెప్పుకొన్నారు! బాధలు మరిచి పోయేందుకు తాగుతున్నా డట. అతన్ని చూస్తే ఎవరికైనా ఏడుపు రాక మానదు. జబ్బుపడి లేచి, ఏమీతోచక సోమాపురంలో చెరువుగట్టున తలవంచుకొని కూర్చుంటా డట. పగలు కాలిగట్టున పిట్టల్ని కొడుతూ తిరుగుతా డట. తన బంధుకోటిని వదిలి, ఆరోగ్యం వదిలి నీమీద ఆశతో చచ్చి బతికా డట."

"నీ కెలా తెలిసింది?"

"మా వారి స్నేహితుడు-విహారి చెపుతూ వుంటే నా చెవుల పడింది. అలాంటి అమాయకుణ్ణి ద్రోహం చేశావు. నిజమేనా? చేసినందుకు కోపమా? మీవారు రాలేదు గదా!" అని గుక్క తిప్పుకోకుండా ప్రశ్న పరంపర కురిపించింది సరళ.

అరుణతార సమాధానము చెప్పలేక, తల వాల్చి, నిశ్శబ్దంగా బొట బొట కన్నీరు కార్చింది. సరళాదేవిమాటలు శూలాలై ఆమెకు పశ్చాత్తాపము కలిగించాయి. మానవుడికి ఇచ్ఛాస్వాతంత్ర్యం ఉన్నది గదా అని, ధర్మాధర్మ విచారణ లేకపోతే అధోగతి. సరళ ఆమెహృదయంలో అగ్నిని రగులుకొల్పింది. రగులుకొలపడమే కాదు, ప్రబోధవాయువుతో జ్వలింపజేసింది. "నిన్ను చాలా కష్టపెట్టాను. నువ్వు అతన్ని మరిచిపోతే నీకు దుఃఖము తప్పదు. తొందర పడి అతనిజీవితాన్ని మంట కలిపావు. మన స్త్రీజాతికి ఈ ద్రోహం పనికిరాదు. వెళ్ళి అతని సముఖంలో పశ్చాత్తాపం చూపి, వేడి కన్నీరు జలజల కురిపించు. భగవంతుడు నీలో కారుణ్యం ఇంకేలాగ చెయ్యలేక పోతే కరుణాశ్రువులు, వేదనాశ్రువులు; బాధానివారక బాష్పములు కురిపించు. అతను శాంతిస్తాడు. అదే నీకు క్షేమం" అని చాలా ఉద్వేగంతో సరళ అన్నది

అరుణతార చీరకొంగుతో ముఖం చాటు చేసుకొన్నది. క్షణం ఆగి, ఈ పారాణితో, "ఈ ముసుగుతో నేను ఏముఖం పెట్టుకొని అతన్ని చూడను ? అతన్ని గాయ పరిచి, అది మానకపూర్వమే దానిమీద కారం చల్లనా ? ఎలా అతని ఎదుట పడను పరశా !"

బ్రహ్మాండమైన ప్రశ్న మనో నేత్రానికి కనపడు తున్నది. పరశ అరుణతారలో హృదయాగ్నిని రెచ్చ గొట్టి వెళ్ళిపోయింది. ఆమె మనస్తాపమువల్ల పనిగా లేదు. అంతరంగక్షోభవల్ల ఐస్‌పార్లర్‌లో కూర్చోవడం మానేసింది. విలాసంగా తిరగడం, చక్కని దుస్తులూ, విలువైన నగలూ మానివేసింది. పనాశ్యాలు భార్య అనారోగ్యకారణం కనిపెట్టలేకపోతున్నాడు.

౧౬

భద్రకాళి పాటలగ్రామం వచ్చింది. కాలవకు కొద్దిదూరములో కెల్లుతో కొంప కట్టుకొన్నది. తల్లికి ఒక గది, తన కొకగది. భోజనశాల కేటాయింపుగా ఏర్పాటు చేసింది. చిన్న ఆవును ఇంటిదగ్గిరే ఖర్జూరపు చెట్టుకు కట్టేస్తుంది. గ్రామంలో అగ్రవర్ణాలవారు తన కేసి చూడకపోయినా, ఊరిచివర గొల్లలు, రైతులు ఆమె పిలిస్తే పలుకుతారు. ఇంట్లో పనిపాటలకు గొల్లను కుదుర్చుకొన్నది. నిత్యం పచ్చని చేలూ, కాలవ గట్టూ, దూరాన కుటీరాలూ, రాత్రి తారామండితాకాశము వద్దిన్నా ఆమెకు కనిపిస్తూ ఉంటాయి.

హరిచరణుడు పాటలగ్రామం వస్తున్నాడని భద్రకాళికి తెలిసింది. ఎప్పుడే వేళ వస్తాడో మాత్రం ఆమెకు స్పష్టంగా తెలియకపోవడంవల్ల, నిత్యమూ అతనికోసం ఎదురుచూస్తూ వండుకొన్న అన్నంసంగతి మరిచి, కుటీరద్వారందగ్గిర కూర్చొని ఆదుర్దాగా ఉంటున్నది. కొంతసేపు నింగీ నేలా కలిసిన దిక్చక్రాభానను చూస్తూ కలలు కంటూ క్షణ మొక యుగంగా కలుస్తూ ఉన్నది.

ఒకనాడు గొల్లవాడు "అమ్మగారూ, అయ్యగారు వస్తారనేనా మీరు గుమ్మందగ్గిర కూచుంటారు ! అయితే ముస్తాబు చేసుకోరేం " అన్నాడు.

"వెర్రిగొల్లవాడికి అలంకరణంకూడా తెలిసిందే" అనుకొని, పైకి ఏమీ చెప్పక భద్రకాళి నల్లచీర కట్టుకొన్నది. నల్లరైక తొడిగింది. నీలాలకొప్పు పెట్టి, నీటుగా కాటుక పెట్టి, సాదాగాజులు తొడుక్కొని చీకట్లో కలిసిపోయింది! ఎప్పుడు హరిచరణుడు వస్తాడో స్పష్టంగా తెలియక కాలవదాకా పోయి దీనంగా నీళ్ళకేసి చూస్తూ కూర్చున్నది. చీకటిలో ఆమెకు భయం వెయ్యలేదు. పొద్దు పోయేదాకా కాలవగట్టు పుంతకేసి చూస్తూ కూర్చున్నది. కంటి మీదికి కునుకువస్తే విసుక్కునేది. ఈ రీతిగా వారం రోజులు రకరకాలుగా అలంకారం చేసుకొని హతాశురాలై పోతున్నది. ముసలితల్లి కనిపెడుతూ ఏమీ అనలేక ఊరుకొన్నది. గొల్లవాడు సరిగా ఏమీ పాలుపోక ఇల్లు కనిపెడుతున్నాడు.

ఒకరోజు మధ్యాహ్నం పుంతదారినే రెండెడ్లల మెళ్లో మువ్వల చప్పుడైంది. ముందు గొల్లవాడు చొరవగా కాలవగట్టుకు పరుగెత్తినాడు. కిలకిలా నవ్వుతూ, ఆనందాశ్రువులు కురిపిస్తూ, వీడిన కేశపాశంతో, రైక ముడి విడివడగా వడివడిగా యామునాస్రవంతిలా పరుగులెత్తింది !

బండివాడు హరిచరణుని మెడ పట్టగా, గొల్లవాడు నడుము పట్టి బండిలోనుంచి దింపుతున్నారు. హరిముఖాన తెలివితేటలు లేవు! గొల్లవాడు కాలవలో నీళ్ళు తెచ్చి ముఖాన చిలకరించినాడు. భద్రకాళి అతన్ని లేవతీసి అతని శిరస్సు తన తొడమీద పెట్టుకొని కొంగుతో విసిరింది. నీరు గొంతులో పోసింది. అతనికి తెలివి వచ్చి, కళ్ళు తెరచి నీరసంగా "భద్రకాళీ, నాకింత పరిచర్య ఇంకెవ్వరు చేస్తారు...నువ్వు తప్ప..." అన్నాడు. వాళ్లు నెమ్మదిగా హరిచరణున్ని కుటీరంలోకి చేర్చినారు.

"భద్రా !....అమ్మయ్య!....అలిసిన పక్షి... రెక్కలాడిన పక్షి....ఆహాఁ....చల్లని....నీడ.... చేరింది."

సమాధానం ఏమీ చెప్పలేక సంతోషంతో భద్ర కళ్ళు తుడుచుకొన్నది. అయితే అతని ఆయాసం కనిపెట్టి "ఇంత నీరసంగా ఉన్నారు! గుండెజబ్బు కాదు గదా !" అంటూ అతన్ని మృదువుగా స్పృశించింది.

స్పర్శ మాధుర్యం వల్ల అతని తనువు పులకలతో విరిసింది. అరమోడ్పు కన్నుగవముగ్ధ విరిసిన కన్నీటి తెరలో అస్పష్టమైన ఆమెను చూస్తూ "నీ ఉత్తరము ప్రాణప్రదంగా దాచుకున్నాను భద్రా! నువ్వు నాకెవరని ఇంత సేవ చేస్తావు భద్రా!" అన్నాడు.

భద్రకాళి పెళ్లికూతురిలాగ తలవాల్చి, మాటలు రానిదానివలె అతని ముఖం రెప్పవాల్చక నిదానంగా చూస్తూ "మీరే నా సమస్తం! ఇంతవరకూ మీకు తెలియనే లేదా!" అని గద్గదికతో అన్నది.

అతను కుటీరద్వారంవైపు దృష్టి పోనిచ్చి "నా ఇష్టం లేనిదే నన్నిలా కుటీరంలో ఎలా బంధించావు? అరుణతారను ఎంతో ప్రేమించాను. నన్నిలా ఎందుకు దాచుకున్నావు భద్రా? నన్ను ప్రేమించి ఏమి సుఖం నీకు? ప్రేమించి తారను నేనేమి సుఖపడుతున్నాను" అని పలికినాడు.

ఆమె ముఖం చెరుగుతో కప్పుకున్నది. నిశ్వాస స్పందనాలు అతనికి వినవస్తున్నాయి.

"ఓహో, మీ ఇద్దరిలో ఎంత భేదం ఉంది! నమ్మించి ద్రోహం చేసి, పెళ్ళాడి, తీరా ఇప్పుడు పశ్చాత్తాపపడుతున్న తారకూ, కళంకం, దుఃఖం అన్నీ భరించి విపరీతసహనశక్తితో, త్యాగంతో ప్రేమించిన నీకూ ఎంత తేడా ఉంది!"

భద్రకాళి సంతోషము పట్టలేక దుఃఖిద్దా మనుకొన్నది!

"ఈ గాయం చూశారా? పూర్వంలాగా నన్ను చూచి అసహ్యించుకో రేమి?" అని కొంతసేపటికి ఉద్వేగం తగ్గినతరువాత ప్రశ్నించింది.

"ఇప్పుడు నిన్ను ప్రేమిస్తున్నాను. ప్రేమకు రూపముతో నిమిత్తం లేదు" అన్నాడు. భద్రకాళి మాట్లాడలేకపోయింది.

"నేను పాపమే చేస్తున్నానో, పుణ్యమే చేస్తున్నానో తెలియదు. నిన్ను ఈశ్వరుడు హింసిస్తే, మరో జన్మలో నయినా మన మిద్దరం విడిపోకుండా ఉందాము" అన్నాడు.

కాళి హృదయం నీరైపోయేలాగ విలపించింది.

"పునర్జన్మలో నైనా, ఎప్పటి కయినా, ఈశ్వరా, ఈ దౌర్భాగ్యురాలి పాపం పరిహారమైతే మా స్నేహం కాపాడవా!" అంటూ హృదయాంతరాళంలో మౌనంగా అప్రయత్నంగా ప్రార్థించింది.

కొన్నాళ్ళు హరిచరణుడు పాటలగ్రామంలోనే ఉన్నాడు. ఎంత విశ్రాంతి తీసుకున్నా గుండెజబ్బు మాత్రం నిమ్మళించలేదు. ఒక్కసారి స్నేహితు లందరినీ చూడాలని అతనికి తపన బయలుదేరింది. అతని ఇచ్ఛకు అడ్డురావడం ఉచితం కాదని అనుకొన్న కాళి "మీ జబ్బు తగ్గలేదు. అక్కడా అక్కడా ఉండి మందూ మాకూ లేక ఏమి ఇబ్బంది పడతారో. ఇక్కడే ఉండండి" అని దీనంగా వేడుకొన్నది.

కాళికి అనేకవిధాల నచ్చచెప్పి అతను బండీ కట్టించుకొని బయలుదేరినాడు. సాగనంపడానికి బండీ వెనకాలే పుంతవెంబడి పడి వచ్చింది. "వొళ్ళు జాగర్త! జబ్బు నయం చేసుకోండి. నేను బతికివుండగా మళ్ళీ మీ దర్శనం ఇప్పించండి." అని వెక్కిపోయి ఏదో మరిచిపోయి "మీరు కష్టంలో ఉన్నప్పుడు కాకిచేత కబు రంపితే మీ దగ్గిరికి వస్తాను. సేవాభాగ్యం ఇప్పించండి" అంటూ అలా నిలబడిపోయింది. కనుమాపు మేరదాకా బండిని చూస్తూ ఉంది.

౧౪

అరుణతారకు తీవరుజబ్బు ప్రవేశించింది. దానికి తోడు మనోవ్యాధి ప్రబలంగా ఉంది. చక్కదనమంతా తీసిపోయి నల్లబడి క్రమంగా ఎముకలుకూడా కనిపిస్తున్నాయి. కళ్ళు లోతుకు పీక్కుపోయినవి. శరీరమంతా పొడలు బయలుదేరాయి. సన్యాలు పానీయము అమ్మకం తగ్గించి అస్తమానమూ భార్యదగ్గిరే వుంటూ, ముక్కారు ముద్దినసువస్తువులు కొని తెస్తూ ఉన్నాడు. ఏమి చేసినా ఆమెకు ఉల్లాసం కలగడం లేదు. ఇంగ్లీషు వైద్యం చేయిస్తున్నాడు. ఎన్నాళ్ళు మందు ఇప్పించినా డాక్టరుబిల్లు మాత్రం కనిపిస్తున్నది. ఆమె గర్భమంతా కాలేయమూ, ప్లీహమూ వ్యాపించాయి. కళ్ళల్లో వింతగా మెరుపు బయలుదేరింది.

తన పక్కనే కూర్చున్నప్పుడు భర్తతో ఏదో విషయం చెప్పివేదా మని ఆమె నాలుక చివరదాకా

వస్తున్నది. అయితే చెప్పలేక లోపల ఇముడ్చుకొన్నది. సన్యాసులు కొన్నాళ్ళకు అది కనిపెట్టి "తారా, నీ కేమైనా కావాలా? మందు మార్చి మరోచోటికి తీసుకువెళ్ళమన్నావా?" అని అడిగినాడు.

చెమ్మగిల్లిన కళ్ళతో "నేను ఎలాగూ జీవించను. హృదయంలో దాచుకొన్న కోర్కె బాధగా ఉంది. చెపితే మీకు శ్రమగా ఉంటుంది" అన్నది తార. అతని ముఖాన కాంతి తరిగింది. భర్త సంబాళించుకొని "చెప్పు; నీ కోరిక ఎలా వుంటే అలాగే కానీ" అన్నాడు.

"నేను జీవితంలో మహాపాపం చేశాను. చేసిన పాపానికి పరిహారం ఉండదు. ముమ్మాటికీ ఉండదు. ఇప్పుడే అనుభవిస్తున్నాను పాపఫలం! హరిచరణ్, జీవితం ఎందుకూ పొందకుండా నేనే చేశాను మీమీది వ్యామోహంవల్ల. అతన్ని బికారిని చేశాను. నావల్ల మీకూ సుఖంలేదు. మందూ మాకూ ఇప్పించి నన్ను బాధించక వేగిరం చనిపోనివ్వండి. చనిపోయేముందు నా కోరిక మీరు చెల్లిస్తే శాంతిస్తుంది నా ఆత్మ అలా చేస్తానని చేతిలో చెయ్యి వెయ్యండి" అంటూ చెయ్యి చాచింది. రోగి మానసికస్థితి గ్రహించి ఏం చేయడానికైనా సిద్ధపడి సన్యాసులు చేతిలో చెయ్యివేసి "నీ కోరిక ఏమిటో చెప్పు తారా!" అన్నాడు.

"ఒక్కసారి హరిచరణుడికి కబురు చెయ్యండి. నేను చనిపోయేముందు అతను క్షమాపూర్వక కారుణ్యంతో నన్ను చూస్తే హాయిగా చనిపోతాను. ఏమో తన కోరిక... అబ్బ! ఆయాసం వస్తున్నది... అతనికి తంతి పంపండి..." అని చాలా ఆయాసభారంతో అన్నది. ఆమె తలకట్టు నిమురుతూ శయ్యపక్కనే కూర్చుని సన్యాసులు మొదటిసారి అతని జీవితంలో మర్మాంతిక వేదన అనుభవించినాడు. ఆ వేదన జ్వాలవలె హృదయగోళమంతా ఆవరించి అతన్ని వేగించింది. పెద్దవాడైనతరువాత ఎప్పుడూ కన్నీరు జలజలా కురిపించి ఎరగడు. తనకు తెలియని కారుణ్యం హృదయాంతరాళంలో ఊట లూరి ఈర్ష్యాభావాన్ని కడిగివేసింది. "పాపం, అతనికి తంతి ఇస్తాను" అన్నాడు భర్త.

"నన్ను ఇక్కడే ఉంచేమాటయితే ఇక్కడికే ఆయనను రమ్మనండి" అన్నది తార.

"ఇక్కడ ఈ వైద్యం కుదరదు. నిన్ను ఆసుపత్రిలో చేర్పిస్తే వైద్యసహాయం బాగుంటుంది. నర్సులు అస్తమానం నిన్ను కనిపెడతారు. ఏమంటావు?"

"ఇల్లు వదిలి ఆసుపత్రిలో చనిపోవడమెందుకు?"

"అలా అనకు. నీకు జబ్బు తగ్గిపోతుంది తారా!"

కళ్ళవెంట ధారలు కురిపిస్తూ "నా పాపపరిహారం మృత్యువుకు లొంగడమే. జీవించి సుఖపడను" అన్నది.

సన్యాసులు "ఎందుకిలా మనస్సు కష్టపెట్టుకొంటావు? లోకంలో పాపం చెయ్యనివాడెవ్వడు? అందుకోసం చచ్చిపోవడం మంచి దనుకొంటే ఎలాగ చెప్పు. తారా! నిన్ను క్షమించే భార్యగా మొదట స్వీకరించాను–" అని సమాధాన మిచ్చినాడు.

"మొదట్లోనే వివేకం ఉండదు గదా మనిషికి?" అని దీనంగా పలికింది తార.

"పని చేసేముందే వివేక ముంటే బాధపడం. ఇంతకూ మనసును తప్పుకానితప్పుకాని ఎందుకిలా కుమిలిపోతావు? పుట్టెడు రోగంలో ఉండి చిత్తక్షోభ పెట్టుకోకు. విశ్రాంతిగా ఉండు తారా?"

"నా జన్మకు విశ్రాంతి ఒక్కచోటనే!"

"నా మాట విను. ఆసుపత్రిలో నిన్ను చేరిపిస్తాను."

౧౮

భద్రకాళిని వదలి హరిచరణుకు మిత్రకోటిని కలుసుకొని కొన్నాళ్లు బాధ మరిచిపోయినాడు. సహవాస దోషంలో విశ్వంభరచౌదరీవల్ల సురాపానము తిరిగి ఆరంభించాడు చరణుడు. తాగి విశ్వంభరుని గదిలో తివాచీమీద దొర్లుతూ "ధక్! నేను ఎవ్వరినీ ప్రేమించను. ప్రేమ నాటకం, బూటకం. ఓ తారా!

ఓ అరుణతారా! హా హా! నిన్ను మరిచిపోతాను. కాళీ, నా హృదయం దొంగిలించావే! ఎంత నేర్పు నీది? ప్రేమించటం మహావంచన అని ఎరగవుటే? ... హా హా హా" అని నవ్వుతూ పేలాపన సాగించినాడు. తాగుడువల్ల అతనిగుండె బలహీన మవుతున్నది. కడుపు పీపావలె పెరిగింది. తిండికూడా మాని తాగుడు మీదనే ఆధారపడి చేతులారా జీవితం పాడుచేసుకొంటున్నాడు.

విహారి డాక్టరు సలహామీద చరణుని తీసుకొని ప్రయాగ వెళ్ళినాడు. గాలిమార్పువల్ల రోగం కొంచెం మళ్ళింది. అలవాటును నిగ్రహించే సరికి, సుర దొరకక చరణుడు బాధపడ్డాడు. ప్రయాణంలో ఆడదిక్కు కూడా ఉంటే మంచిదని విహారికి తోచింది. తనభార్య గర్భిణీగా ఉండడంవల్ల ఆమెను పుట్టింటికి పంపించినాడు. ఆ దక్షత ఎవరూ లేరు. దిగిన ఊళ్ళో హోటలునుంచి ప్రత్యేకంగా భోజనం తెప్పించేవాడు. ఎప్పుడైనా కొంచెం నరాలు వణుకుతున్నట్టు బాధగా వుంటే చరణుడు "విహారీ! భద్రకాళిని పిలిపిస్తే ఎలా వుంటుంది? పాపం, దానికి మాట ఇచ్చాను. నా బాధలో సేవాభాగ్యం కోరింది దీనురాలు" అన్నాడు.

విహారి అందుకు అంగీకరించలేదు. కొంతసేపటికి చరణుడికి తోచింది "కాళీని కూడా ఉంచుకొని ఊరూరా తిరగడం బాగుండదు" అని. అతని హృదయంలో కాళీమీద మమకారం ఉన్నా పూర్ణగౌరవం ఇవ్వలేకపోయినాడు. తెలిస్తే కొద్దిగా నొచ్చుకోకుండా ఉండరు. తాగుడు బలవంతాన వీలులేక కట్టిపెట్టడంవల్ల కాళీ అతని చిత్తవీథిలో తారాడుతూనే ఉంది. నెలరోజులు సంచారం పూర్తిచేసి కలకత్తా వచ్చారు మిత్రు లిద్దరూ.

చరణుడు కలకత్తా వచ్చినప్పట్నించీ మనసంతా అరుణతారమీదనే లగ్నమవుతూ వచ్చింది. మనోనిగ్రహం లేకపోయి "నేను జీవించి ఉండగా ఒక్కసారి అరుణను చూడాలి! ఎవరు ఏమనుకున్నా సరే" అని నిశ్చయము చేసుకొన్నాడు హరి. సన్యాలు ఇచ్చిన తెంతివల్ల ప్రియురాలిని చూడక తప్పదని, విహారికి గాని, సోదరికిగాని చెప్పకుండా రెండెడ్లల బండీ కట్టించుకొని హరిచరణుడు అశ్వత్థపురం బయలుదేర దలచినాడు. అరుణతార కలకత్తాలో ఉండడానికి ఇష్టపడక అన్నగారింటికి అశ్వత్థపురం వెళ్ళింది రోగం రొప్పితో. సన్యాలుకూడా ఆమెదగ్గిరే ఉన్నాడు.

రాత్రి వర్షం కురిసి వెలిసింది. రాత్రి గడియలు లెక్కపెడుతూ, ఆయాసంతో మూలుగుతూ హరిచరణుడు ఎప్పుడు తెల్లవారుతుందా, ఎప్పుడు అశ్వత్థపురం వెళ్ళుతానా అని తాపత్రయంతో ఉన్నాడు. కలకత్తాలోనై లెక్క సమీపంలో ఉన్న చిన్నస్టేషనులో దిగి బండీ మాట్లాడుకొన్నాడు.

"ఎన్నాళ్ళు పడుతుంది ప్రయాణం?" అని ఆతుర్దాగా అడిగినాడు.

"రోజల్లా పడిపో దండి. రెండురోజులు కనీసం"

"రెన్నాళ్ళు నేను బతికి, అరుణను చూస్తానా? ఎలా గయినా ఆఖరిసారి ఆమెను చూడక తప్పదు."

బండీ ఎక్కుతూవుంటే చచ్చిపోయిన తల్లీ, సాధువుల్లో కలిసిపోయిన తండ్రీ, మహాత్యాగంచేసి ప్రేమించిన కాళీ అతనికి జ్ఞాపకం వచ్చారు. బుగ్గలమీద అశ్రువులు వెల్లువలైనవి. పశ్చాత్తాపపడి జీవితసంధ్యలో ఉన్న అరుణతారను చూస్తేగాని అతని హృదయానికి శాంతి లేదు.

తోవ తిన్నగా లేదు. వాననీరు నిలిచింది అక్కడక్కడ గుంటల్లో. రస్తా బాడిగా ఉంది. బాటలో బండి చక్రాలు కూరుకుపోతున్నాయి. తరుచుగా బండివాడు దిగి చక్రాన్ని పూనికతో నెట్టవలసివస్తున్నది! ఎద్దుల వీపులమీద వాతలు తేలుతున్నాయి. నిర్దాక్షిణ్యంగా వాటిని కొడితేగాని బండి లాగలేవు. పది క్రోసుల దూరం ఎప్పటికి దాటడం! ఉదయాన్నే చలిగాలి హోరున వీస్తున్నది. సాయంకాల మైనది. గాలి తగలడంవల్ల, బండికుదుపువల్ల చరణునికి జ్వరము వచ్చింది. "ఎంత దూరం పోయింది బండీ?" అని మూలుగుతూ అడిగినాడు హరి.

అతనికి ఉత్సాహము కలిగించాలని "ఎంతో లేదు దూరము" అని సమాధానము ఇచ్చినాడు బండివాడు.

మరికొంతసేపటికి అతను అదే ప్రశ్న. "ఆరు కోసులు దూరం బాబూ!" అన్నాడు బండివాడు.

"నాయనా, నన్ను త్వరగా అశ్వత్థపురం చేర్చు వోయి! గడువు దగ్గరికి వచ్చింది. నీకు ఎంత సొమ్మయినా దఖలు చేసుకుంటాను." అని కడుపు తరుక్కుపోయేలాగ దీనంగా అడిగాడు. బండివాడు ఉత్సాహంగా ఎద్దులను తోలుతున్నాడు. హరిచరణునికి ఒకటే మనో వ్యాకులత. "అశ్వత్థపురం చేరగలనా? చనిపోవడానికి సిద్ధంగా వున్న అరుణను చూచి ప్రాణాలు శాంతంగా విడవగలనా?"

జ్వరంవల్ల రాత్రల్లా బండిలో అతను లంకణం. హోరుగాలి సవ్వడి, బండి చప్పుడు, పొలాల పక్కన కీచురాళ్ళరొద మాత్రమే అతనికి వినవస్తున్నాయి. మనసంతా అశ్వత్థపురంలో మగ్నమై పోవడంవల్ల, అతనికి ప్రయాణం చేస్తున్న ధ్యాసకూడా లేదు. రాత్రల్లా బండిలో మూలుగుతూ హరిబాబు నిద్రపోయాడు. తెల్లారేసరికి కళ్లు విచ్చాయి. మళ్లీ ప్రపంచం, ప్రయాణం అతనికి ప్రత్యక్ష మైనాయి! సుషుప్తిలో బాధ మరిచిపోయి సుఖపడ్డ ప్రాణం జాగృతిలోకి వచ్చేసరికి యాతన తప్పదు. బండివాడు ఉదయాన్నే బండి ఆపి, ఎద్దులకు మేతపెట్టి, తను చలిది తిన్నాడు. తెల్లవారే సరికి జ్వరం తగ్గింది. కాఫీ తాగాలని హరి అనుకొన్నాడు. ఎక్కడ దొరుకుతుంది? బండివాడు యథా ప్రకారంగా బండి తోలుతున్నాడు.

"ఏమోయ్! ఎప్పటికి చేరగలం?" అని హరి అడిగాడు. "బాబూ, సంజవేళకు చేరగలం" అని వాడు జవాబు చెప్పినాడు. హరిబాబు కఠినంగా ఎదురు దిగుడుగా ఉన్న డొంకకేసి చూస్తూ నిట్టూర్పు విడిచి "పరమేశ్వరా! దయాసింధూ" అనుకున్నాడు. బండివాడు అతని స్థితి అర్థం చేసుకోలేక "ఏం బాబయ్యా?" అని ప్రశ్నించాడు.

ఆయాసము ఎక్కువై ఏమీ మాట్లాడలేక పోయినాడు హరి.

"అయ్యా, పండుకొన్నారా?"

మాటేమీ లేదు. బండివాడు లోపలికి తిరిగి హరిచరణుని చూచినాడు. అతని పెదవులు కదిలినవి.

బండివాడు బండి ఆపి బలంకొద్దీ హరిబాబును లేవనెత్తి, గడ్డి పక్కమీద పరుండ పెట్టి, దుప్పటి కప్పినాడు. మాట సమాధానం చెప్పలేని హరి కృతజ్ఞతాపూర్వకంగా రెండు కన్నీటి చుక్కలు జార్చినాడు. మధ్యాహ్న సూర్యకిరణాలు బండితడికలోంచి అతని ముఖంమీద పడుతున్నవి. కపోలాలమీద కన్నీరు మిలమిలా మెరిసింది.

సూర్యుడు అస్తమించేసరికి బండి గమ్యస్థానం చేరింది. "బాబయ్యా, దిగండి" అన్నాడు. హరి దిగలేక పోయినాడు. బండివాడు పూనికతో అతన్ని ఎత్తుకొని చెరువుగట్టున రావి చెట్టు పక్కన అరుగుమీద దింపినాడు. చీకటి నాలుగువైపులా ఆవరిస్తున్నది. ఆ చీకట్లో నీరూ నేలా తెలియదు. బండివాడు తన దీపం తీసి వెలిగించి అరుగుమీద పెట్టి చరణుకు ఇచ్చిన డబ్బు లెక్క చూచుకుంటున్నాడు. రావిచెట్టు దగ్గర దీపం చూసి, పాలు తీసి ఇంటికి పోతున్న గొల్లవాడు వచ్చి, చరణుని చూచినాడు.

"ఎవరికోసం మీరు వచ్చారు?" అని అడిగినాడు ఒక గొల్ల.

హరి చెప్పలేకపోయినాడు. అతని నోరు పక్షవాతం వల్ల పడిపోయింది. బలవంతాన చెయ్యెత్తి ఏదో సైగ చేశాడు. గొల్లకు ఏమీ అర్థం కాలేదు. బండివాడు తోవలో జరిగిందంతా వాడికి కొంతవరకు అర్థమయ్యేలాగ చెప్పినాడు. వాడికి ఏమీ పాలుపోక కరణంగారితో చెప్పాడు. ముగ్గురు దీపాలు పుచ్చుకొని వచ్చారు. అతనెవరో వాళ్ళకు తెలియలేదు. ఎవరికోసం ఆ గ్రామం వచ్చాడో? హరిచరణుడు సమాధానం చెప్పలేక కంట తడి పెట్టాడు.

అరుణతార అన్నగారింట్లో కూడా ఈ సంగతి తెలిసింది. నీరసంగా వున్న తార లేచి గుమ్మంలోకి వెడుతున్నది.

"పడిపోతావు, వెళ్ల లేవు. ఎక్కడికి?" అని ఆదుర్దాగా సవాలు ప్రశ్నించినాడు.

"మనింటికి ఎవరైనా వచ్చారేమో?"

"అమ్మాయీ, శక్తి పడిపోతావు. పడుకో" అన్నాడు అన్న. ఆమె హృదయంలో కల్లోలం బయలుదేరింది. ఎవరిమాటా లెక్క చేయక చలిగాలిలో గుమ్మం దిగింది. తోవన పోతున్న కరణంగారిని పిలిచి "ఎవరండీ చెరువుగట్టున? ఎవ రా వచ్చినవారు?" అని అడిగింది.

"ఏమో, ఎవరికో పాపం. మాట పడిపోయింది. గుండెదడ ఎక్కువైంది. ఇప్పుడే వైద్యుడు వెళ్లాడు."

అరుణతార హృదయాన్ని అణుచుకోలేక భర్తని బతిమాలుతూ "ఏమండీ, ఎవరో చూచి రండి" అన్నది.

సన్యాలు విసుక్కుంటూ "వెళ్లి పడుకో. నేను కనుక్కుంటాను. మనకోసం వచ్చేవాళ్లు చెరువు దగ్గర ఆగి ఊరుకుంటారా, వెర్రి కాకపోతే!" అని హెచ్చరించి చెరువుదగ్గరికి వెళ్లినాడు. వైద్యుడు తిరిగి వస్తూ- "ఎవరో నండీ, బస్తీవాడు. గుండె జబ్బుతో, పక్షవాతంతో ఇప్పుడే చనిపోయాడు" అన్నాడు.

సన్యాలు వెళ్ళి చూచేసరికి, శవం ముఖం మీద దుప్పటి కప్పి ఉన్నది. వణుకుతున్న చేతులతో దుప్పటి తొలగించి, ధూళిధూసరిత మైన హరిచరణుని ముఖము గుర్తించినాడు సన్యాల్. బుగ్గ మీద కన్నీటిచారలు అలాగే ఉన్నాయి. సన్యాలు భార్యతో చెపితే ఉద్రేకంలో చనిపోతుం దని భయపడుతూ శవందగ్గరే స్థాణువులాగ నిలబడినాడు.

ఎంతసేపటికీ భర్త రాకపోవడం వల్ల ముసుగు పెట్టుకొని అరుణతార పూనికతో వచ్చింది. సన్యాలు ఆ దృశ్యం చూడలేక పక్కకు తిరిగినాడు. అరుణతార "విశ్వాస ఘాతకిని!" అంటూ పడిపోయింది.



# 'నవయామిని'

[పరామర్శము]

= శ్రీ బులుసు వేంకటేశ్వర్లు =

శ్రీకట్టమంచి రామలింగారెడ్డిగారు ౧౯౩౯వ సంవత్సరమునఁ జిత్తూరులోఁ గని, తీర్చి దిద్ది ౧౯౪౭ అక్టోబరు భారతి ముఖమునఁ దమ 'నవయామినీ'కృతికన్యను 'బాలకుల యనుగ్రహమునకు (కుమారికగాఁగ) దత్తము' చేసియున్నారు. పాశ్చాత్య విద్యానిష్ణాతులై ఖండాంతరముల పైతము కీర్తిగన్న శ్రీ రెడ్డిగారాంధ్రము నభిమానించుచుండుటయు, నందుఁ గృతికన్యలఁగూడఁ గని పెంచుచుండుటయు మిక్కిలి శుభప్రదము. కావుననే, వీరి నవయామినీకృతికన్య నన్య కన్యలవలె ననాదరింపక పలుమాఱుఁ బరిశీలింపవలసి యున్నది.

జాగ్రత్తగా నాలోచించినచో 'బిల్హణీయ' మనాదరణీయ మైన కావ్యము కాదు సరికదా, మఱి నీచాతినీచ మెన్నటికిఁ గాదు. ఏలన, నిది యహల్యాసంక్రందనము, శశాంకవిజయములవంటిది కాదు. అందలి నాయికలు గృహిణులై యన్యపురుషులఁ గూడినవారు. అది ధర్మవిరుద్ధము. యామినీ బిల్హణుల పవిత్ర దాంపత్యము ధర్మవిరుద్ధము కాదు. యామిని రాజకన్య; సకలకలాపూర్ణ. బిల్హణుఁడు కవిరాజశిఖామణి; విప్రుఁడు. విప్రుఁడు క్షత్రియకన్య నుద్వాహ మగుట ధర్మబద్ధము. పైఁగా నీ దాంపత్యము పవిత్ర ప్రణయ సూత్రమువలననే కలిగినది కాని తుచ్ఛ కామజనితము కాదు. ఇఁక, గురువు శిష్యురాలిని పెండ్లాడుటయు ధర్మవిరుద్ధము కాదు. అందుచేతనే విరాటరాజు పుత్రియగు నుత్తర నర్జునుని కిచ్చెద నని పలికినాఁడు. కాని, యర్జునుఁడు ముఖ్యముగాఁ దన వర్తన మితరులు శంకింతు రనియే తా నామెను కోడలిఁగాఁ గైకొనెను; కాని, భార్యగా గ్రహింపలేదు. తా నది ధర్మవిరుద్ధమే యని యెంచిననాఁడు తన కుమారునకు మాత్రము భార్యగా నాతఁ డుత్తర నెట్లంగీకరింపఁ గలఁడు? ఆమె పుత్రి; ఈతఁడు పుత్రుఁడు. మఱి యన్న చెల్లెలి వరుసగాదా? ఉత్తమరసప్రవిష్టులు, నుత్తమసౌందర్యనిధానములు నగు యామినీబిల్హణుల దాంపత్యము నీచము కాదనుట నా భావము. శ్రీ రెడ్డిగారి సందేహములకు, సంప్రశ్నములకుఁ గ్రమముగా నిట సమాధానించెదను.

"బిల్హణీయమందలి విషయము మంచిది కాదు. కల్పన సత్యమునకు, నైజమునకు విరుద్ధము. కథానిర్మాణమునందుఁ బ్రౌఢభావము మృగ్యము. కావున మిథ్య, శూన్యము." ఇది శ్రీ రెడ్డిగారి యుద్దేశము. కాని, బిల్హణీయకర్త బహుశాస్త్రవేత్తయే కాక, "కావ్యనాటకలసదలంకార సాహితీసంపన్న రసలసద్ధీరహృదయుఁడు". మఱియు, నొక్కపురాతన కథను రామాంకితముగ నాంధ్రప్రబంధముఁ జేసి, యాచంద్రార్కమగు సత్కీర్తి నిగాంచఁ బ్రేరితుఁడు. అట్టి యాతఁడు 'నీచాతినీచ మగు' కావ్యమును వ్రాసె ననుట సాహస

మే యగునేమో! ఐన, నిందలి ప్రాయోభావవిహీనతా కారణము లేవో చూతము. బిల్హణుఁడు సుందరుఁ డని యెఱిఁగియు మదనాభిరాముఁ డాతనిని యామినికి గురువుగా నేర్పఱచుటకుఁ గారణములు గలవు. కొలువుకూటమున కేఁగుదెంచిన పండితు లెల్లరు నేకకంఠముగఁ "గవులలో నెల్ల బిల్హణకవియ మే" లని పలుకుట యొకటి. యామిని సామాన్యవిద్యార్థిని గాదు. అప్పటి కప్పుడే సంగీతజలధికిఁ జంద్రదీశమై యెల్లర మెప్పుఁ గాంచినది. మానవాతీతమైన బుద్ధికుశలత కలది. ఆమెకు మహోన్నత కవిశేఖరునే నియమించి చదువు చెప్పింపవలె ననియే యుండును గాని యే ముసలి వానినో బేరమాడి యుపాధ్యాయునిగా నియమింపవలె నని ప్రాజ్ఞుఁ డగు రాజున కుండదుగదా! మఱి యామినీ, బిల్హణులకు నిర్భయముగ నేకాంతసంఘటనము కలిగించు పట్లఁ బుక్కిటిపురాణము లాశ్రయించినాఁడు రాజని శ్రీ రెడ్డిగా రాక్షేపించిరి. మఱియు, నైరోపాలోని చాపిరాన్పద్ధతి నైన రాజనుసరించియుండవలసిన దని వారు సూచించిరి. కాని, మదనాభిరాముఁ డైరోపా చూచి యుండని కారణమున నందలి పద్ధతులు తెలిసియుండకపోవచ్చును. మఱి యామినికి సహపాఠకుల నేర్పఱుపక పోవుటకుఁ గారణము తెల్లమే. మదనాభిరాముఁడు మహారాజు. తన కూఁతు రన్యథా ప్రవర్తించు నని కాని, తనకు వెఱవక బిల్హణుఁ డామెను గామించునని కాని మదనాభిరాముఁడు దృఢనిశ్చయుఁడు కాకపోవుట లోపమే కావచ్చును. కాని, దాని కాతఁడు పన్నిన యుక్తియే యాతనికి సంశయముఁ బోఁగొట్టినది. ఆతని దృష్టిలో నీ యుక్తి గొప్పది. శ్రీ రెడ్డిగా రది పుక్కిటిపురాణముల నాశ్రయించు టని నిరసించినారు. ఇందు ముఖ్యగమనార్హమగు విషయ మొకటి గలదు. ఆదినములలో నైన నీదినములలో నైనను, గాముకులైనవారికి సహపాఠినులయు, సహపాఠకులయు భీతి మ్వాగ్యము. వా రన్యమార్గముల నరయుచునే యుందురు. అంతకు మించి యాస్తికులు మతధర్మము శ్రుతివిధులు వ్యతిరేకించుటకు భయపడుదురు. యామినీ బిల్హణు లట్టివారు. కావుననే, కుష్ఠరోగిని జూడఁగూడ దను వ్రతము బిల్హణునకు, నంధుని జూడ దను వ్రతము యామినికి నిది వఱకే కలదు. తమ వ్రతభంగమునకుఁ బ్రాణము పోవుటకైనను వారిచ్ఛగింపరను విశ్వాసమే రాజునకుఁ గలిగినది. అందుచే నాతఁ డాయుక్తిఁ బన్ని, మఱియు వారిరువురకు మధ్య తెర గట్టించినాఁడు. ఈ తెర శ్రీ రెడ్డిగా రెంచినట్లు గాలికిఁ జేతికిఁ జలనము చెందునది కాదు; గట్టిదే. ఐనను, తుది పరిణామమును బట్టి యిది వ్యర్థమైనదే కాని కొంతకాల మీ మిష పనిచేసినది కదా! కొంతకాలమే కాదు. ఆమె కావ్యపఠనము, సర్థవిచారము, శబ్దసంగతి యెఱిఁగి "సకల విద్యలు గ్రహించి ప్రౌఢ" యగువఱకుఁ బనిచేసిన యీ తెర రాజుగారి వివేకహీనతకు నిదర్శనము కాదుకదా!

పైఁ జెప్పినట్లు బిల్హణుఁ డధర్మపరుఁడు కాఁడు. నిగ్రహశక్తి లేని 'పశువు' కాఁడు. యామినియు నట్టిదే. కాని, వారి దృష్టు లస్థానమునఁ బ్రసరింపలేదు. రూపగుణవిద్యావివేకరసగ్రహణాదులలో నుభయులు నొకరిని మించినవా రొకరైరి. ఇరువురు నిరుపమానులు. బిల్హణునికంటె నేవిధమునను నే రాజకుమారుఁడు మిన్న గాకపోవుట

చేతఁ దన రూపగుణవిద్యాదుల కాతఁడే తగిన వరుఁడని యామె యాతనిఁ గోరుకొనుటలో వారి యైక్యతలో దోషము లేదు సరి కదా, బంగారునకుఁ దావి యబ్బినట్లైనది; శుక్తిరత్నసమ్మేళన మైనది. తన్ముక్తా ఫలముచే మదనాభిరాముఁడు వారసునిగాఁ గైకొని తనరాజ్యము నొసఁగినాఁడు. బిల్హణ కవిసార్వభౌముని జెట్టపట్టఁ గలిగిన మహాయోగము యామినికిఁ గలిగినది. ఉత్తమ కన్య నుత్తమ వరున కిచ్చిన దానఫల మా రాజునకుఁ గల్గినది.

ఇది యిట్లుండఁగా శ్రీ రెడ్డిగారి భావాంబరవీథి విహరించు యామినీ బిల్హణుల ప్రకృతులగుఱించిన పలుకులు వారికే "యధికప్రసంగము" లని తోఁచి వెంటనే విరమించినారు. కాని, వారి కథా నిర్మాణమునఁగల లోపములు సరయవలసియున్నది.

ముఖ్యముగా శ్రీ రెడ్డిగారి 'నవయామిని'లో ధర్మభంగము, ననౌచిత్యము, రసాభాసము నను దోషములు కలవు. దిఙ్మాత్రముగ నవి యిట సూచితములు. బిల్హణుఁడు మహాకవిరాజు. "మృగములలో సింహము, రాజులలో రాముఁడు" నెట్లో కవి పండితులలో నీతఁడట్లు. అతఁ "డొకచెంత వేదాంతము, నొకవంక మణిసారము, నొకవంక నాటకకలాపము, మఱియొకచో శృంగార కావ్యములు, నొండొకచో సామము, నొకదండఁ గలగానము" నిట్లే మీమాంస, వ్యాకరణము, భాష్యము, నలంకారము - నొకటేల, నమస్తము చెప్పఁగల మహాకవి. అతనికి ముక్కుపచ్చలారని యామిని బుద్ధిచెప్పుట గ్రుడ్డు వచ్చి పిల్లను వెక్కిరించుటే కదా! అస్థానమున దృష్టి పాఱించి నిగ్రహవిహీనుఁడయి యెదుటి యామిని మనోవర్తన మెఱుఁగక నోరుజారి కాలుజారిన బుద్ధిహీనునిగాఁ గవిని జిత్రించినారు శ్రీ రెడ్డిగారు. యౌవనము కలిగి, రూపగుణ వైదగ్ధ్యములలో నుత్తమోత్తముఁ డగు పుణ్యపురుషుని వరించిన యామినియు, నామె హృదయపరిశుద్ధ ప్రణయమును గుర్తించి పరమప్రయోజన మాసించి నిజపవిత్రప్రేమకై జీవితముఁ ప్రాణము నీయ సిద్ధమై దిగ్విజయ మందిన బిల్హణకవిశేఖరుఁడును శ్రీ రెడ్డిగారి నవయామినీ నవీనబిల్హణులకు సాటి రారని యెంచుట చిత్రము! శ్రీ రెడ్డిగారి బిల్హణుని రసావేశమునకు ఫలితము మృగ్యమైనది. అతని ప్రేమ మంధ మని ఋజువైనది. నవయామిని నిరాకరించినది. దీనివలన 'నవయామినీ' కావ్యమున రసభంగమైనది.

ఇందుచేఁ బ్రస్తుత 'నవయామిని'లో శిష్యురాలు గురువునకు బుద్ధి చెప్పుటయుఁ, "గొంతవఱకు వయసుముదిరిన బిల్హణ పండితుఁడు వయస్సునను, వర్తనమునను నార్యమైన నవయామినిని" గోరుటయు ధర్మభంగ మగుటకు నిదర్శనములు. ముక్కుపచ్చలారక నూతనముగ యౌవనోద్రేకమునఁ దప్పదారి పట్టిన దస యామిని నన్న ననవచ్చునుగాని పండితప్రభువు, కవిసార్వభౌముఁడు, వేదవేదాంతవేత్త యగు బిల్హణుఁడు నీచముగఁ బ్రవర్తించె ననుట యనౌచితి యనక తప్పదు. నాయకునిలో నుత్పన్నమైన శృంగార రసమునకు ఫలితము వ్యతిరేకించుటయు, నాయికయరసికతతోఁ బ్రవర్తించుటయుఁ గారణములుగా నిందు రసాభాస మైనది. మొత్తము మీఁద 'బిల్హణీయము' కన్న శ్రీ రెడ్డిగారి 'నవయామిని' యే ఘమునను రసవత్తరము కా దని మనవిచేసికొనుచున్నాను.

# మౌనసుందరి

(రేఖాచిత్రం)

•

— శ్రీ హనుమచ్ఛాస్త్రి —

గాలి వీస్తోంది.

చుక్కలు పక్కలెగరవుగాద మసకదీపాల్లా ఉన్నాయి. చంద్రుడు పాండురోగిముఖంలా ప్రకాశిస్తున్నాడు.

ఆకాశం—

హఠాత్తుగా తన ముఖాని కింత చీకటి పులుము కుని మాపూరుమీద ఇంత పులిమింది.

కళ్లలో తడిమేఘాలు...

మబ్బు పొరలిచ్చినప్పుడు ...నీరసంగా వచ్చే వెన్నెల క్షయరోగస్త్రీ విధి లేక నవ్విన నవ్వులా ఉంది.

గుండెల్లో బాధ అణుచుకుంటూ...జాజిపందిరి దగ్గరికి వచ్చాను.

అదృష్టం...కొరవిదయ్యంలా...ఎంత దూరం మూరలాడినా...సన్నజాజిపూవాసన తగలగానే ప్రాణం చురుకుదనం ఇంకా మానలేదు.

జాజి వాసన ఒక ప్రియురాలిని జ్ఞప్తికి తెస్తుంది!

ఆ కోరిక నిష్ఫలదనంతో బ్రతుకంతా...సజీవంగా నింపుగా గడుపుదా మనుకున్నాను.

చటున—

బ్రతుకులో చేసి పోతూన్న దేహం అని తోచి మనస్సు ఏడ్చింది.

జాజిపూలు వెక్కిరించాయి.

పువ్వుల అందం తెగపొగడుతారు కవిగాళ్లు... వాళ్ల కొక ఆస్పత్రి కట్టించడం మంచిది.

నే చెబుతున్నాను విను.

జాజిపూలకన్న సన్నంగా కత్తిరించిన కాగితం ముక్కలు దొడ్డవి.

వాసనారహితం కావడం గొప్పస్థితి అంటారు వేత్తలు...

తలవంచుకు నడుస్తున్నారు.

నీలిమందులాంటి అవమానంలో...

నిలువునా ముంచి పైకెత్తినట్టుంది.

ఒకొక్కవాడు ఒకొక్క మనిషిమీద లోకం పగపడుతుంది కాబోలు—

ఈ వేళ నావంతు...

శాకుంతలం నాటకం మీదా......శిరస్త్రాణల మీదా, ఆ అమ్మాయిముఖంమీదా ఇదువ్వరకో లేనంత లోతగా ఉంది.

ప్రేమ అనే మాట దేవతావస్త్రంలాంటిది గాబోలు, ప్రతివాడూ మహామహోపాధ్యాయుడులా మాటలాడుతాడు.

స్వరూపం చూచినవాడు ఒక్కడూ కాడు. ...అంతకంటే వెళ్లే ధ్రాణలేదు.

మానవుడు సుఖమైన కాలక్షేపానికి...మెదడులో కల్పించుకున్న జాడ్యంగాబోలు ఈ ప్రేమ!

ఇంద్రియ ఉన్మాదానికి ఎంత చక్కని పేరు! పేరురావడానికి ప్రజ్ఞ ఉండనం కారణం...అనుకోవడం, మాటకు అర్థం ఉండాలనేటంత బాధ స్తమాయే అన్నారు శాస్త్రం.

వర్షం కురిసిందిగాబోలు...రోడ్డుతడి కాలం జారేదాకా తెలియలేదు...కాగి నడుస్తున్నాడని

నిర్ణయించారు. కారణా లూహించడంలో కాలం ఏమీ వృథా చెయ్యని బుద్ధిమంతురాలు ఈ లోకం. తలలో తులలో తుఫాను...అని రూఢిగా తడిమో లాంటిది...అరిచింది. తూలి...

ఎదురుగా వచ్చే ఒక పెద్దమనిషిమీద... పడ్డాను.

పెద్దమనిషి ఒక్కటి లాగి చెంపను కొలమాడడానికి బదులుగా...

"అన్నా...ఇంటికి వెడదాం రా!" అన్నాడు వెంకటేశ్వర్లు!!

* * *

వెంకటేశ్వర్లు ఎందుకు నాకు తమ్ముడో అర్థం కాలేదు.

నాకంటే మంచి ఆస్తి, ఆరోగ్యం, అంతకంటే మంచి పలుకుబడీ గలవాడు.

అతడు నన్ను చూస్తే ఇష్టపడడంకంటే ద్వేషించడానికే ఎక్కువ కారణా లున్నాయి.

ఒకసారి అతడు స్నేహితునితో...కలలు నిజమనీ, భగవద్భక్తి అత్యవసరమనీ ఆవేశంతో ఉపన్యసిస్తూ ఉంటే దురదృష్టవశాత్తూ నే నక్కడ తటస్థపడి... నా ఆధునికపరిజ్ఞానంతో అతన్ని తలకిందులు చేశాను.

దేవుడి మహాత్మ్యం పూజారిబుద్ధివిశేషంమీద ఆధారపడి ఉందండీ అని నే ననగానే...నన్ను త్రాచుపామంత క్రూరంగా చూచి చట్టన అక్కడి నుంచి వెళ్ళిపోయాడు వెంకటేశ్వర్లు.

తర్వాత ఎన్నోచోట్ల కలుసుకున్నాం. కాని వెంకటేశ్వర్లు నాతో మాటాడలేదు.

నామాటలు శ్రద్ధగా వినేవాడు.

మాకు తెలియకుండానే నా చురుకుతనంమీద అతనికీ, అతని నిజాయితీమీద నాకూ ఒక చిత్రమైన ఆకర్షణ పుట్టిందేమో చెప్పలేను.

నాటికి నేను తలవనితలంపుగా ఎదుట...వెంకటేశ్వర్లు!

"వికారంగా ఉందా? కాస్తసేపు మాయింటి కద్ద విశ్రమించి వెళ్ళుదువు గాని..."

ఆ ఏకవచనం అతణ్ణి నాకు మరీ సన్నిహితుణ్ణి చేసి మనస్సుకు సుఖంగా తగిలింది.

భుజంమీద చెయ్యివేసి నడిపిస్తున్నాడు.

ఎంత దయగా...జాలిగా...ఇష్టంగా...

వెంకటేశ్వర్లు మనిషి కాడు...దేవుడేమో అనిపించింది.

మళ్ళా ఇతన్ని చూడగానే తగాదా దేవుడు జ్ఞాపకంవచ్చాడా?

ఆ భావనలోనే దుర్బలంగా నవ్వాను.

వెంకటేశ్వర్ల స్పర్శతో ఈ దేవుడుగూడా నాకు సంక్రమించాడా?

అతని ఔదార్యానికి ఏదో గొప్పపేరు పెట్టాలని చప్పున ఏమీ దొరక్క దేవు డన్నాను. అంతే గాని ఆధునికతర్కవిద్యలో ఆరితేరిన నేను చూస్తే దేవుణ్ణి ఎట్లా ఒప్పుకోను?

"చల్లని నీళ్ళతో పాదాలు, ముఖం కడుక్కుంటే బాధ కొంత తగ్గుతుంది."

అన్న వెంకటేశ్వర్ల మాటతో నా ఆలోచన ఆగి...తలయెత్తి చూశాను.

చక్కని మేడ...ముందు పూలతోట. హాల్లో మెత్తని సోఫామీద చతికిలబడ్డాను.

మనస్సు కొంచెం తేరుకుంటోంది.

ఒక్క నిమిషం స్థిమితపడి...వెంకటేశ్వర్లకు నా కృతజ్ఞత వెల్లడించి వెళ్ళిపోవాలె ననుకొని కన్ను మూసుకున్నాను.

రెండునిమిషాలు నిశ్శబ్దం...

పక్కని ఉన్న తివాసుదగ్గర బంగారుగాజుల చప్పుడు విని ఉలికిపడి కళ్ళు తెరిచాను.

ఓ గాజుగ్లాసులో పళ్ళరసం తెచ్చిపెట్టి ఆమె అంది:

"ఈ రసం పుచ్చుకోండి అన్నయ్యగారూ! మేము పరాయివాళ్ళం కాము. మొహమాటపడకండి. ఆయన రోజూ చెబుతూంటారు మిమ్మల్నిగురించి..."

ఆమెముఖంలోంచి ఎవరో ఋషిపత్నులు తొంగి చూస్తున్నారు.

ఆమె వర్షాశుభ్రస్నాత పారిజాత పుష్పంలా ఉంది. తెల్లచీర కట్టుకుని.

నలిగిపోయిన పురుషుల్ని ఓదార్చడానికి, సేద తీర్చడానికి ఎన్ని యుగాలనుంచి భగవంతుడు స్త్రీ హృదయం అనుగ్రహించాడోగదా—

నౌకర్లు లేరా! ఈ శ్రమ ఈమెకు కల్పించారెందుకో వెంకటేశ్వర్లు!

పురుషుడి మిథ్యాపౌరుషం, అహంకారం, తెచ్చిపెట్టుకున్న కరుకుతనం—అన్నీ స్త్రీ సన్నిధానంలో మంచులా కరిగి ద్రవించిపోతాయి గాబోలు.

ఏదో అనబోయినాను గాని మాట పెగిలిరాలేదు. మంత్ర దండం దగ్గర నాగులా తల వంచుకుని పండ్ల రసం తాగాను.

ఆమె వెళ్లిపోయింది.

చెడిన యంత్రాలను బాగుచేసి యంత్రజ్ఞుడు వెళ్లిపోయినట్టుంది.

నాలో చెడిన యంత్రాలు తేరుకుని తిరగడం ప్రారంభించాయి.

లేచి నించున్నాను.

వెంకటేశ్వర్లు వచ్చాడు.

వెళ్ళొస్తున్నానని చెప్పబోతూ కృతజ్ఞతగా చేతులు జోడించాను. వెంకటేశ్వర్లు తప్పు బట్టి కౌగలించుకొని మళ్లా కూర్చోబెట్టాడు.

మేడమీద పరుపు పరచి పక్క సిద్ధం చేశానని నౌకరు చెప్పాడు.

వెంకటేశ్వర్లు వెళ్ళనివ్వలేదు.

* * *

నాతో మేడమీదకు వచ్చి దక్షిణం వైపు ఒక గది చూపి అక్కడ విశ్రమించమని చెప్పి వెడుతూ... ఏమి కావలసినా అడగమని స్నేహమయంగా అని దిగి వెళ్లాడు ఆ నిష్కారణబంధువు.

“ఇప్పుడు. నీ కేం కావాలి?”

అన్న ప్రశ్న కొన్ని శతాబ్దాలనుంచి కొండ శిఖరాలమధ్య లోయలో ప్రతిధ్వనిలాగ నా మనస్సు ఏమూలల్లోనో కంగుమని మారుమోగి చల్ల చల్లగా కరిగిపోయింది.

గదిలోకి వెళ్లాను. విశాలంగా నిగనిగలాడే తెల్లని గోడలతో పరిశుభ్రంగా ఉంది. ఉత్తమ స్నేహితుడి హృదయంలా తెరిచిన పెద్దకిటికీనుంచి చల్లని గాలి వస్తూన్నది.

మధ్యగా ఒక చిన్న బల్లమీద గాజుకూజాలో రెండు సంపంగి పూల గుత్తులూ, గులాబీలూ పరిమళిస్తున్నాయి.

దక్షిణోత్తరంగా ఒక పట్టెమంచం మీద పాలమీగడలాంటి పరుపు, రెండు తెల్లని దిండ్లూ అమర్చి ఉన్నాయి.

మంచానికి దగ్గరగా ఒక బల్లమీద పళ్లెంలో రెండు ద్రాక్ష గుత్తులూ, నారింజలూ, స్వచ్ఛమైన గాజుగిన్నెలో గంగాజలమూ ఉన్నాయి.

ఒకొక్క అవ్యాజకరుణ, నిష్కారణ అనురాగం మనిషిని ద్వేషంకన్న ఎక్కువ చిక్కు పెడతాయేమో అనుకున్నాను.

ఒక ద్రాక్ష తుంచి నోట్లో వేసుకుని...మంచం మీద కూచుని...కిటికీలోనుంచి దూరంగా కనబడే ఉదారంగు ఆకాశం, ఎత్తుగా పెరిగి గాలికి కదిలే ఏవేవో చెట్లూ...ఇంటి కప్పులూ, గుడిగోపురాలూ...చర్చి శిఖరాలూ...శూన్యంగా చూస్తున్నాను.

ఊరంతా అలసి ఎవరి ఒడిలోనో ఒడలుమరచి నిద్రపోతూన్నట్టుంది.

బాహ్యప్రపంచంలో కనబడే విభిన్న నిర్మాణాలూ...విచిత్రదృశ్యాలూ...వేరువేరు రంగులూ...జాతులూ...మతాలూ...ఇంతింతగా మానవుణ్ణి చీలిచి ప్రశ్నిస్తూఉంటే...

లోపలి మనః ప్రపంచంలో...ఎన్నెన్ని ఇంద్రధనుస్సులూ, ఇంద్రజాలాలూ, అగాధపాతాళాలూ, అనంతస్వర్గాలూ కిక్కిరిసి ఈ మహా విశ్వరథాన్ని నడుపుతున్నాయో ఎవరెరుగును!

ఆవలింతలు వస్తున్నాయి.

మెత్తని దిండ్లమీద తల వాల్చి కళ్ళు మూసుకున్నాను. నిద్రమాత్రం రాదు.

కోరినంతసేపు మనిషి! ఏది కలిసివచ్చింది? నిద్ర రావడానికి—

శుష్కహృదయులకు రంభలూ...ఊర్వశులూ, రసమయజీవులకు జీర్ణాలూ...ఉష్ట్రపక్షులూ...

ఛా...ఏమి లోకయాత్ర ఇది!

ఈ ప్రపంచం ఒకప్పుడు సలక్షణంగా నడిచి నడిచి తర్వాత అతివేగంలో ఎక్కడో పట్టుతప్పి తల క్రిందుగా తిరుగుతున్నదేమో అనిపిస్తుంది నాకు.

లేకపోతే—ఇందరు మహాత్ములు, ప్రవక్తలు, కవులు, ఋషులు దీన్ని సరిగ్గా తిప్పడానికి ఇంత ప్రయత్నం చెయ్యడం ఎందుకు?

ఎడారిలో ఇసకతుఫానులా నా తలలో చెల రేగిన కోటి ఆలోచనాగ్నులు...

...తలపోటు మరచిపోడానికి ఇటు అటు తిరగ వేసాను లేచి ఏంతోచక ఊరికే గది నాలుగు మూలలా చూస్తూ కూర్చున్నాను.

హఠాత్తుగా గదిలో ఒక మూల ఏదో ఉన్నట్టు తోచింది.

కుతూహలం కొద్దీ లైటు వేసి చూశాను. కళ్ళు ఆశ్చర్యంలో...నిశ్చేష్టమై పోయాయి. గదిగోడల మీద ఏ ఎన్నైన బొమ్మలూ, చిత్రపటాలూ లేవు గాని—గదికి తూర్పువైపున మూలగా చక్కని నగిషీ పనిచేసిన ఇరుకైన చేవబల్లమీద ఒక లోకాతీత సుందరశిల్పం ఉంది.

స్వచ్ఛమైన చలవరాతితో దక్షిణదేశ శిల్పపద్ధతిలో మలచిన స్వర్గీయసుందర స్త్రీమూర్తి అది. ఒక అభినయముద్రలో ఎత్తిపట్టిన చేతులు...వేళ్ళు పోగగా కర్పూరశలాకలవలె మెరుస్తున్నాయి.

తీర్చిదిద్దిన నున్ననికపోలాలూ, చిబుకమూ, నాసికలమీద పడి దీపకాంతి జారిపోతున్నది.

సుకుమారోన్నతంగా కనపడే వక్షః స్థలం నుంచి బయలుదేరి, నెమ్మదిగా నడుంమీదకు సాగి, నాజూకుగా అక్కడ సన్నగిలి, క్రమంగా జఘన భాగంమీద బలిసి, సౌందర్యసర్వస్వాన్ని అక్కడ సుడులుతిప్పి, ఊరువులమీదుగా పాదాలకు దిగజారిన ఆమె శరీరకాంతిలావణ్యరేఖ దీపశిఖలా వెలిగి వెలిగి నా హృదయాన్ని అంటించింది.

పొరపాటున ఎగసిన నిప్పురవ్వతో కాగితంలా బండి ఒక్కసారిగా భగ్గుమని అంటుకుంది.

జన్మజన్మాంతరాలుగా మనస్సు అట్టడుగున దాగి ఉన్న రంగుల జ్వాలలూ...భయంకర శబ్దాలూ... దుర్నిగ్రహప్రేమంటలూ ఉవ్వెత్తుగా పైకెగసి నన్ను దహించడం ప్రారంభించాయి.

స్త్రీ సౌందర్యం మధురమూ, ఆస్వాదనీయమూ కాక ఇంత దారుణమైన దని అంతవరకూ అనుకోలేదు.

ఒక వాలుజడ, రంగుచీరా కనపడగానే బయలు దేరే చాలా దగ్గులకు, దరహాసాలకు, దానధర్మాలకు, అధిక ప్రసంగాలకు, గొంతుకులో గాలంగుచ్చుకున్న చేపల్లా గిలగిలలాడే చాలా చూపులకూ వెనకాల ఇంతటి క్షోభ జరుగుతూన్నదికాబోలు పాపం!

ఇంతటి సౌందర్యమూర్తి లోకంలో సంభవమా? నిర్దుష్టమైన ఆ అవయవసౌష్ఠవం జీవిత యాత్రలో ఎక్కడా చూచిన జ్ఞాపకం లేదు.

కాళిదాసు ఊర్వశి, భవభూతిమాలతి, అజంతా శిల్పి అమరరేఖాకల్పనా...అన్నీ ఎక్కడో కలిసి ఈ విగ్రహంలోకి ప్రవహించిన వేమో—

పాపం, ఆ శిల్పి తన సౌందర్యకాంక్షకు పర మావధిగా...బ్రతుకంతా ఈ బొమ్మను సృష్టించి పూర్తికాగానే వెళ్లి పోయాడేమో—

వెంకటేశ్వర్లు ఇంతటి సౌందర్యాభిరుచి కలవా డని అంతవరకూ అనుకోలేదు. ఎక్కడ సంపాదిం చాడో ఈ విగ్రహం!

మంచంమీద ఒరిగి ఆలోచిస్తున్నాను. చిన్న తనంనుంచీ ఖండఖండాలుగా తెగి అతుక్కుంటూన్న చిత్రమైన జ్ఞాపకాలతో మనస్సు నిండిపోయింది.

కాలవగట్లు...సంపంగితోట్లూ...కోర్లు మరచి పోయిన ఆడపిల్లల ముఖాలూ, జ్ఞాతాజ్ఞాతంగా అప్పుడు కలిగిన వెర్రికోరికలూ...

ఎందుకో...అవన్నీ ఇప్పుడు......

నిద్రకొస్తున్నది. కోరినప్పుడు రాలేదు.

నా రెండు ఆలోచనల్నీ పేకముక్కల్లా కలిపి వేస్తూ...నిద్ర కనురెప్పలమీద.........

* * *

ఉలికిపడి లేచాను. మెత్తని సుకుమారహస్తం ఏదో నా శరీరాన్ని నిమురుతూన్నది.

ఎంత ఒత్తిగించినా, కనురెప్ప తెగయడం లేదు. కష్టపడి తెరిచాను.

ఒక అప్సరఃసుందరి నా మంచం పక్కని నించునిఉంది.

తల అంటుకున్న మెత్తని జుట్టు పొడిపొడిగా కొంత నుదురుమీదకు చెదరి చెవులను కప్పుతూ, వెనక్కు జడగా సాగింది. అక్కడ బరువుగా పక్కకు ఒరిగే జాజిపూలదండ.

ముఖం...మెడవంపు...చేతులూ......మంచి గంధపు రంగుతో మెరుస్తున్నాయి.

నే నింతకు ముందు చూచిన శిల్పస్త్రీమూర్తి సుకుమారవక్షంలో జల్లున నెత్తురు పొడిచినట్లయింది. అవే పెదవులూ...అదే చిబుకమూ సజీవంగా చిరునవ్వుతో కదులుతున్నాయి.

చట్టున బొమ్మ ఉన్న వైపు చూచాను.

బల్ల ఖాళీగా ఉంది.

నా శరీరం నిలువునా ఝల్లుమంది.

కథల్లోలాగ ఏమి టీ విచిత్ర సంఘటన!

నమ్మలేక రెండుసార్లు కళ్ళు తుడుచుకున్నాను.

ఆమె మరీ 'సెలవివార' నవ్వింది. వరూధిని కాదు గదా—

నాలో కవిత పుడుతున్న చిగాళ్ళు—

ఎంత చచ్చుపురుషుడైనా సుందరస్త్రీ సమీపిస్తే చాలు కవిత్వం తీస్తాడు.

ఇక కళల స్పర్శ గలవాడు హద్దులు తెంచుకుంటాడు.

"నువ్వు వరూధినివా?"

మాట్లాడకుండా మళ్లా విరగబడి నవ్వుతూ మంచంమీద తగులుతూ కూర్చుంది.

"అర్థమయిందా, నీ భావ నవ్వా?"

ఇప్పుడు నవ్వలేదు.

"నీ సంభాషణ మానవా?"

మళ్ళా నవ్వింది.

ఈ లోకంపిల్ల కాదేమో—

రాత్రి వెన్నెలవీథుల్లో దారితప్పి మబ్బు మెట్ల మీద కాలుజారి భూమిమీద పడ్డదా?

ఆమె కొంచెం తలవంచి పై రెప్పలమీద నుంచి కనుబొమ్మలు దూసుకు పోయేలా నావైపు చూచింది.

దాన్ని నా భాషలోకి మార్చుకుంటే—

"ఏమి టీ వృథాకాలక్షేపం...నీకు పిచ్చా!"

అని తర్జుమా అయి నవ్వాను.

ఆమె అది చదివినట్టు కిలకిల నవ్వింది.

వర్షంలో తూర్పుగాలికి జలజలలాడిన పారిజాతం పువ్వులు కురిసినట్టు గదిఅంతా నవ్వులతో పరిమళించింది.

నా శరీరంలో ప్రతిరక్తకణం ఒక కాంతాగ్నితో వెలుగుతున్నట్టయింది.

అప్పుడు తీసిన మధువులా ఆమె నాలో మహోద్రేకాన్ని రగిల్చింది.

ఆమెను ఒత్తుకునేటంత దగ్గరగా జరిగి భుజం మీద చెయ్యివేసి మృదువుగా జడలోని జాజిపూలను మూర్కొన్నాను.

ఆమె బరువుగా ముందుకు ఒరిగింది. చక్కెర బొమ్మ ఒకటి ఆకొన్నవాడి ఎదుట అవతరించినట్టు.

అతడు పెల్లాకొన్న తనాన, తియ్యని పెదవులను, కళ్ళను, ముఖాన్ని యంత్రంలా ఆహారించడం ప్రారంభించాడు.

ఎక్కడో ఒక సుఖప్రళయం. పరిమళ విప్లవం. తీవ్రంగా పట్టినట్టు సూచాయగా వ్యక్తావ్యక్త చైతన్యానికి తెలియవచ్చింది.

* * *

ఉషస్సు వలిగిన తన జరీచీరచెరగులు సవరించుకొని చరచర ఆకాశశయ్య విడిచి వెళ్లిపోయింది

గాలోలు—సూర్యకిరణాలు ఎర్రగా వెచ్చగా గదిలోకి వచ్చాయి.

పరుపుమీద కళ్లు తెరిచాను.

మెత్తని ఆ సుఖశయ్య విడవాలని లేదు.

ఇంకా జాజిపూల వాసనతో పట్టుదిండ్లు పరిమళిస్తున్నట్టే ఉంది.

చటుక్కున జ్ఞాపకంవచ్చింది. బల్లవైపు చూశాను.

ఆ అతిలోకశిల్పసుందరి అట్లాగే అదే అభినయముద్రలో అరమోడ్పుకన్నుగవతో నిలిచి ఉంది.

సృష్టిలో ప్రతి అణువూ ఆనందకరంగా, సౌందర్యభరితంగా కనిపిస్తున్నది.

ఆకాశం స్వచ్ఛంగా తెల్లని మేఘాలతో క్షీరసముద్రంలా ఉంది.

నేను లేచి నించున్నాను.

దయాళువులైన ఏ కులదేవతలో మనస్సులో కొన్ని ఏండ్లకు సరిపోయేటంత మధువు నింపి ఒదిలిపెట్టినంత ఉత్సాహంగా ఉంది.

చరచర పరుగెత్తుకూ వెళ్ళి మిత్రుల నందరినీ బరసగా కౌగలించుకుందామనిపించింది.

నా వాక్కులో రసమయమహాకావ్యం ఒకటి ఉప్పతిల్లడానికి సిద్ధంగా ఉన్నట్టు తోచింది.

శివసముద్ర జలపాతంలా మేడమెట్ల మీద పరిగెత్తాను.

* * *

వెంకటేశ్వర్లు నిత్య మల్లెపూవులా శుభ్రంగా స్నానంచేసి మడతబట్టలు కట్టుకుని ప్రసన్నవదనంతో కూచున్నాడు.

వెంకటేశ్వర్లును గట్టిగా కొత్తబలంతో కౌగలించుకొని 'వెళ్ళొస్తా' నన్నాను.

అతడు చిరునవ్వుతో సాభిప్రాయకుడై—

"అప్పుడే వెళ్ళడమేనా?" అన్నాడు.

"పనిఉంది" నవ్వులో కలిపాను.

"ఈ తిక్తమధుర కదుష్ణపానీయం పుచ్చుకు మరీని" స్నేహం తొణికేలా అన్నాడు.

విచ్చిన తెల్లుపక్క కార్తికమాసపు గోదావరీ కాంతనిర్మల హృదయంలా ఉంది అతని ముఖం.

"తమ్ముడూ, నువ్వు దేవుడివయ్యా"—వణికే గొంతుకతో అన్నాను.

పకపక నవ్వి "దేవు డెవడు?" అన్నాడు వెంకటేశ్వర్లు.

"నువ్వు"

నెమ్మదిగా రోడ్డుమీదకు వచ్చాను.

మళ్ళా ఎప్పుడూ వెంకటేశ్వర్లు నాకు కనబడలేదు.



# సాహిత్యము-ప్రచారప్రబోధములు

— శ్రీ పిల్లలమఱ్ఱి వెంకటహనుమంతరావు —

మానవుడు సకలసృష్టిలోను విలక్షణవ్యక్తి. ఇతర జీవులకన్న విశిష్టగుణాలు కలిగినటువంటివాడు. సృష్టిక్రమంలోని ఉత్తమస్థానాన్ని ఆక్రమిస్తున్నాడు. ఆ ఉత్తమస్థానాన్ని నిలుపుకోడానికీ, విశిష్టతను నిలబెట్టుకోడానికీ మానవుడు నిరంతరం ప్రయత్నిస్తూ ఉండాలి. ఇది మానవునకున్న ప్రత్యేకాంశంద్వారా ఒనగూడుతుంది.

మానవునికి ఆత్మభావవ్యక్తీకరణానికి వాక్కు ఉన్నది. ఈ వాక్కే అతణ్ణి ఉత్తమునిగా తీర్చిదిద్దగలగడంలో చక్కని సాధనమై ఉపకరించేది. సమస్త మానవలోకాన్నీ వాగ్వ్యవహారం పాలిస్తున్నది. అసలు మానవుని ప్రకృతిని పరీక్షించడానికి అతని వాగ్వ్యవహారమే మంచి సాధనమౌతుంది. మానవునిలో ఉన్న మంచినిగాని, చెడునుగాని విడమర్చి కన్పడజేసే శక్తి ఆ వాగ్వ్యవహారంలో ఉన్నది. మానవులలో భేదాభిప్రాయాలు కలగడానికి కారణాల్ని ఆరా తీస్తే మనకన్నిటా ఒకే సూత్రం లభిస్తుంది. ఒకరన్న మాట మరొకణ్ణి సుఖపెడ్తుంది. మరొక మాట బాధపెట్టుతుంది. దీన్నిబట్టి వాక్కుకున్న ప్రాధాన్యం అవగతమౌతుంది. ఆ వాక్కుకు వెనకాలఉండే అభిప్రాయం, లేక మనసు కలుషరహితమైంది అయితే ఆ వాక్కు గౌరవాన్ని పొందుతుంది. అది తమఃపాలితమైతే బాధాకరమై గౌరవదూరమవుతుంది. కాబట్టి వాఙ్మనసులు ప్రముఖమైనవిగా పరిగణింపదగినవి. అభిప్రాయమును వ్యక్తీకరించేది వాక్కు. కాగా తదభిప్రాయ సూచన చేసేది కార్యము. దీన్నే కర్మ అన్నారు. మనోవాక్కర్మలను శుద్ధిగా ఉంచుకోడానికి మానవుడు సాధనచేస్తూ ఉంటాడు. అలా చేయని మానవుడు ఉత్తమజన్మయాత్ర వృథా అవుతుంది. అందుచేత తన అభిప్రాయంలో, తన వాక్కులో, తన కర్మలో ఉన్న కల్మషాన్ని క్షాళనం చేసుకోవడం ప్రతిమానవునికీ విధి అన్నమాట. దాన్ని విధిగా భావించకపోయినవానికి మానవత్వం క్రమంగా నశించడం తథ్యం.

ఏ జాతి కా జాతి సహజంగా తన పార్థక్యాన్ని నిలుపుకుంటుంది. మానవజాతి ప్రధానతః తనకున్న మానవత్వమనే గుణాన్ని నిలుపుకో ప్రయత్నించడం అసందర్భం కాదు. మానవజాతినంతటినీ ఉద్ధరించడమే ప్రధాన కర్తవ్యంగా పెట్టుకున్న కవి ప్రవక్తలు ఉత్తమ పురుషులు. కారణజన్ములు. వీళ్లే మానవలోకానికి సత్యమైన నాయకమణులు. రాజకీయ నాయకులలో ఉత్తమాంశ ఉన్నవాళ్లలో స్వార్థకాంక్ష-అహంకారము-హెచ్చుగా ఉండి వారి నాయకత్వాన్ని శంకింపజేస్తున్నది. తమోగుణాన్ని, రజోగుణాన్ని అతిక్రమింపగల శక్తి వారి పవిత్రవాక్కులు ప్రసాదింపగలుగుతవి. కవి ప్రవక్త లిరువురూ అర్థకామాలకన్నా ధర్మమోక్షాలయందు మానవులకు రక్తి కలిగించేందుకు పాటుబడుతారు. మానవజాతి సముద్ధృతం కావాలంటే మహాకవిప్రవక్తలను (Poet & Frophet) నాయకులుగా స్వీకరించాలి. ధర్మాన్ని ఆచరించడానికి బుద్ధిమత్త కల్గినవాడు-మోక్షాన్ని సాధించడానికి అనుకూలజన్మ పొందినవాడు మానవుడు. మానవుడేకాక పశుపక్ష్యాదులన్నీ అర్థకామాల్లో తగుల్కొన్నవే. ధర్మచింతకు ఆ జన్మలలో అవకాశంలేదు; మోక్షసాధనకున్నా అధికారం లేదు. ఆ విధమైన అవకాశమూ, అధికారమూ మానవజన్మలో అనుగృహీతమైనవి. అహంకారాన్నీ, అసత్యవాదాన్నీ, దౌర్జన్యాన్నీ, కపటాన్నీ — ఇంకా ఇలాంటి రాక్షసప్రకృతుల్ని అనేకం ప్రకోపింపజేసేవి రాజకీయాలు. అందులో మార్గదర్శకుడు ఎంతటి పవిత్రుడైనా, ఎంత ధర్మాచరణాసక్తి కలవాడైనా రాజకీయనాయకుడయ్యేటప్పటికి కలుషీభూతు

డాతాడు. లౌకికచింత హెచ్చుతుంది. లోకవ్యవహారము కృత్రిమమూ, అధార్మికమూ కాకతప్పదు. అందుచేత రాజకీయనాయకుడు మానవజాతి నంతటినీ ఉద్ధరించలేడు. అతని శక్తి పరిమితము. పైగా దృష్టి లౌకిక వ్యవహారప్రసక్తము.

నిరహంకారంగా, నిష్కపటంగా, సౌజన్యంతో, సచ్చింతతో, మానవవ్యక్తిని తమస్సులోనుంచి జ్యోతిర్లోకానికి తీసికొనివెళ్లాలనే ఉత్తమాదాశయముతో కవి ప్రవక్తలు కృషి చేస్తారు. వారికి లౌకికమంతా నిమిత్తమాత్రము; పరతత్త్వసాధనము లక్ష్యము. ఈ విధంగా తాత్కాలికమైన, లౌకికమైన బాధల్ని తొలగించేటందుకు పాటుపడే పురుషుణ్ణి నాయకునిగా మానవలోకం గ్రహించి ప్రయోజనం లేదు. కామచింత, అర్థచింత, హెచ్చుచేసే నాయకుడు మానవోద్ధరణాన్ని కాని, మానవకల్యాణాన్ని కాని చేకూర్చలేడు. అర్థకామాలయందు కాంక్ష నతిక్రమింపగల ధర్మకాంక్ష ప్రేరేపించి, పోషించిన పురుషుడే ఉత్తమనాయకుడు. ఏవంవిధగుణోపేతులైన కవి ప్రవక్తలు ఆదర్శనాయకులౌతారు. ఈ సిద్ధాంతంలో ఉన్న సత్యాన్ని మానవలోకం గుర్తించాలి.

ఇక, కవిప్రవక్త లిద్దరిలోను ప్రవక్తకన్నా కవి శ్లాఘ్యుడు. మానవుణ్ణి దూరంగా—భయగౌరవావరణంలో ఉంచి, తన ప్రవచనాలతో సూటిగా, నిశితంగా ప్రబోధించేవాడు ప్రవక్త. మానవుల హృదయంలో తన హృదయం ఉంచి, ఎంతో సన్నిహితంగా వర్తిస్తూ ఉత్తమధర్మాన్ని వ్యంగ్యంగా, మెత్తగా బోధించేవాడు కవి. బోధనావిధానంలో నిశితకరవాలధారాభిఘాత సదృశమైన వాక్కుకన్న నవనీతసదృశవాక్కు కెక్కువ ప్రయోజనం ఉన్నట్లు గమనిస్తాం. మెత్తగా చెప్పి కఠినహృదయునైనా కరగింపవచ్చుగాని, కోమల మనస్సునైనా పరుషవాక్కుచేత వశం చేసుకోలేము. ఈ సూత్రంప్రకారం ప్రవక్తకన్న కవి మానవులకు సన్నిహితుడౌతున్నాడు. ఈ విధంగా కవి మానవులకు ఉత్తమనాయకుడౌతున్నాడు. ఆ నాయకత్వం ఆమోదించి సాధన చేసిననాడు మానవలోకం కల్యాణధామమై అలరారుతుంది.

ఉత్తమకవిరచన విశిష్టమైంది. అతడు మానవలోకాన్ని నిశితంగా పరిశీలిస్తాడు. అందులోని మాయావరణాన్ని దాటి దూరంగానిలుచుని, ధర్మాధర్మాల్ని, సుఖదుఃఖాల్ని, జననమరణాల్ని బాగా అవలోకనచేస్తాడు. సాధికారమైన దృష్టికలిగి లలితలాలితవాక్చమత్కారంతో మానవునిలోని మాలిన్యాన్ని క్షాళన చేయబూనుతాడు. లోకకల్యాణమే అతని పరమాశయం. కావ్యావతారం తత్సాధన విశేషం.

కావ్యాంబుధి ఇముడ్చుకున్న కథావాహినుల సత్త్వాన్ని గ్రహించడం, భావరత్నాలను ఏరుకొని భద్రపరుచుకోవడం మానవుల కొక్కుమ్మడిగా అలవడేవి కావు. అవి బహుసాధనాఫలితాలు. ప్రవక్తప్రవచనాలు నారికేళసదృశములై కఠినములు. కవివాక్కులు కదళీఫలసదృశములై లలితములు. ఇలా అన్నంతమాత్రంచేత కవివాక్కు లర్థము చేసికొనడానికి అధికారం అక్కరలేదనుకోవడం పొరపాటే అవుతుంది.

కాబట్టి మానవులు కావ్యాస్వాదనానికి అధికారం సంపాదించాలని తేలుతున్నది. దీనికి మానవులు ముందు విద్యావంతులు కావాలి. సదసద్వివేచనం అలవరచుకోవాలి. ఆలోచనాశక్తిని పెంపొందించుకోవాలి. తమ హృదయవీణాతంత్రులకు కాలవశాన పట్టిన తుప్పును తుడిచివేసుకోవాలి. ఏ పిల్లగాలిపోకినా ఆ పిల్లనగ్రోవి అందులోని నాదస్వరూపాన్ని అందించాలి. ఏ చిన్నరేఖఅయినా ఆ నవనీతంపైన సుస్పష్టంగా చిహ్నితంకావాలి. ఇందుకు మానవులు సాధన చేయడం అవసరమే అవుతుంది.

కవిని మానవలోకానికి ఆదర్శనాయకునిగా స్వీకరించినపుడు అతణ్ణి అనుసరించడానికి యోగ్యతను కూడా వారు సంపాదించాలిగదా!

లోకంలో ఉన్న నాయకులలో కొందరు తమ అనుచరు లెంత అజ్ఞానవంతులైతే అంత నయమనుకుంటూఉంటారు. అనుచరుల్లో అహంకారం ఉండకూడదు; అహంకారమూ, అవినయమూ ఉంటే ఆ నాయకత్వం వ్యర్థమౌతుంది. మానవలోకానికి ఉత్తమనాయకుడుగా మనం ఇప్పు డెన్నుకున్న కవి అలాంటి

అమాయకుల్ని ఏవిధంగా తరింపజేస్తాడు? అమాయకుల్ని కొల్లగొట్టడం, మోసంచేయడం కవిలక్షణం కాదు. వాళ్లకు ఆకర్షణకలిగించి, వాళ్ల చేత అధికారం సంపాదింపజేసి అతడు తాను సృజించిన సాహిత్యం ద్వారా అభ్యుదయం చేకూరుస్తాడు. ఇది మహత్తరకార్యం!

సాహిత్యం రసవత్ఫలం. అది ఆలోచనామృతాన్ని అందిస్తుంది. ఆలోచించి నిర్ణీత అమృతత్వం పొందినటువంటి, శాశ్వతరూపం దాల్చినటువంటి భావాలూ, సన్నివేశాలూ గోచరమౌతై. హృదయానికి గాఢంగా హత్తుకొని ఆజన్మాంతమూ మరపునకు లోనుగాక నిలిచే చిత్రణం సాహిత్యమౌతుంది.

ఒక తాత్కాలిక సూత్రాన్ని ప్రచారంచేసే నిమిత్తం, ప్రబోధించేనిమిత్తం వాడుకోవడానికి అనువైందిగా సాహిత్య మీనాడు సంభావింపబడుతున్నది. అమృతసందేశాన్ని అందించి మానవులలోని మాలిన్యాన్ని క్షాళనచేసి ఉత్తమసాధనోన్ముఖుల్ని చేసే ప్రయోజనంగల సాహిత్యం ఈనాడిలా సంభావితం కావడం శోచనీయమే. సార్వకాలిక, సార్వజనీనమై నిలిచే సాహిత్యపదానికి సంకుచితార్థం సంఘటించడం అపచారమే అవుతుంది. నిజమాలోచిస్తే అలా తాత్కాలిక ప్రయోజనాన్ని ప్రచారంచేసేనిమిత్తం వ్రాసిన రచన అంతా సాహిత్యంక్రిందికి రాదు. మానవజాతికంతకూ చెందిన పరమసూత్రాలేవైతే ఉన్నవో (The Fundamental Principles of Humanity) వాటికి చెందినంతవరకూ, వాటిని ఉల్లంఘించనంతమటుకూ, అది సాహిత్యతత్వానికి వ్యతిరేకం కాజాలదు. ఆవిధంగాచేసిన రచన సార్వజనీనంగాను, సార్వకాలీనంగాను ఉండగలుగుతుంది. అంతేకాని తాత్కాలికరాజకీయ తత్వాలను ప్రచారం చేసే రచనలంతటినీ సాహిత్యమనడం పొరపాటు. ఇలాంటి పొరపాటే ఈనాడు జరుగుతున్నది. వాళ్లంతా సాహిత్యపదం ఉపయోగించడం మానేసి వాఙ్మయపదం వాడుకుంటే తమ్ము తాము మోసగించుకోవడమున్నూ, ఇతరుల్ని భ్రాంతిలో పడేటట్లు చేయడమున్నూ తప్పుతుంది!

ఏవిధమైనా ప్రచారం చేసేనిమిత్తం కొంత రచనచేయడం అవసరమే అవుతుంది. వ్యాపారవస్తువులను ప్రచారంచేసే నిమిత్తం కల్పించిన రచనఅంతా సాహిత్యమౌతుందా? ఇలాంటిది 'Loose Literature' క్రింద పరిగణింపబడుతోంది ఆంగ్లంలో. దీనికి వ్యతిరేకంగా, 'Pure Literature' అని ఉన్నది. ఇదే సార్వజనీన సార్వకాలీనంగా నిలిచే యోగ్యత కలిగినటువంటిది. Universal Appeal అనే గుణం ఉన్నదంటే, అదే అర్థం! "సాహిత్యం" అంటే Pure Literature అనే అభిప్రాయంలోనే సంభావితం కావాలని అనుకొంటాం.

అయితే ఈ అర్థంలో ఉన్న రచన అంతా సామాన్యులకర్థంకాకడం లేదనే మిషతో ఈనాడు కొందరు దాన్ని పరిహరించడం కర్తవ్యంగా భావిస్తున్నారు. 'ప్రచారవాఙ్మయమే' సాహిత్యమని భ్రమపడుతున్న వాళ్లు ప్రచారంద్వారా మానవలోకాన్ని ఉద్ధరించవచ్చుననుకుంటే పొరపాటే అవుతుంది. ప్రచారంవల్లా, ప్రబోధాలవల్లా ప్రజానీకాన్ని మానవుల్నిగా తీర్చి దిద్దలేము. మానవత్వాన్ని ప్రకాశింపజేయాలంటే ప్రజకంతా విద్యాగరపడం ప్రథమకర్తవ్యంగా భావించాలి. మానవజాతి అంతా విద్య నేర్చినవారైతే ఉత్తమమార్గగాముల్ని చేయడానికి ప్రచారప్రబోధాలు సాధనాలుగా స్వీకరించవలసిన అవసరం లేదుగదా! పైగా ఆనాడు మానవులు వివేచనతో కవిహృదయప్రకాశం చేసి అతడందించిన భావాలను స్వయంగా గ్రహించినవారౌతారు.

ఇంతవరకు సాహిత్యం శాశ్వతమైనదాన్నందించి రక్షించే దనీ, మానవలోకం శుభంకరంగా, మంగళప్రదంగా, కళ్యాణధామంగా విరాజిల్లాలంటే సాహిత్యావలోకనమే శరణ్యం అవుతుందనీ, ఇందుకు ఉత్తమకవే ఉపదేష్ట-నాయకుడు కావాలనీ గ్రహించాము.

కాగా సాహిత్యాన్ని ప్రబోధించవలసిన, ప్రచారం చేయవలసిన అవసరం ఈనాడు బాగా కన్పిస్తున్నదని మనవిచేస్తున్నాను. సాహిత్యమనే పేర "ప్రచారవాఙ్మయం" సంప్రదాయవిరుద్ధమైన రచన అంతా ప్రాచుర్యం వహిస్తుంటే ఆ భ్రమను తొలగించడం ఎంతేని అవసరం. అసలు "సాహిత్యం" అనేది ఏదో తెలియ

చెప్పవలసిన సమయం కూడా వచ్చింది. అందుకోసం సాహిత్యాన్ని ప్రచారం చేయాలి. సాహిత్యంలోని సౌందర్యాన్ని, శిల్పాన్ని, చిత్రణాన్ని గమనించే సహృదయలోకాన్ని తయారుచేయాలి. కవిహృదయప్రవేశం ఎలా నిష్పాక్షికంగా చేయాలో బోధించాలి. సాహిత్యఫలాన్ని ఆస్వాదించే కుతూహలాన్ని పెంపొందించి ప్రోత్సహించాలి. అందుకోసం ప్రచారప్రబోధాలవసరం అంటున్నాను. బాహిరమైనటువంటి, సంప్రదాయమార్గమైనటువంటి చిత్రవిచిత్రవిషయాల్ని ప్రచారం చేసేనిమిత్తం "సాహిత్య"పదం వాడుకోవడం తప్పిదమే. ఒక వర్గానికి చెందినటువంటి రచన మానవజాతి కంతటికీ అభ్యుదయకారక మెలా అవుతుంది? వర్గవైమనస్యాలను రేకెత్తించే దవుతుందిగాని!

అందుకని మానవాభ్యుదయ హేతువైన "సాహిత్యా"న్ని ఆశ్రయించడం, అందలి చమత్కారాన్ని గ్రహించి ఆనందించగల హృదయపాకమార్గాన్నలవరచుకోవడం, అందులో వ్యంగ్యరూపాన ప్రతిపాదితాలైన ధర్మసందేశాలను గ్రహించి, ఆచరించి, అనుసరించడానికి వలసిన దార్ఢ్యాన్ని సంపాదించుకోవడం నేటి ప్రతిమానవునికీ బాధ్యత అని హెచ్చరిస్తే నన్ను మన్నిస్తారు.

ఈవిధమైన చైతన్యం మానవుల్లో కలగడానికి సాహిత్యాచార్యులు పూనుకుంటారని ఆశిస్తాను. నేటి మానవులస్థితి చాల హైన్యముగా ఉన్నది. అధర్మ మెంతగా పెచ్చుపెరిగిపోవడానికి అవకాశమున్నదో అంతగా పెరిగిపోయింది. మానవత్వం నశించిపోయి నామమాత్రావశిష్టులుగా ఉన్నారు మానవులు. ధర్మరతి ముముక్షుత్వములు లేనేలేవు. అర్థకామములే ప్రధానములు. ఇటీవల ఒక ధార్మికకవి అన్నాడు-"మోసమే పురుషార్థముగ నెన్నె కొక్కొ; వేసమే విజ్ఞానవిన్యాస మయ్యె" అని. నేటి స్థితి చూడండెలా ఉన్నదో:

"కత్తులు కాకచే కంపంబులెత్త
రక్తదాహంబుచే అంపెల్లు జగము
పుత్రులకంఠాలు పూలదండలుగ
ధరియింపవలసె నీ ధాత్రీమతల్లి.

జాతివిద్వేషాలు జ్వలియించి చెలగ
కన్నుడు తొత్తులై కలిసేరు జనులు
అంతులేని ధనాశ నంధులై ప్రజలు
పీలిచి రక్తంబు పిప్పిచేసేరు
పరవంచనోపాయ పారీణులగుచు
బుద్ధిమంతులు సూత్రము లన్వయింత్రు."

ఈ మహాక్షోభలో సాహిత్యాశ్రయించి మానవత్వాన్ని నిలువుగాండని ముక్తకంఠంతో ఘోష పెట్టుతున్నాను. మహాకవుల నాయకత్వాన శాంతిసౌధము లందు విహరింతముగావుత!



# మహానటుని మయూరనృత్యము*

— శ్రీ చిలుకూరి నారాయణరావు —

ఈ సదామహాశ్మశాన
వాసి కాశికావిభుండు
విశ్వనాథు డిపు డిదేమొ
యీ చిదంబరప్రచండ
కాలమేఘరాశి జూచి
యానందం బంతకంత
కతిశయింపగా మయూర
నృత్యముతో మొదలించి
నందికేశ నాట్యరీతి
దుంతినాథ లాస్యఫణితి
మించి తాండవించె నేడి-
దేమొ; -రండు, గణనాథులు!
రండు యక్ష, రాక్షస, గం
ధర్వ, గరుడ, కిన్నర, కిం
పురుషులు, మరి భూతపతులు
ప్రేతములు, పిశాచంబులు
రండీ, సంహారనాట్య
సుందరతర హస్త, పాద,
శిరో, నయన, భంగిమాద్య
తాభినయము జూడ రండు.
కాళ్లకు గజ్జలు
కటిపై పులితోల్
హస్త, కంఠ, భుజ,
మస్తక ఫూత్కృ
త్సర్పభూషణుడు
మహానటుడు
నృత్యమాడు
నాట్యమాడు
లాస్య మాడు
తాండవించు
నోంకారశ్రుతితో నా
నారాయణ రాయరచిత
గీతమునకు నా సహృదయ
సభ్యు లెల్ల తాళగతుల
జతులతోడ మనోవీథి
తామగూడ తాండవింప
ఇదిగో నృత్యము
భారతభూమీ
వాయవ్యదశా
ప్రచలితఝంఝా
మారుతప్రేరితంబై
భారభారాలసంబై
క్రూరదృక్క్షోభితంబై
తధిగిణ తళంగ్
తళంగ్ ! తళంగ్ ! తళంగ్ !
ధిమిధిమిధిమిట
ధిమిధి మ్మనుచును
పురాణపురుషుని
నవీననృత్యము
ఝణ ఝణ
నిరంతర
మహాద్భుత
నృత్య మిదిగో
సృష్టి స్థితి-లయ-

---

* కాశిలో ఇటీవల జరిగిన అఖిలభారత రచయితల మహాసభలో ఆశువుగా చదివినది ఈ గేయము.

సృష్టి-స్థితి-లయ
మహాచక్ర విభ్రమ ప్ర
చార సారభూత మిదిగో
నాట్యములో నవరసములు
హావంబులు, భావంబులు
రీతులు, పాకంబులు, ధ్వని
మూర్ఛనలును విలసిల్లగ
లాస్యవిధుల్, రమ్యాంగో
పాంగోర్మి ప్రగతు లివిగో
మీది కెగిరి, క్రిందికి దిగి
ప్రక్క కొదిగి,
కటీకటీవిచలనములు
భ్రూవిభ్రమ, నేత్రాంచల
భావావిర్భావకరణ
రీతి
నుద్ధత-మతి-
త్వాంతంబుల గతి
నిదిగో-ఇదిగో
ప్రచండతాండవ
మిదిగో !
పాకీస్తాన్ - ద్రవిడస్తాన్ -
కొట్టిస్తాన్, చంపిస్తాన్
ఖణేల్ ! ఖణేల్ !
ధమా ! ధామ్ !

* * *

ఈ మహాశ్మశానవీథి
నేమొ యీ భయానకంబు
రౌద్ర మేమొ యీ శవముల
తాండవబీభత్స మేమొ !
మహానటా !
జటాఘటిత
గంగాంభఃక్షుబ్ధోద్ధత
కల్లోలము సణపవయ్యా !
చాలునయ్యా, చాలు, లయము
తాండవము ముగింపవయ్యా !
ఈ యకాలతాండవంబు
లాస్య నాట్య నృత్య వీథి
మందగింపనీయవయ్యా !
పునస్సృష్టి కా బ్రహ్మకు
నింక నాజ్ఞ నియ్యవయ్యా
ఎన్నాళ్లీ సంరంభము, మహాప్రభో !
ఎన్నాళ్లీ ఘోరవిష
జ్వాలవహ్ని - ఓ శంభో !
శంకరుడవు, భక్తజన వ-
శంకరుడవు, రిపుజన భ-
యంకరుడవు కావయ్యా !

* * *

అంబా ! ఓ అన్నపూర్ణ
భిక్షువునకు క్షుధాబాధ
హెచ్చయినది - రావమ్మా !
హాలాహలము మ్రింగి
అలసియున్నా డితడు
తాండవముచే మిగుల డస్సియున్నా డితడు
అమ్మా ! అన్నపూర్ణా ! పిలువు మమ్మా !
అమృతభోజన మారగింపగ
బెట్టుమమ్మా ! మమ్ము పంక్తిని
గూర్చుండగ నీయవమ్మా
అమ్మా ! అన్నపూర్ణా !




# విద్యున్నయనం

మనము కంటితో చూచుచున్నాము; చెవితో వినుచున్నాము. మనము చెవితో వినలేని ధ్వనులు, కంటితో చూడలేని వెలుతురుకిరణములు గలవు. శబ్దము, వెలుతురు, విద్యుత్తు ఇవి నిత్యమయిన శక్తి (Energy) వివిధరూపములుమాత్రమే. ఇవన్నియు తరంగరూపములో వ్యాపించుచున్నవి. పదార్థముయొక్క అణువులు, పరమాణువులు స్పందన నొందినప్పుడు శబ్దము, వెలుతురు, విద్యుత్తు ఉత్పన్నమగుచున్న వని నేటి శాస్త్రజ్ఞుల అభిప్రాయము.

ఎక్కువ తరంగపరిమాణము (wave-length) గలవైన అరుణోత్తరకిరణములు (Infra-red rays), కురుచ తరంగపరిమాణము గలవైన అతినీలలోహితకిరణములు (Ultra violet rays) వెలుతురుకిరణములే యయినను నయనాతీతములు. వీటిని చూచి గ్రహింపగలవి కిరణవిద్యుద్ఘటములు (Photo-electric cells), లేక విద్యున్నయనములు (Electric eyes). నయన మేవిధముగా వెలుతురు గ్రహించి మెదడుకు విద్యుత్స్పందనలద్వారా తెలియజేయుచున్నదో అవిధముగానే కిరణవిద్యుద్ఘటము దానిపై బడిన వెలుతురును విద్యుత్తుగా గ్రహించుచున్నది.

కొన్ని పదార్థములు-ముఖ్యముగా వెండిలవణములు (Silver Salts) వాటిపై వెలుతురు బడినప్పుడు రసాయనవికారము పొందును. ఇట్టి కిరణ-రసాయనవికారము (Photo-chemical Changes)లపైనాధారపడినదే ఛాయాపటగ్రహణవిద్య (Photography). కొన్ని పదార్థములు రసాయనవికారము లొందునట్లే, కొన్ని పదార్థములపై వెలుతురు పడినప్పుడు అవి విద్యుద్వికారములు(Photo-electricalChanges) పొందును. అట్టి కిరణవిద్యుచ్చైతన్యము గల పదార్థములు పొటాషియం, సోమము(selenium), శ్యామము (Caesium) మున్నగు మూలధాతువులు.

కిరణవిద్యుద్ఘటములు చూడను రేడియోవాల్వుల వలె నుండును. బల్బునందు శ్యామము ఋణధ్రువము (Cathode)గా నుండును. దీనిపై వెలుతురు పడినప్పుడు అది విద్యుచ్ఛక్తిగా మారి ప్రవహించుచున్నది. వెలుతురు దీనిపై బడుట ఆగిపోగానే విద్యుత్ప్రవాహముకూడ ఆగిపోవును. విద్యుత్ప్రవాహపుబలము వెలుతురును బట్టి మారుచుండును.

సినీమాకు పోవు ప్రతివారు ఈ కిరణవిద్యుద్ఘటము వలని ప్రయోజన మనుభవించెదరు. ఫిల్మునందు ధ్వనియొక్క 'ఫోటోగ్రాఫు'ను కిరణవిద్యుద్ఘటము మరల ధ్వనిగా మార్చుచున్నది. వెలుతురు విద్యుచ్ఛక్తిగాను, విద్యుచ్ఛక్తి ధ్వనిగాను మార్చబడుచున్నది. యుద్ధములో నిది నిప్పంటించు బాంబులను కనుగొనుటకు వాడబడెను. కాలే బాంబుయొక్క వెలుతురు విద్యున్నయనముపైబడిన తక్షణమే విద్యుత్ప్రవాహము హెచ్చరిక గంట కొట్టును.

విద్యున్నయనము పారిశ్రామికముగా పెక్కు ఉపయోగములు కలిగియున్నది. వీటిలో ఒక కిరణ

పుంజము (Light beam) విద్యుత్కంపనములలో సమర్పబడిన విద్యున్నయనముపై కేంద్రీకరింపబడియుండును. ఒక నీడగాని, వస్తువుగాని కిరణపుంజపు దారిలో అడ్డు తగిలినవెంటనే అనుకొనియున్న మరొక విద్యుత్కంపనములనుండి విద్యుత్తు ప్రవహింప మొదలిడును. అనగా విద్యున్నయన మిచట విద్యుద్దీపము వెలిగించుటకు, ఆర్పుటకు ఉపయోగింపబడు మీట (Switch) వలె ఉపయోగించుచున్నది. వస్తువులను లెక్క వేయుట, అగ్నిగుండముల (Furnaces) కు సరఫరాయగు వాయువు నడపు (Control) లో ఉంచుట, వస్తువుల పరిమాణము (Size) కొల్చుట, పెద్దపెద్ద యంత్రములు పనిచేయునపుడు కార్మికులకు అపాయము కలుగకుండ హెచ్చరించుట—మొదలయినవి విద్యున్నయనపు కొన్ని కార్యములు. ఉక్కు కర్మాగారములో ఎఱ్ఱని వేడి లోహపుముక్కలు నేలపైకి దొర్లింపబడుచుండును. ఒక చిన్న ముక్క దారితప్పి పడినను అపాయకరము. దారి కిరుప్రక్కల వెలుగుకిరణములు విద్యున్నయనములపై బడుచుండినపుడు అట్టి అపాయము కలుగకముందే కార్మికులకు హెచ్చరిక కలిగింపబడును.

ఇదే సూత్రముతో పనిచేయు స్వయంచాలక (Automatic) సాధనము లెన్నో కలవు. దొంగలనుండి హెచ్చరిక విద్యున్నయన మివ్వగలదు. ఇనుప పెట్టెచుట్టు కిరణములు కిరణవిద్యుద్ఘటములపై బడుచుండును. దొంగ ఈ కిరణముల కడ్డుతగులగనే బహుశః ఒక మైలుదూరములో నున్న పోలీసుస్టేషనులో హెచ్చరిక గంట మ్రోగును. కిరణములు కనపడినయెడల తెలివైన దొంగ వాటి దారినుండి తొలగవచ్చును. కాబట్టి అదృశ్య కిరణములు వాడబడును. విద్యున్నయనములు అతినీల లోహిత, లేక అవిశోణకిరణములనుగూడ విద్యుచ్ఛక్తిగా మార్చగలవు. ఒక లండను ప్రదర్శనమందు కొన్ని విలలేని రత్నములు చూచుటకు రక్షణ లేక యుంచబడి యుండెను. కాని వాటిని తాకుటకు ఎవరైన చేయి చాచిన వెంటనే ఒక గంట గట్టిగా మ్రోగి, దొంగ ఎక్కడికిని తప్పించుకొనిపోకుండ తలుపులు వెంటనే అవంతట అవే మూసికొని తాళము పడుచుండెనట! దాని రహస్యము మణులవద్ద నుండు కిరణవిద్యుద్ఘటములపై బడుచుండిన అదృశ్యకిరణపుంజములు అడ్డగింపబడుటయే. మోటారుకారు గారేజీవద్దకు రాగానే గారేజీ తలుపులు అవంతట అవే తెరచుకొని లోన దీపములు వెలుగగలవు.

లోహపరిశ్రమలలో కిరణ విద్యుద్ఘటములు ఉష్ణోగ్రతను కొల్చుటకు పనికివచ్చును. వేడిలోహము నుండి అవిశోణకిరణములు (ఉష్ణకిరణములు) బయట వచ్చుచుండును. వాటి తీక్ష్ణతను విద్యున్నయనము కొల్చి ఉష్ణోగ్రతను నిర్ణయింపగలదు.

విద్యున్నయనము వెలుతురును కనిపెట్టుట చాల ఆశ్చర్యకరముగా నుండును. ఒక అమెరికా ప్రదర్శనములో కోట్లకొలది మైళ్ల దూరములో నున్న స్వాతీనక్షత్రపు వెలుతురు విద్యున్నయనముపై పడునట్లు చేసి, ఆశక్తిని ఆవరణ మంతయు వెలిగించుటకు ఉపయోగించిరట.

మన కన్ను వెన్నెలలోను, నక్షత్రముల వెలుగులోను వస్తువులను పగటిలోవలె చూడలేదు. రాత్రి వెలుతురు లేకుండ కాదు మనము చూడలేనిది. కన్ను ఎన్నో శతాబ్దములుగా చీకటిలో చూచే శక్తి కోల్పోయినది. గుడ్లగూబలు, పిల్లులు, ఎలుకలు మొదలయిన జంతువులు చీకటిలో చూడగలవు. విద్యున్నయనము చీకటిలో చూచుటకు తోడ్పడుచున్నది.

విద్యున్నయన మెన్నో క్రొత్తక్రొత్త పారిశ్రామిక ప్రయోజనములకు ఉపయోగింపబడవచ్చును. చీకటిలో చూడగలుగుట, ఉష్ణోగ్రత లతిసులభముగా నిర్ణయింపగలుగుట, యంత్రములు అవంతట అవే పనిచేయగలుగుట ఈనాడు శాస్త్రజ్ఞుల దృష్టిలో అతిసామాన్య విషయములు. ఈనాటి సినిమాలు త్వరలోనే అన్ని ప్రకృతిరంగులను, అంతేగాక వాసనలనుగూడ నిచ్చునవిగా అభివృద్ధి కావచ్చును. దూరదర్శినులతో ఎన్నో క్రొత్త విషయములు తెలియగలవు. విజ్ఞాన మభివృద్ధి యగుకొలది మానవుడు క్రొత్తక్రొత్త విషయములను నిత్యజీవితములో ప్రవేశపెట్టుకొనగలడు. కొన్ని శతాబ్దముల తర్వాత మన సంతతికి మనము అనాగరికులుగా తోచగలము.

"రాము"

# ఎదురుగాలి

[కథానిక]

'చతుర్వేది'

పిల్లకి సుశీల అని పేరు పెట్టినప్పుడు తల్లిదండ్రుల గుండెల్లో ఎటువంటి పవిత్రమైన కోరికలు ధగ ధగ మెరిసినవో ఎవరు చెప్పగలరు! తమ చిన్నకూతురు శీలవతియై, గుణవతియై సీతతోనూ, సావిత్రితోనూ తుల తూగాలని ఎంత ఆశపడ్డారో ఎవరికి తెలుసు?

ఇప్పుడుమాత్రం ఆపేరు చెవినిపడితే చాలు వారి గుండెలు భగ్గున రగులుతాయి. సుశీల అనే పేరే వారికి ఎంతో వెటకారంగా కనిపిస్తుంది. ఎవరైనా ఆపేరు ఉచ్చరిస్తే చాలు తల్లిదండ్రులు లోపల ఉడికి పోతారు. తమ వంశగౌరవానికే చిచ్చుపెట్టిన నీచు రాలిని సుశీల అని పిలవటంకంటె విడ్డూర మేముం టుంది? ఇప్పటి స్థితిలో తమ కూతురిని సుశీల అనటం కంటె వెటకారం మరొకటి వుండబోదని తల్లిదండ్రుల అభిప్రాయం.

కన్న తల్లిదండ్రులకే ఇంత కోపమైపోయిన సుశీల లోకానికి ఇంకెంత చులకనైపోయిందో వేరే చెప్పనక్కరలేదు. ఈనాడు సుశీలశీలాన్ని, నడతనీ చీల్చి చెండాడటానికి మూలనున్న ముసలమ్మకు కూడా వీరావేశం వస్తుంది. ఈనాడు సుశీ జీవితంమీద అం దరి విమర్శలూ, దూషణలూ వల్లేరుమీద బండిలా చరచరా సాగిపోతాయి. సుశీలను ఎంత తిట్టినా ఇంకా తగినన్ని తిట్ట లేదని విచారించేవారేకాని వెనకేసుకొచ్చి నొచ్చుకొ నేవా రొక్కరూ లేరు. అంతదాకా వస్తే సుశీలే తనను తాను వెనకేసుకొస్తుందా అనేది అనుమానాస్పదమైన విషయమే.

అందుకే సుశీల నా అనేవారెవరూ లేని చోటికి వెళ్లి జీవయాత్ర కొనసాగిస్తోంది. అకస్మికంగా పూర్వపరిచితు లెవరైనా కనిపించినా తలవంచుకుని దూరంనుంచే వైదొలగిపోతుంది. తనకు లోకంలో ఎటు వంటి విలువ వుందో, ఎంత గౌరవం వుందో సుశీల ఇది వరకే గ్రహించింది. కనకనే లోకంతో ముఖాముఖి ఎన్నడూ తలపడదు. తనకు నలుగురిలోకి నిర్భయంగా వచ్చి నిలబడటానికి ఏదో చెప్పలేని జంకు. ఎక్కడికి వెళ్లినా తన చరిత్ర నల్లటి నీడలాగా తనవెంటనే తరు ముకువస్తున్నదనీ అనుమానం. తన సంగతే అందరూ గుసగుసలాడుకుంటున్నట్లు సంకోచం. ఎంత దూరదేశం లో వున్నా శత్రుశిబిరపరంపరమధ్య అసహాయురాలై నిలబడి నట్లే సుశీలకు అనిపిస్తోంది. అందుకే తను ఎవరిళ్లకీ పోదు. ఒకరు తన ఇంటికి రావాలని కోరుకోదు. తన పిల్లలనుకూడా గడపదాటనివ్వదు. ఎటువంటి మాటలు వాళ్ల చెవిని పడతాయో, వాళ్ల లేతమనసులు ఏం బాధ పడతాయో అని సుశీల పిల్లల్ని క్షణమైనా బైటికిపోని వ్వదికాదు. గాలీ వెలుతురూ లేని చీకటి చెరలో క్షణం కూడా హాయిలేకుండా సుశీలమనస్సు అపసోపాలుపడు తోంది. తను ఒకళ్ల జోలికి పోదు. తను ఉలిపికట్టె. అయినా లోకం తనదారిని తనను పోనివ్వదు. పొరుగిం టావిడ గోడతలనుంచి తనకు వినబడేట్లు మాటిమాటికీ ఎత్తిపొడుస్తూ ఉంటుంది—"మనంరాణివాసపుస్త్రీలమూ యేమిటి? ఇరుగుపొరుగిళ్లకి పోకపోతే మన కెల్లా గడు స్తుంది?" అని.

ఒకరోజు పొరుగింటికి బియ్యం బదులుతెచ్చు కోటంకోసం సుశీల వెళ్లకతప్పిందికాదు. తీరిక గా చుట్టుపక్కల అమ్మలక్కలంతా కొలువుతీర్చి కూర్చు న్నారు. లోకాభిరామాయణంలో మునిగి తేలు తు

న్నారు. సుశీలను చూపులతో తూట్లుపడేటట్లు గుచ్చారు. సుశీలకు అంతమందిలో తల ఎత్తటానికి చచ్చినచావుగా వుంది. వెనక్కి తిరిగి వెళ్లిపోదామనుకుంటుండగా పొరుగింటి పుల్లమ్మగారు "కూర్చోఅమ్మా, ఏమైనా పనిమీద వచ్చావా? ఇన్నాళ్లకు మామీద దయ కలిగిందికాబోలు. పెద్దవాన్ని చేసే ముందుగా వద్దామనుకున్నామగాని పిలవని పేరంటానికి పనికెళ్లాపోవటం లేనికని ఊరుకున్నాము" అంటూ అనర్గళంగా ఏమిటేమిటో మాట్లాడేస్తోంది. సుశీలకు తలమీద దబదబా రాళ్ల వాన కురుస్తున్నట్లనిపించింది. ఎల్లాగో పెను ల్పుకని వచ్చిన పని ఏమిటో చెప్పింది. బియ్యం నిండుకున్నయ్యని చెప్పింది పొరుగింటావిడ. సుశీల ఇంటిదారి పట్టాలనుకుంటుండగానే పొరుగింటావిడ చెయ్యిపట్టుకుని బలవంతాన కూచోబెట్టి ప్రశ్నలవర్షం కురిపించటం ఆరంభించింది—"నీపేరేమిటి? పుట్టింటివారి దేవూరు? అత్తవారి దేవూరు? మీవారి కొంపని? ఎందరుపిల్లలు?" అని గుచ్చిగుచ్చి అడగటం మొదలుపెట్టింది. సుశీల కొన్నిటికి జవాబులుచెప్పి, కొన్నిటికి చెప్పలేక తడబడిపోతూ బెదురుచూపులు చూసింది. ఈ పద్మవ్యూహంలోంచి ఎల్లా బైటపడతానా అనే ఆరాటం సుశీలకు. ఈదొరికిన అభాగ్యురాలిని ఇంకా ఎన్ని విధాలుగా పీల్చివెండాడుదామా అనే వెలగాటం అమ్మలక్కలకు. సుశీలకు వినపడకుండా గుసగుసలూ, ఒకరి ముఖంకేసి ఒకరు చూసుకుంటూ మునిమునినవ్వులూ, వెటకారపుచూపులూ! అక్కడున్న పదినిమిషాలూ పది యుగాలుగా తోచినై. కణకణ మండే నిప్పులగుండంలో నిలబడినట్లనిపించింది. చివాలున లేచి నిలబడి, వెళ్లొస్తానని బయలుదేరింది. "అప్పుడే వెళ్తావుటమ్మా! చూసినట్టే లేదు, మాట్లాడినట్టే లేదు. కాస్త ఇరుగుపొరుగున వున్నందుకు అప్పుడప్పుడూ వచ్చి తొంగిచూసిపోతూ వుండు తల్లీ" అంది పొరుగావిడ. అప్రయత్నంగా సుశీలకాళ్లు వణికినై. కళ్లు తడిసినై. "చచ్చిన పామును చంపటం ఎందుకు తండ్రీ!" అని దీనంగా ఒక ఆక్రోశం విడిచింది.

ఇంట్లో అడుగుపెట్టేసరికి పిల్లలు అన్నంపెట్టమని చుట్టేశారు. ఇంట్లో బియ్యపుగింజలేదు. చేతిలో చిల్లిగవ్వలేదు. తన ఒంటిమీద బంగారమంతా ఇదివరకేహరించిపోయింది. మెళ్లో సూత్రంకూడా భర్త జబర్దస్తీచేసి తీసుకొన్నాడు. పైగా "నీక్కూడా సూత్రంకావాలా"అని వెటకారంచేశాడు. సుశీలమాత్రం ఎదురుచెప్పకుండా తన మాంగళ్యాన్ని నిలబెట్టుకోటానికి పసుపు కొమ్ముకటి కట్టుకుంది. కాని "నీక్కూడా సూత్రం కావాలా"అని సుందరం అడిగిన ప్రశ్నకు ఆమె గిలగిల తన్నుకుంది. అతని దృష్టిలో తను ఇంత చులకనై పోతానని ఆమె కలలోకూడా అనుకోలేదు. అతనుకూడా తనను ఇంత నీచంగా పరిగణిస్తాడని సుశీల ఎన్నడూ తలపోయలేదు. పిల్లలు ఆకలికి కళ్లలో ప్రాణాలుపెట్టుకుని ఉసూరుమంటున్నారు. తన అన్నంముఖం చూసి మూడుపూటలు దాటింది. మంగళసూత్రం పుచ్చుకుని పోయి మూడురోజులైనా ఇంతవరకూ భర్తజాడ లేదు. ఎక్కడా అప్పుపుట్టదు. ఎక్కడా బదులుకొరకదు. దొరక్కపోగా తన మనసును చిత్రవధచేసే మాటలూ,నిందలూ ప్రతివాళ్లూ తమ అసూయతూణీరంలోంచి ఆమెమీదకు విసురుతారు. ఇదివర ఎప్పుడూ పల్లెత్తు మాటఅని ఎరగని సుందరం ఇంత హేళనంగా, ఇంత చులకనగా మాటాడటానికి వెనుదీయలేదు. ఎటుచూసినా అవమానం, పరాభవం. ఎక్కడికిపోయినా వీడని దారిద్ర్యం. కోరలు తెరుచుకున్న క్రూరరాక్షసి ఎవరో తనను క్షణం కూడా విడవకుండా వెన్నంటి తరుముకువస్తోంది. లోకమంతా పడగ విప్పిన పాములాగా బుసలు కొడుతోంది. తనూ,తన పిల్లలూ అసహాయులైఆర్తులై దీనంగా శత్రువుల చేతిక్కిన ఖైదీలలాగా క్షణమొక యుగంగా పరితప్తులై పోతున్నారు. ఈ యమయాతననుంచి విముక్తిలేదా?

ఇల్లా ఆలోచిస్తూ గోడకు జేర్లబడి కూచుంది సుశీల. ఆకలిమంటతోపాటు అరనిమంట ఏదో లోపల భగభగ రగిలిపోతోంది. "ఇదంతా నాకు విధి విధించిన శిక్ష కాకూడదా? ఇదంతా నా తప్పిదానికి ప్రాయశ్చిత్తం కాకూడదా?"అనిపించింది ఒక్కక్షణంసేపు. వెంటనే సుశీల ఈదౌర్బల్యానికి సిగ్గుపడింది. ప్రవాహానికి ఎదురీదలేక అలసిపోయి తనను తాను నిందించుకుంటోంది. ఇదివరకు ఎవరైనా అటువంటి మాటలు తనను అంటే మండిపోయేది. ఇప్పుడు తనను తానే అంతకంటే

బియ్యంగొట్లు నిర్దయతో నిండించుకుంటోంది. ఎంత సిగ్గుచేటుపని! కదనరంగంలో పోరబడినతరువాత పడి మధ్యలో ఖడ్గం జారవిడిస్తే ఎల్లాగు? ఇన్ని కష్టాలను ఎదిరించాలని తనకు ముందుగా తెలియదా? ఎదుర్కొనగల శక్తి లేనప్పుడు తనూ అందరిలాగే విధికి దాసిసరైపోయి తలవంచక ఎందుకు ఎదురుతిరగాలి? ఒక్కసారిగా సుశీలలో అణగారిపోతున్న ధైర్యం తటుక్కున పెరిగింది. నేను చేసిన తప్పు ఏముంది? దాన్ని తప్పుగా పరిగణించి శిక్షించగల అధికారం ఎవరికుంది? నేను ఎవరికీ లొంగను. దీనికి జంకను అనే విప్లవోత్సాహంతో సుశీల కంపించిపోతోంది.

ఇంతలో తలుపుకొట్టిన చప్పుడు. ఎంతో ఆత్రంతో గబగబా వెళ్ళి తలుపు తీసింది. ఇంట్లోకి వస్తూనే తూలుతూ సోలుతూ, నోటికివచ్చిన దల్లా పేలుతూ భర్త సుందరం అడుగుపెట్టాడు. సుశీల ఆపాదమస్తకం గజగజ వణికిపోయింది. తనకూ పిల్లలకూ తినేటందుకు ఏమైనా తెస్తాడేమోనని కొండంత ఆశతో ఎదురు చూస్తోంది. ఒక్కసారిగా పాతాళంలోకి తొక్కివేసి నట్లయిపోయింది. తనూ, పిల్లలూ ఆకలిచిచ్చుతో కుమిలి కృశించిపోతుంటే భర్త తప్పతాగి తందనాలాడుతూ ఇంటికివచ్చాడు. రాగిదమ్మిడీ సంపాదించలేడు. పైగా తన వంటిమీద చిన్నం బంగారంకూడా లేకుండా వొలుచుకుని తీసేశాడు. నకనకలాడుతూ చిక్కి శల్యాలైపోయిన పిల్లలు కళ్ళకు కొట్టవస్తున్నారు. వాళ్ళు తన ప్రాణానికి ఉసూరుమంటున్నారు. వాళ్ళను బతికించుకోవలసిన భారం తనమీద వుంది. తను ఏం చేయగలదు? ఏవిధంగా జీవయాత్ర కొనసాగించగలదు? పోనీ, తనకు వచ్చిన సంగీతం నలుగురుపిల్లలకు పాఠాలుచెప్పుకుని బతుకుదామా అంటే అది వీలులేకుండావుంది. తన యింటికి పాఠానికి పిల్లల్ని పంపటానికి తల్లిదండ్రులెవరూ సాహసించరు. పోనీ, తను మానాభిమానాలను నీళ్ళు వదిలి ఇంటింటికీ తిరిగి పాఠాలు చెప్పుకుందామంటే ఎక్కడికిపోయినా చుక్కెదురే. తన పూర్వచరిత్రనూ, ప్రస్తుతజీవితాన్నీ శల్యపరీక్షచేసి తనను చిత్రవధచేసి చివరకు జీతం దమ్మిడీ ముట్టచెప్పకుండా పంపించేసిన పుణ్యాత్ములెందరో వున్నారు. ఇక తను ఏం చెయ్యాలి? ఏం చెయ్యగలదు? ముగ్గురు నిరపరాధులను, నిర్భాగ్యులను ఈ లోకంలోకి తీసుకువచ్చినందుకు, మక్కువప్పగా రని పసికందుల్నిలాగే వాటిని పడరానిపాట్లకు గురిచేస్తున్నందుకు తను బాధ్యురాలు కాదా? తన బాధ్యతను ఏవిధంగా నెరవేర్చాలి? సుందరంకూడా బాధ్యుడు కాదా? అయినా కాని ఒకను ఏ బాధ్యతనూ గ్రహించగల స్థితిలో లేడు. లోకానికి కొత్తదనానికి దాసిన అవుతున్నాడు. నానాటికీ దిగజారిపోతున్నాడు.

చిన్నప్పుడు సుందరం సుగుణాలకు గని అని అంతా అనుకునేవాళ్ళు. సుందరంకంఠంలో తుంబురునిలోనూ, నారదుడిలోనూ పోటీచేసే హాయి వుందని అంతా ఒప్పుకునేవాళ్ళు. ఇప్పటి సుందరానికీ, అప్పటి సుందరానికీ పోలికే లేదు. తాగిన మైకంలో "ఎంత వేడుకుందూ... రాఘవా" అని కృతి అందుకుని మొదటిచరణంలో ఆగిపోయాడు. ఇదివిని సుశీల జలదరించింది. అదుపులేకుండా వెక్కివెక్కి ఏడుస్తూ సుందరంపాదాలను చుట్టవేసింది. మాటలలో ఇముడని వేదనతో తల్లడిల్లిపోతూ భర్తతన్నులనూ, దెబ్బలనూ నోరు మెదపకుండా భరిస్తూ ఎల్లాగో తెల్లవార్చింది.

సుందరానికి తెలివివచ్చేసరికి బాగా ఎండెక్కింది. పిల్లలు ఆకలికి గీపురుగాపుకుంటున్నారు. సుశీల బియ్యంకోసం ఎక్కడికనిగాని వెళ్ళలేదు. ఉత్తచేతులతో తిరిగివచ్చి కుప్పగా కూలబడిపోయింది.

"నాన్నా, ఆకలి" అని పిల్లలు చుట్టుకునేసరికి సుందరానికి పట్టరాని దుఃఖం వచ్చింది. ఏడుస్తూ తల గోడకేసి బాదుకున్నాడు. సుశీలముఖం చూడలేక సిగ్గుపడిపోతున్నాడు. మబ్బుతెరలమధ్య కాసేపు నీరెండ కాసినట్లు సుందరంగుండెల్లో బాధ్యత అనే భారం, దాన్ని నెరవేర్చాలనే భావం తొంగిచూసినై. చెమ్మగిల్లుతున్న కళ్ళతో, తడబడుతున్న మాటలతో అన్నాడు: "వెళ్ళిపోదాం పద. ఇక్కడ నిమిషంకూడా వుండొద్దు"

"ఎక్కడికి? ఎక్కడికి వెళ్ళినా ఇంతే" అని సుశీల కళ్ళు తుడుచుకుంది. సుందరం బదులుచెప్పకుండా పిల్లల్ని ఒళ్ళోకి తీసుకుని నిమురుతూ మౌనంగా కూచున్నాడు.

—

౨

ఊరుమారింది. అదృష్టంకూడా మారినట్లనిపించింది. సుందరానికి సంగీతం పాఠాలు దొరికాయి. సుశీలను చేపట్టిన కాలంలో ఎంత బుద్ధిమంతుడుగా వుండేవాడో అంత కుదురుగా వుండటం మొదలుపెట్టాడు. నలుగురిలోనూ గౌరవంగా బతకటం సుశీలకు ఇదే మొదటిసారి. మిగిలిన కాలం జీవితంలో ఈమాదిరిగా గడిచిపోతే చాలు. ఇంతకంటే గొంతెమ్మకోరికలు సుశీలకు లేవు. సుందరానికీ లేవు. ఇదివరకు ఎన్నో ఊళ్లు మారారుకాని ఎక్కడా ఇంత హాయిగా, ఇంత స్వేచ్ఛగా, ఇంత నిర్విచారంగా కాలం గడిచిపోలేదు. ఇక్కడ సుశీలకుకూడా చేతినిండా పని. పెళ్లిళ్లుకాని పిల్లలూ, కాపురానికి వెళ్లని పిల్లలూ గుంపులుగుంపులుగా వచ్చి సుశీలదగ్గర సంగీతం నేర్చుకుపోతున్నారు. తనూ, పిల్లలూ, భర్తా కొరతలేకుండా సాఫీగా జీవితాన్ని గడపటం ఇదే మొదలు.

ఇంతకాలమూ సుశీల ప్రవాహానికి ఎదురీది వేసారిపోయింది. ఇప్పుడు కాలుతన్ని నిలవబడటానికి లోకంలో కొంచెం జాగా దొరికింది. సుశీల తనచుట్టూ కలియపారజూచింది. తను ఎల్లకాలమూ లోకంతో పోరాడుతూ బతకవలసిందేనా? తనకుమాత్రం శాంతి అవసరం లేదా? సుఖం అక్కరలేదా? కావాలి. తనకుకూడా సమాజంలో గౌరవం కావాలి. ఆదరణ కావాలి. మన్ననకావాలి.

ఇంతకాలమూ సుశీల సమాజాన్ని నిరసించింది. సమాజం చేసిన శాసనాలను ధిక్కరించింది. అటువంటి సుశీల ఒక్కసారిగా సమాజంలో గౌరవాన్ని పొందాలని సంకల్పించింది. సుందరం తనను ఎంతదూరంగా దులిపివేసినా అతన్నే అంటిపెట్టుకుని వుండాలి. అతను ఎన్ని బాధలకు గురిచేసినా వాటన్నిటినీ సహించి, క్షమించి అతని అడుగుజాడల్లోనే నడిచిపోవాలి. ఆదర్శమైన భార్య చెయ్యవలసిన విధులన్నీ తూచా తప్పకుండా నిర్వర్తించాలి. అణకువతో, ఓర్పుతో, సౌజన్యంతో సుశీల సమాజాన్ని మెప్పించి తమ దాంపత్యాన్ని గుర్తించేట్లు చెయ్యాలని నిశ్చయించుకుంది.

ఇంటింటా సుశీలాసుందరాల దాంపత్యం ఆదర్శప్రాయమైనదనే అభిప్రాయం వ్యాపిస్తోంది. అనురాగంలో, అనువర్తనలో, అందచందాలలో సుశీలాసుందరాల జంటకు దీటైన జంట ఆ ఊళ్లో లేదని ఇంటింటా అనుకోటం సుశీలకుకూడా వినవచ్చింది.

ఇప్పుడు సుశీలకు జీవితంలో ఇదివరకు లేని ధీమా వచ్చింది. మును పెన్నడూ చవిచూసి ఎరగని ఆనందంతో ఆమె అంతరంగం గంతులు వేయసాగింది. తన గతచరిత్రను లోకుల కళ్లు చీల్చిచూడలేని దట్టమైన ముసుగులచాటున దాచివేసింది. తనకు ఏవిధమైన సంకోచమూ లేదు. భీతి లేదు. అశాంతి లేదు. సంఘ గౌరవంలో ఇంత భద్రమైన సుఖం, శాంతీ దొరకగలవని సుశీల ఊహించనైనా లేదు.

అప్పుడప్పుడూ తనకు తెలియకుండానే సుశీల గుండెలు భయంతో గజగజ వణికేవి. తను ఒక అగ్నిపర్వతంమీద నిలబడింది. అయినప్పటికీ కైలాసశిఖరంమీద విహరిస్తున్నంత ఆనందంతో పొంగిపోతోంది. తన కాళ్లకింద అగ్నిపర్వతం ఏక్షణమైనా బద్దలైపోవచ్చు. అప్పుడు సమాజంలో తన గౌరవం గాలిమేడలాగా ఉప్పున కూలిపోవచ్చు. అవమానమనే భస్మరాశులలో తను నామరూపాలు లేకుండా మాయమైపోవచ్చు. సుశీల పైకి ఎంతనిబ్బరంగా, ఎంత హాయిగా కనిపించినా లోపల హృదయంమాత్రం ఏకోశానో గూడుకట్టుకుని దాగివుంది.

ఇలా వుండగా ఒకనాటి ఉదయాన నిగనిగలాడే రాగిచెంబుతో, కొట్టవచ్చే విభూతిరేకలతో, చినుగుకొల్లాయిగుడ్డలతో ఉపాదానంకోసం "శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః" అంటూ ఒక బీదబ్రాహ్మణుడు సుశీలకళ్లఎదుట సాక్షాత్కరించాడు. అతన్ని చూడగానే సుశీల పెద్దపులిని చూసిన లేడిలాగా బెదిరిపోయింది. ఆయనకూడా సుశీలకేసి రెప్పవాల్చకుండా నఖశిఖపర్యంతమూ శల్యపరీక్ష చేస్తూ నిలబడిపోయాడు. సుశీల చరచరా లోపలికి వెళ్లి దోసెడు బియ్యం పట్టుకువచ్చి ఉపాదానం పెట్టింది. లోపలికి వెళ్లిపోబోతుంటే ఆ బ్రాహ్మణవృద్ధుడు "ఇదుగో, అమ్మాయ్, వృద్ధాప్యంవల్ల చూపు సరిగా ఆనటం లేదు. మనిషిని పోలిన మనిషి వుండొచ్చు.

నేను పొరబడవద్దు" అంటూ దీర్ఘమైన ఉపోద్ఘాతంతో "నువ్వు ఫలానావారి కూతురివి కాదూ? ఫలానావారి కోడలివి కావూ? మీ అత్తవారిది ఫలానాగ్రామం కాదూ?" అని నక్కతిప్పలతో లేని ప్రశ్నలవర్షం కురిపించాడు.

సుశీల తలవంచేసుకుని అన్నిటికీ తలవూపింది. నోరు పెగలలేకపోయింది. అరికాళ్లలోంచి గజగజ వణుకు పుట్టుకొస్తోంది ఆ ముసలాయనను తాను వెంటనే గుర్తించింది. ఇంకా అనుమానమెందుకు? ఈయన పేసుల వెంకయ్య. తన పుట్టింటివారి ఊరే ఈయనది. రాగిచెంబు చేతపుచ్చుకుని ఈయన తిరగని రాజ్యం లేదు. సంపాదించిన ఉపాదానపు బియ్యంతోపాటు అక్కడి కబుర్లిక్కడికీ, ఇక్కడి సంగతు లక్కడికీ సునాయాసంగా చేరవేసి చిలవలు పలవల్లి ప్రచారం చెయ్యటంలో అందెవేసిన చెయ్యి. ఈయన్ని చూసీ చూడటంతోటే సుశీలకు తన గతజీవితంలోంచి ఒక పెనుభూతం లేచివచ్చి ఈ ముసలిబ్రాహ్మడిరూపంలో తనను వెన్నంటబోతున్నట్లనిపించింది. గతాన్ని కప్పివేసి తను ఈమధ్య మునిగితేలుతున్న సుఖానికి స్వస్తివాచకం చెప్పటానికే ఈ బ్రాహ్మణోత్తముడు అక్కడికి వేంచేసినట్లనిపించింది. తన గతచరిత్ర తనమీద కసితీర్చుకోవటంకోసమే ఈ బీదబ్రాహ్మణవేషంతో కత్తికట్టుకు వచ్చినట్లనిపించింది. ఉపాదానంతో చెంబు నింపుకుని పేసులవెంకయ్య వెళ్లిపోయి చాలాసేపయింది. కాని సుశీలమనసులో ఆయనరూపం భయంకరంగా నాటుకుపోయింది. లోపలలోపల చెదిరిపోతోంది.

అనుకున్నంతా జరిగింది. అగ్గిపుల్లలాటి ముసలి బాపడు సుశీలసుఖానికి చిచ్చుపెట్టి మరీ వెళ్లాడు. ఇంత భయంకరమైన అగ్నిపర్వతంమీద నిలబడ్డట్లు సుశీల గ్రహించలేకపోయింది. సమాజంలో తను సంపాదించిన మన్నన, గౌరవం, ఆదరం అన్నీ నీటిబుడగల్లాగా పుటుక్కుమన్నాయ్. ఏగూలదిన్నా పడగవిప్పిన తాచులాగా లోలోన బుసబుసలే. ఏగూల చూసినా మీదికి దుముకేందుకు సిద్ధంగా వున్న భీకరరాక్షసిలాగా నాలుక చాపి కోరలు బైటపెట్టి ఉరిమిచూసే లోకమే కనిపిస్తోంది. తను అగ్నిసాక్షిగా పెళ్లాడిన భర్తని- సమాజం యావజ్జీవమూ ఇతని పాదాల దగ్గిరే పడివుండు అని బంధించిన కురూపిని-క్షయరోగిని విడిచివేసింది. తనకు సంగీతం నేర్పుతున్న అందగాడు సుందరంతో మనసుకలిపింది. అతనితో కలిసి ఎవరికీ చెప్పకుండా ఎవరికీ తెలియని అర్ధరాత్రివేళ పుట్టిన ఇంటికీ మెట్టిన ఇంటికీ దూరంగా తరలిపోయింది. ఇది ఇరవైయేళ్లకిందటి మాట. అప్పటికి సుశీల పదహారేళ్లపడుచు.

నిమిషంలో ఊరంతా పాక్కిపోయింది. అందరి నోళ్లలోనూ సుశీల నలిగిపోయింది. అందరూ ఆమెను 'లేచిపోయివచ్చిన మనిషి' అని చీదరించుకున్నారు. అందరి కళ్లకూ సుశీల కులటగా కనిపించింది. అంతకు మించినగౌరవం ఇవ్వటం అందరికీ అనవసరమనిపించింది. సుశీలాసుందరాల బతుకు క్షణంలో నడిబజార్లో నవ్వులపాలైపోయింది. వాళ్లజీవితం పొద్దుపోనివాళ్లందరికీ ఆటవస్తువైపోయింది.

మర్నాటినుంచీ వీళ్ల ఇంటికి రాకపోకలు బందయిపోయినై. సంగీతంపాఠాలన్నీ ఒక్కసారిగా చెయ్యిజారిపోయినై. ఊళ్లో పిలిస్తే పలికే దిక్కే కరువయింది.

క్రమక్రమంగా మునుపటి దారిద్ర్యమే మళ్లీ నగ్నంగా తాండవించటం ఆరంభించింది. ఆకలిచిచ్చుకు తాళలేక పిల్లల ఏడుపులూ, ఇంట్లోంచి లేచిపొమ్మని ఇంటివాళ్ల ఒత్తిడీ, పూటలతరబడి అన్నంముఖం చూడకుండా పస్తులూ! ఈ దారిద్ర్యమంతా చాలనట్లు సుశీలకు నిండు నెలలు... ఎటు చూసినా దరీ తెన్నూ కనబడటంలేదు.

సరిగా ఇదేసమయానికి సుందరం మళ్లీ మామూలు దారినే తొక్కి జూదగాళ్లతోనూ, తాగుబోతులతోనూ తిరగటం మొదలుపెట్టి రోజులతరబడి ఇంటిచాయలకు రావటమే మానేశాడు. వచ్చినప్పుడు- తెలివిగా వున్న సమయంలో ఇంట్లో బాధలను చూసి జడివానలాగా కన్నీరు కురిపిస్తాడు. ఇదుగో ఏదైనా బతుకుతెరువు దొరుకుతుందేమో వెతుక్కువస్తానని లేచి బయలుదేరి అదేపోత పోతాడు. మళ్లీ రెండుమూడురోజులదాకా జాడా జవాబూ వుండదు.

ఇక సంసారాన్ని ఈదటం మెల్లాగా అనే దిగులుతో సుశీల కుంగి కృశించిపోతోంది. ఈ ఆపదలో ఆదుకుని ఆదరించే ఆప్తు లెవరున్నారు? కళ్లుపొడుచుకున్నా దారి కనబడని చీకటిలో కొట్టుమిట్టాడుతూ కుమిలిపోతోంది. దినమొక యుగంగా గడుస్తోంది.

3

రేపుపొద్దున ఇల్లు ఖాళీచేసి వెళ్లిపోతానని సుశీల మాట ఇచ్చింది. వెళ్లకపోతే రౌడీలను తీసుకువచ్చి బైటికి గెంటిస్తానని ఇంటియజమాని అల్టిమేటమ్ ఇచ్చి మరీ వెళ్లాడు. తెల్లవారేలోపుగా సుందరం ఇంటికి వస్తాడేమో నని ఎంతో ఆశపడింది. అప్పటికి మనిషి కంటికి కనబడి రెండురోజు లయింది.

సుందరం రాకపోతే తనేం చెయ్యాలి? నడి బజారులో చెట్టుకింద దిక్కులేని పక్షిలాగా అల్లాడిపోవాలి. చింపిరిగుడ్డలతో, చిక్కిపోయిన ఆకారాలతో తనూ పిల్లలూ దరిద్రదేవతల్లాగా ఆకలికి అల్లాడుతూ ఎక్కడో తల దాచుకోవాలి. తనను దయతలచి పట్టెడన్నం పెట్టేవాళ్లుకూడా లేని ఆ ఊళ్లో ఎల్లా కాలం వెళ్లదీయాలి! ఈ ఊరు విడిచి ఇంకెక్కడికైనా వెళ్లిపోతే? ఏం లాభం? ఎన్ని ఊళ్లు మారినా అదృష్టంమాత్రంమారదు. తను ఈజీవితంలో కష్టాలకోసమే జన్మించినట్లున్నది. సుఖం ఎండమావిలాగా దూరంగా పారిపోతోంది. దుఃఖం, దారిద్ర్యం, దైన్యం ఇవే తనను వీడని చెలికత్తెలు. కన్నీళ్లే తనకు పిలిస్తే పలికే బంధువు... తలంచుకున్న కొద్దీ సుశీల తట్టుకోలేక తల్లడిల్లిపోతోంది. "ఇంక క్షణంకూడా నేను కాలంతన్ని నిలబడలేను. ఇంక రెప్పపాటుకూడా లోకానికి ఎదురీదగల సత్తువ లేదు. ఇక్కడితో నాజీవితాన్ని సమాప్తిచెయ్యి" అని విధిని వేడుకోసాగింది. ఈదీనమైన ఆక్రందనతో సుశీల కన్నీరు కట్టతెగిన ప్రవాహంలాగా ఆగకుండా పొంగి వచ్చింది. దీనంగా నానాటికీ దిగజారిపోతున్న పిల్లలకేసి చూసేసరికి కడుపు తరుక్కుపోయింది. గుండె భగ్గున రగిలిపోయింది. ఇంత విశాలమైన ప్రపంచంలో తనను కనికరించేవా రొక్కరూ లేరా? ఈ కష్టదశలో తనను ఆదుకునే జాలిగుండె ఒక్కటీ లేదా? తనకు బలగం తక్కువా? తల్లిదండ్రులున్నారు. అన్నదమ్ము లున్నారు. చెల్లెళ్లున్నారు. అంతా వున్నారు. కాని తనకు ఎవరూ లేరు. తను ఎవరికీ లేదు. ఈ లోకంలో ఒంటరిది. సుందరంకోసమే అందరినీ వదిలి వచ్చేసింది. అతనికోసమే ఇన్ని సుడిగాలులనూ, ఇన్ని తుపానులనూ ఒంటరిగా ఎదుర్కొంటున్నది. ఇప్పుడుమాత్రం ఇక నిలబడలేక కూకటివేళ్లతో కూడా పెళ్లగిల్లి కూలబడిపోయేట్లుంది. విధితో అలుపులేని పోరాటంలో బతుకంతా గడపగల శక్తి ఎవరి కుంటుంది? ఈ బాధలో, ఈ దుఃఖంలో సుశీలలో దాగిన పిరికితనం తలఎత్తింది. పిల్లల్ని తీసుకుని పుట్టింటికి పోతే? వారి కాళ్లమీద పడి క్షమించమని కోరితే? వారు జాలి తలచి, తననూ తన పిల్లల్ని దగ్గరికి తీసి ఆదరించరా? ఛీ... అల్లా ఎన్నటికీ జరగదు. నేను చేసిన తప్పేముంది? క్షమించమని వేడుకునేటంత అపరాధం నేనేం చేశాను? నేనూ నాపిల్లలూ ఆకలికి అల్లాడి ఏ చెట్టుకిందనైనా ప్రాణాలు విడుస్తాం. అంతే కాని సుందరాన్ని విడిచి, ఈస్థితిలో పుట్టింటికి పోవటంకంటె క్రూరమైన, ఘోరమైన పని మరొకటి వుండబోదు. తను జీవితానికి లొంగిపోదు. పరిస్థితులతో రాజీ చేసుకోదు. తను పోరాటానికే పుట్టింది. కదనరంగంలోనే నేలకూలి కళ్లు మూసుకుంటుంది. కాని, తనతోపాటు ఏ పాపమూ ఎరగని పసికూనలను అగచాట్లపాలు చెయ్యటానికే వచ్చిన బాధగా వుంది తను కష్టాలుపడుతున్నందుకు చింతలేదు. తనతోపాటు ఈ నిర్భాగ్యులుకూడా అల్లాడిపోతున్నందుకే సుశీల తల్లడిల్లిపోతోంది.

పగలంతా సుశీలగుండెల్లో ఎడతెగని కల్లోలం. చీకటిపడింది. పిల్లలు మూలల నక్కి కాలే పొట్టలతో జాలిగా ముడుచుకుని పడుకున్నారు. సుశీల తల తిరిగిపోతోంది. ఆకలీ, ఆవేదనా, ఆక్రోశం. ఈరాత్రికయినా సుందరం ఇంటికి వస్తాడేమో నని ఆశ మిణుకుమిణుకుమంటోంది. తన బతుకు ముందేమి కానున్నదో అగాధంగా వుంది. తనను సుందరం నడిసముద్రంలో ముంచివేసినా అతన్నే నమ్ముకుంది. అతని పేరు చెప్పుకునే నుదుట కుంకుమ దిద్దుకుంటోంది. అతని జీవితంతో తనకు తెగిపోని బంధం. అతను పాతాళానికి కూరుకుపోయినాసరే, తను నీడలాగా అనుసరిస్తుంది. తనతోపాటు పిల్లల్నికూడా తీసుకుపోతుంది. లోకం

ఒప్పుకోక గర్హించినప్పటికీ తను సుందరం భార్య అని గర్వంగా చాటుతుంటుంది...తలుపుకొట్టిన చప్పుడు.

సుశీల గబగబా లేచివెళ్లి తలుపుతీసింది. ఒక్కసారిగా గుండె ఆగినట్లయిపోయింది. బురదకొట్టుకున్న గడ్డలతో, తలలోంచి చిమ్ముకున్న నెత్తురుధారలతో వికృతంగా, భీకరంగా సుందరం తూలుతూ సోలుతూ లోపలికి అడుగుపెట్టాడు. అడుగుపెడుతూనే నేలమీద వాలిపోయాడు. సుశీల కళ్లనీళ్లు కుక్కుకుంటూ ఎన్నో ఉపచారాలు చేసింది. సుందరంనోట్లోంచి మాట పెగలటం లేదు. ఏం జరిగిందో తెలియదు. సుశీల దిక్కులేని పక్షి. ఆ రాత్రివేళ ఎవరిని వెళ్లి బతిమాలుకున్నా ఒక్క పిట్టకూడా ఇంటికి రాలేదు. ఈ గందరగోళం విని, పిల్లలు నిద్రలేచి తండ్రిఆకారాన్ని చూసి కెవ్వున ఏడవటం మొదలుపెట్టారు. ఎల్లా తెల్లవారిందో ఈశ్వరుడికే తెలియాలి.

సూర్యోదయ మయ్యేసరికి సుందరం ప్రాణాలు ఆగిపోయినయ్. కొనఊపిరి కాస్తా కళ్లలోంచి ఎగిరిపోయింది. ఈ భయంకరదృశ్యాన్ని చూసేసరికి సుశీలకి ఏడవటానికికూడా నోరురాలేదు. గుండె బండబారిపోయింది. లోకమంతా శూన్యంగా, అగాధంగా తోచసాగింది.

రాత్రి రానివాళ్ళంతా తెల్లవారేసరికి కమ్ముకున్నారు. ఎవరికి తోచిన మాట వారంటున్నారు. జూదంలో ఎవరితోనో కలియబడితే ఎవరో చావగొట్టారని కొందరూ, తాగి ఎవరింట్లోనో దూరబడితే తల బద్దలుగొట్టారని కొందరూ, చేసుకున్నది అనుభవించక తప్పదని కొందరూ, నోటికి వచ్చినట్లు వాగటం సాగించారు. ఆనాడు దహనసంస్కారానికికూడా ఎర్రని ఏగానీ ఇంట్లో లేదు. వీణా, మద్దెలా, హార్మోనియం, ఫిడేలూ వున్నయ్. ఒక్క ఫిడేలుమాత్రం అట్టేపెట్టుకుని మిగిలినవన్నీ అమ్మివేసి అంత్యక్రియలు జరిపించింది. బతికివుండగా సుందరాన్ని అవమానించినవాళ్లంతా అతని అంత్యక్రియలు జయప్రదంగా నడిపించడానికి పాటుపడ్డారు.

లోకం మాత్రం ఎంతో నిర్దయతో "పీడ పోతే మరొకడూ" అనివేసింది. "లేచిపోయి వచ్చిన మనిషికి నీతి ఏమిటి?" అని హేళనగా కొట్టిపారేసింది.

సుశీలమాత్రం వీటిని వినిపించుకోలేదు. ఎవరికి చెప్పకుండా పిల్లల్ని వెంటబెట్టుకుని, సుందరంస్మృతిచిహ్నమైన ఫిడేలును తీసుకుని తెల్లవారేటప్పటికి అదృశ్యమైపోయింది. ఎవరికి తోచినట్లు వాళ్లు తీర్మానించారు.

నెలరోజులుదాటినాక సుశీల రామేశ్వరంనుంచి తిరిగివచ్చింది. ఆమెను చూసి లోకం ముక్కుమీద వేలువేసుకుంది. చూసి నిశ్చేష్టులు కానివారు లేరు. ఆమె ఆకారంలో మాంగళ్యం సూచించే చిహ్నాలన్నీ మటుమాయమైనయ్. ఆమె అందానికి వన్నెలు దిద్దిన తుమ్మెదరెక్కలలాంటి నొక్కులజుట్టుకూడా సుందరానికి అర్పించి వచ్చింది.

అనుకోకుండా సుశీల పిల్లలతో ఆ ఊళ్లో దిగింది. వంటలుచేసుకుని అయినా పిల్లల్ని బతికించుకోవాలని నిశ్చయించుకుంది. ఆమెదిగిన పెట్టెలోనే ఒక నడివయసు మనిషి భార్యతోనూ, పిల్లలతోనూ ఎక్కాడు. ఆ మనిషిని సుశీల పోల్చుకుని గజగజ వణికిపోయింది. ఎన్నో ఏళ్లకిందట తన మెడలో పుస్తె కట్టిన భర్త అతనే. మళ్లీ పెళ్లి చేసుకున్నాడు. సరిగా ఈసమయంలోనే ఎందుకు తారసిల్లాలి? ఎవరో శూలంతో వెన్నులో పొడిచినట్లు సుశీల గిలగిల తన్నుకుంది. ఇన్ని ఊళ్లుండగా తను ఆ ఊరికే ఎందుకు రావాలి? ఇన్ని ఏళ్లనుంచీ జరగని సంఘటన ఇవాళే ఎందుకు జరగాలి? ఈ కష్టదశలోకూడా విధి తనను ఈ విధంగా వెక్కిరించాలా? అయోమయంలో పడి సుశీల ఉక్కిరిబిక్కిరయింది. "అమ్మా, ఇంటికి వెళ్దామా?" అని పిల్లలు. అప్రయత్నంగా "పోదాం" అనేసింది. ఎక్కడిఇల్లు? ఎక్కడికి పోవటం? ఏమిటి చెయ్యటం?



# భూప్రదక్షిణము

— శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య —

ప్రకృతిశాస్త్రజ్ఞాన మభివృద్ధి గాంచుటచేతను, దాని సహాయమున మనుష్యసౌఖ్యమునకు కావలసిన ఆహారాదిపదార్థములను అనంతముగ ఉత్పత్తిచేయుటకు అవకాశములు ఏర్పడుటచేతను కష్టమన్నది లేక ప్రతిమనుష్యుడును ఐహికజీవితమును సుఖముగ గడపగలవాడగు నను ఆశ ఇరవైయవ శతాబ్దప్రారంభమునాటికి అనేకులలో కలిగెను. కాని సుఖ మనుభవించుటకు బదులు మనుష్యుడు ఇటీవలి కాలములో ఎక్కువ కష్టపరంపరలకు పాలయ్యెను. దీని కంతకు ప్రధానకారణము దేశములకు దేశములకు మధ్య జరుగు యుద్ధము లని చెప్పవచ్చును. సౌఖ్యమును అభివృద్ధిచేయు వస్తుపరికరములను తయారుచేయుటకు బదులు అనేకదేశములలో యుద్ధసాధనములను తయారుచేయుటకై కర్మాగారములు వినియోగింపబడుచున్నవి. ఇట్లు తయారైన సాధనముల సముదాయము పూర్తి అయినపిమ్మట యుద్ధములు ప్రారంభమగుటయు, వాటి ఫలితముగ కోట్లకొలది ప్రజలు హతులగుటయు, గాయపడుటయు, పనిచేయుటకు అనర్హులగుటయు, కర్మాగారములు నాశమగుటయు, వ్యవసాయయోగ్యములగు భూములు బీడుప్రదేశములగుటయు, వస్తువులను ఉత్పత్తిచేయుటకు కావలసిన కార్మికులుగాని, యంత్రములుగాని, ఇతర పనిముట్లుగాని విరివిగ లభించకపోవుటయు జరుగుచున్నది. ప్రస్తుతము ప్రపంచములోని ప్రజలు ఆహారము, బట్టలు, ఇండ్లు మొదలైన అవసరపదార్థములుకూడ లేక నానాబాధలు పడుచుండుటకు ౧౯౩౯ మొదలు ౧౯౪౫ వరకు జరిగిన రెండవ ప్రపంచయుద్ధము ప్రధానకారణ మన్నమాట అందరికిని తెలిసినదే. కనుక సర్వనాశకరములగు యుద్ధములు రాకుండ చేసినగాని మనుష్యుడు సుఖముగ జీవింపజాల డని వేరుగ చెప్పనక్కర లేదు.

## దేశములకు మధ్య వివాదములు

మనుష్యునికి మనుష్యునికి మధ్య వివాదములు సంభవించునట్లు రాజ్యములకు రాజ్యములకు మధ్య వివాదములు తప్పవు. కాని ఈ వివాదములను పరిష్కరించుటకై మానవకోటి ఏర్పరచుకొనిన సాధనములలో గొప్ప భేద మొకటి కలదు. వ్యక్తులమధ్య వివాదము లేర్పడినపుడు వాటిని కోర్టులద్వారా చట్టముల ననుసరించి పరిష్కారముచేసుకొనుట మామూలు. రాజ్యములు, రాజ్యాంగములు, ప్రభుత్వములు—ఇవన్నియు ప్రధానముగ ఇందుకై ఏర్పడియున్నవి. కోర్టులమూలమునగాక, శరీరబలమును ఉపయోగించి ఎవడైన వివాదమును పరిష్కరించదలచినయెడల అట్టివాడు నేరస్థుడని పోలీసులు అతనిని పట్టుకొని, న్యాయాధిపతి ఎదుట విచారణ చేయించి, శిక్షించుట సర్వసాధారణము. కాని రాజ్యములకు రాజ్యములకు మధ్య సంభవించు వివాదములను పరిష్కరించుటలో యుద్ధము ధర్మసాధన మనియు, దానిని ఉపయోగించుటలో అన్యాయ మేదియు లేదనియు అనాదిగ అందరి అభిప్రాయము. ఇట్టి వివాదములనుకూడ కోర్టులమూలమున పరిష్కారముచేయు పద్ధతి ఆచరణలోనికి వచ్చినగాని యుద్ధములు అంతరింపజాలవు. రాజ్యములకు రాజ్యములకు మధ్య వివాదములే రాకుండచేయుట సాధ్యము కాదు. కాని, అట్టి వివాదములను యుద్ధ

సాధనమునగాక కోర్టులమూలమునగాని, మధ్యవర్తుల మూలమునగాని పరిష్కరించుట అసాధ్యము కాదు.

## ఐక్యరాజ్య సమితి

ఈ ఉద్దేశముతోనే ఐక్యరాజ్యసమితి ౧౯౪౫లో స్థాపింపబడెను. శాంతికి భంగకరమైనట్టియు, యుద్ధము వచ్చునట్లు చేయునట్టియు వివాదము లేవైన రాజ్యములమధ్య సంభవించినయెడల, అట్టి వివాదములను గురించి విచారణచేయుటకును, వివాదమును ఏవిధముగ పరిష్కరించవలెనో నిర్ణయించుటకును, ఆ నిర్ణయమును అములుపరచుటకును సమితియొక్క ప్రధానాంగము లగు మహాసభకును, భద్రతాసంఘమునకును అధికార మున్నది. ఇట్టి అధికారమును ఈ అంగములు వహించుట యుక్తమని సమితిలోని సభ్యులందరు అంగీకరించిన విషయమే. దీనిని అంగీకరించినవారే అందులోని సభ్యులు. వీటి అధికారమును ధిక్కరించి ఏ రాజ్యమైన యుద్ధములోకి దిగినయెడల, అట్టి రాజ్యమును శిక్షించుటకును, దానిపై సైనికబలప్రయోగము చేయుటకును భద్రతాసంఘమునకు అధికారము కలదు. ఈ కారణముచేత సమితి మూలమున యుద్ధము లంతరించునని ౧౯౪౫ తర్వాత అనేకులు అభిప్రాయపడిరి.

## ఆశాభంగము

కాని, భద్రతా సంఘము యొక్కయు, సమితి మహాసభ యొక్కయు చరిత్రను గమనించినవారి కంతరికి ఈ విషయమై ఇప్పుడు ఆశాభంగము కలుగుచున్నది. దీనికి మూడు ప్రధాన కారణములు భద్రతా సంఘమందలి శాశ్వత సభ్యులకు వీటో అధికార (గత సంచికయందు దీనియొక్క స్వభావము వివరింప బడియున్నది)ముండుటచేత అనేక విషయములలో ఆ సంఘము ఎట్టి నిర్ణయమునకు రాలేక పోవుట. అగ్ర రాజ్యముల మధ్య విపరీతమగు వైమనస్య మేర్పడియున్నది. అందుచేత వారందరు కలసి ఎట్టి తీర్మానము చేయలేకున్నారు. ఇట్టి సందర్భములో వివాదములకు పరిష్కార మనునది ఎట్లుండగలదు? కోర్టువారు డిక్రీ ఇచ్చుటయో, తీర్పు చెప్పుటయో జరిగినప్పుడుకదా దానిని అములులో పెట్టు ప్రశంస వచ్చుట. తీర్పు లేనపుడు పరిష్కార ప్రసక్తియే ఉండదు. ఒకవేళ భద్రతాసంఘమువారు ఏదైన తీర్మానము చేసినను, దానికి విరుద్ధముగ ప్రవర్తించు రాజ్యములను శిక్షించుటకు కావలసిన సైనిక బలము సంఘమువారికి ఇప్పటివరకు లేదు. అట్టి బలమును సమకూర్చుకొను విషయములో అగ్రరాజ్యముల మధ్య అభిప్రాయ భేదములు ఎన్నో ఉన్నవి. పోలీసులు, సైనికులు, కారాగారములు ఉన్నందుననే కోర్టువారి తీర్పులను అములులో నుంచుటకు ప్రభుత్వమున కవకాశ మేర్పడుచున్నది. దండసాధనములు లేని ప్రభుత్వము ప్రభుత్వ మను పేరునకు తగియుండదు. ప్రభుత్వమువారు దండింతు రను భయ ముండుటచేతనే కోర్టు డిక్రీల ప్రకారము వ్యక్తులు నడుచుకొనుటకు సిద్ధపడియున్నారు. కాని భద్రతాసంఘము విషయమై ఏ రాజ్యమునకుగాని అట్టి భయము లేదు. ఇందుచేతనే ఆ సంఘము గాని, సమితిమహాసభ గాని గావించిన తీర్మానములను అనేకరాజ్యములు లక్ష్యపెట్టుటలేదు. సమితినిర్ణయములకు బద్ధులైయుండుట కంగీకరించియే అందులో రాజ్యములు సభ్యత్వము వహించినను, అట్టి నిర్ణయములు తమకు లాభకరములైనప్పుడే వాటికి బద్ధులగుటయు, నష్టకరములైనపుడు వాటిని ఎదుర్కొనుటయు అనేకరాజ్యములకు అలవాటగుచున్నది. గత పదివారములలో సమితిమహాసభయందు జరిగిన చర్చలే దీనికి తార్కాణము. వీటిమూలమున సమితియొక్క పేరుప్రతిష్ఠలకు భంగము కలుగుటయేగాక, సమితివలన ప్రపంచమునకు లాభము కలదా, యుద్ధములను అంతరింపజేయుటకును, శాంతిని స్థాపించుటకును దానికి శక్తి కలదా—అన్న విషయమై అనేకులకు సందేహము కూడ కలుగుచున్నది.

## సమితియొక్క ప్రతిష్ఠ తగ్గుట

గత సంవత్సరమున దక్షిణఆఫ్రికాలోని భారతీయుల విషయమై అచ్చటి శ్వేతప్రభుత్వమువారు చేసిన చట్టములను ఖండించుచు, అట్టి చట్టములమూలమున దక్షిణఆఫ్రికా ఇండియా ప్రభుత్వములమధ్య ఏర్పడిన వివాదములను రాజీమార్గమున పరిష్కరించుకొనవలసినదనియు, ఎంతవరకు అట్టి పరిష్కారము జరిగెనో ఉభయప్రభుత్వములవారు సమితి మహాసభకు ఈ సంవత్సర సమావేశములో నివేదించవలెననియు ఒక తీర్మానము చేయబడినది. కాని దక్షిణఆఫ్రికా ప్రభుత్వమువారు ఈ తీర్మానమును ఎంతమాత్రము గౌరవించకపోవుటయేగాక, అట్టి తీర్మానమును చేయుటకు సమితి మహాసభకు అర్హత లేదని వాదించిరి. ఈ విషయమై ఈ సంవత్సరపు సమావేశములో భారతీయ ప్రతినిధులు ఒక తీర్మానమును ప్రతిపాదించిరి. కాని ఆతీర్మానము సభలో వీగిపోయెను

సమితియొక్క ప్రతిష్ఠకు ఇది ఎంతో భంగకర మన్న మాట వేరుగ చెప్పవలసినది లేదు. సంవత్సరముక్రిందట తాము చేసిన తీర్మానమును కొంచెముకూడ లక్ష్యపెట్టని దక్షిణఆఫ్రికా ప్రభుత్వపు ప్రవర్తనను ఖండించుటకు కూడ సమితి మహాసభకు ధైర్యము లేకపోయెను. సమితి ప్రతిష్ఠకు భంగకరములగు మరికొన్ని చర్యలుకూడ గమనింపదగియున్నవి. సమితి మహాసభయొక్క సాంవత్సరికసమావేశములకు మధ్య ఆలోచించవలసిన విషయములను ఆలోచించుటకు ఉపసంఘమొకటి ఉండవలెనని యునైటెడ్ స్టేట్సువారొక తీర్మానమును ప్రతిపాదించిరి. దీనికి అధికసంఖ్యాకులు ఆమోదించిరి. కాని ఈ ఉపసంఘముతో తమ కెట్టి సంబంధము లేదనియు, దాని చర్చలలో తాము పాల్గొనుట కంగీకరించుట లేదనియు రష్యావారును, వారి అనుచరవర్గములో చేరిన రాజ్యములవారును వెంటనే ప్రకటించిరి. అనగా సమితివారు చేసిన తీర్మానములకు తాము బద్ధులు కాజాలమని చెప్పుటయేకదా దీని అర్థము! ఇట్టి సందర్భములో తీర్మానమువలన ఎట్టి ప్రయోజనము కలదు? మరికొన్ని తీర్మానముల విషయమైకూడ ఇట్టి సహాయనిరాకరణవిధానమునే రష్యావారు అవలంబించిరి.

## పాలెస్టయిన్

పాలెస్టయిన్ విషయమై సమితిమహాసభవారు గావించిన తీర్మానమువిషయమై అరబ్బీరాజ్యముల వారి వైఖరికూడ ఇట్టిదే. పాలెస్టయిన్ ఒక కేంద్ర ప్రభుత్వమునకు లోబడియుండవలెనా, లేక రెండు ప్రత్యేకరాజ్యములుగ విభజింపబడవలెనా అన్న విషయమై సమితిమహాసభలో తీవ్రచర్చలు జరిగిన పిమ్మట, అది రెండురాజ్యములుగ (ఒక అరబ్బీరాజ్యము, ఒక యూదుల రాజ్యము) విభజింపబడవలెనని సభవారు తీర్మానించిరి. దీని ఫలితముగ బ్రిటిషువారు గత ౨౫ సంవత్సరములనుండి ఆ దేశముపై వహించియుండిన పరిపాలనాధికారమును వదలుకొని, ౧౯౪౮ ఆగస్టుకు వారి సైన్యములన్నిటిని ఉపసంహరించుకొనెదరు. అటుతర్వాత, సమితిమహాసభ తీర్మానానుసారము అచ్చట రెండు రాజ్యములు ఏర్పడవలసి యున్నది. బ్రిటిష్‌వారి అధికారము తొలగుటయు, రెండు రాజ్యములు ఏర్పడుటయు—ఈ రెంటికి మధ్య—సమితి వారిచే నిర్ణయింపబడిన అయిదుగురు సభ్యులు గల ఒక సంఘము దేశమును పాలించును. కాని దేశవిభజన కూడదని మొదటినుండి వాదించుచుండిన అరబ్బీలు ఈ తీర్మానమును యుద్ధపూర్వముగ నెదుర్కొనుటకు సిద్ధపడి యున్నారు. ఈ అరబ్బీ సమితిలో ఈజిప్టు, ట్రాన్సు జార్డన్, సౌదీ అరేబియా, సిరియా, లెబనన్, ఇరాక్ రాజ్యములు ఆరు ఉన్నవి. ఈ రాజ్యములవారు సమితిసభ్యులే. కాని సమితి చేసిన తీర్మానము తమకు ప్రతికూలముగ నున్నదను కారణమున దానిని ధిక్కరించుటకును, యుద్ధముచేసి తమ ఉద్దేశమును నెరవేర్చుకొనుటకును అరబ్బీ రాజ్యములు సిద్ధపడుట ఐక్యరాజ్య సమితియొక్క ప్రతిష్ఠకు ఎంతో భంగకరము.

## యుద్ధ రంగములు

రెండవ ప్రపంచయుద్ధము ముగిసినను ప్రపంచములో అనేక భాగములందు యుద్ధములు జరుగుచునే ఉన్నవి. వీటిని అణచుటకు ఐక్యరాజ్య సమితి ఎట్టి ప్రయత్నము చేయలేని స్థితిలో నున్నది. ౪౫ కోట్ల జనము గల చైనాదేశములో జాతీయ ప్రభుత్వమునకును, కమ్యూనిస్టు పక్షమునకును జరుగుచుండు అంతర్యుద్ధము; ఇండోనీషియాలో డచ్చివారికిని రిపబ్లికన్ పక్షము వారికిని జరుగుచుండు యుద్ధము; ఇండోచైనాలో ఫ్రెంచి సామ్రాజ్యాధికారులకును స్వరాజ్య సంస్థాపకులగు వీట్‌నాం రిపబ్లిక్ ప్రభుత్వము వారికిని జరుగుచుండు యుద్ధము; గ్రీసులోని అంతర్యుద్ధము— ఇవన్నియు ఇప్పుడు జరుగుచుండు యుద్ధములు. ఇదిగాక మధ్యప్రాచ్య మంతయు ఒక గొప్ప యుద్ధరంగమగు సూచనలు పొడగట్టుచున్నవి. పాలెస్టయిన్ విభజన నెదుర్కొనుటకు అరబ్బీ సమితిలోని ఆరు రాజ్యములవారు వారి రెండులక్షల సైన్యములతో యూదుల నెదుర్కొనెదరు. ఐక్యరాజ్య సమితియొక్క ప్రతిష్ఠను నిలబెట్ట దలచిన యెడల అమెరికా వారు, రష్యావారు వారి సైన్యములను పాలెస్టయినుకు పంపవలసి యుండును. ఇదిగాక పర్షియాలోని చమురు గనుల విషయమై రష్యావారికిని, పర్షియా ప్రభుత్వము వారికిని విపరీతద్వేషము ఏర్పడినది. ఉత్తరపర్షియా సరిహద్దులో రష్యావారు తమ సైన్యములను సమకూర్చుచున్నట్లును, అందుచే పర్షియాకు ప్రమాదము కలుగునట్లున్నదనియు తెలియుచున్నది. ఇట్టి ప్రమాదమునుండి ఆ దేశమును రక్షించుటకు అమెరికావారు తలపెట్టి యున్నారు. ఈ చిన్న చిన్న యుద్ధరంగములన్నియు క్రమక్రమముగ వృద్ధిగాంచి ప్రపంచమునంతను ఒక

గొప్ప యుద్ధరంగముగ మార్చివేసెనో అను భీతికి అవకాశము లేకపోలేదు.

## అగ్రరాజ్యముల పరస్పరవైమనస్యము

ఈ భీతికి రష్యా అమెరికాల మధ్య ఏర్పడిన వైమనస్యము దినదినప్రవర్ధమాన మగుచుండుటయే కారణము. ఈ ద్వేషము పెరుగుచున్నదని అనుకొనుటకు మరిమూడు నిదర్శనములు గతవారములో కనపించినవి. వాటిలో ముఖ్యమైనవి జర్మనీతో సంధి చేసుకొను విషయమును చర్చించుటకై వారముక్రిందట లండనులో సమావేశమైన ఇంగ్లండు, ఫ్రాన్సు, రష్యా, అమెరికా విదేశాంగమంత్రుల సభలోని చర్చలు. ఈ చర్చలలోని ప్రతిఅంశమును గురించియు రష్యావారి ప్రతిపాదనలకును, తక్కిన మూడ్గురి ప్రతిపాదనలకును ఏలాటి సామరస్యము కుదురుటలేదు. జర్మనీ యొక్క సరిహద్దులు, జర్మనీకంతకు ఒక కేంద్రప్రభుత్వము ఏర్పడవలెనా, ఏఅంశములను మొదట చర్చించుట, వేటిని తర్వాత చర్చించుట—అనునవన్నియు వివాదాంశములుగ నున్నవి. ఈ నలుగురిమధ్య రాజీ కుదురదనియు, కనుక ఒక్కొక్క రాజ్యము తనకు తోచినట్లు జర్మనీతో సంధిచేసుకొనవలసివచ్చుననియు విమర్శకు లనుకొనుచున్నారు. అదే జరిగినయెడల తూర్పుజర్మనీ రష్యా అధీనములోనికిని, పశ్చిమ జర్మనీ అమెరికా ఇంగ్లండు ఫ్రాన్సుల అధీనములోనికిని వచ్చుటయు, ఈకారణముచేత యూరోపుఖండము రెండుముక్కలై, యుద్ధరంగ మగుటయు తప్పదు. రెండవ నిదర్శనము బాల్కన్ ప్రాంతమందుండు యూగోస్లావియా, బల్గేరియా, అల్బేనియా, రుమేనియా మొదలగు రాజ్యముల నన్నిటిని కలిపి, ఒక ఫెడరల్ రాజ్యముగ ఏర్పరచుటకు రష్యావారు చేయుచుండు ప్రయత్నములు. ఈ రాజ్యములన్నియు రష్యా అనుచరవర్గములోనివి. వీటిద్వారా కమ్యూనిస్టు విధానము ఈ దేశములందేగాక గ్రీసుదేశమునందుకూడ వ్యాపింపజేయుటకు రష్యావారు పట్టుబట్టియున్నారు. దీనిని ప్రతిఘటించు ఉద్దేశముతో అమెరికావారు గ్రీసుకు ఆర్థిక సైనిక సహాయము చేయుచున్నారు. బాల్కన్ రాజ్యము లన్నిటిని ఒక ప్రభుత్వముక్రిందికి తెచ్చినయెడల గ్రీసులోని అమెరికావారిని ఎదిరించుట సులభమగునని రష్యావా రట్టి ప్రయత్నము నిప్పుడు చేయుచున్నారు. మూడవ నిదర్శనము చైనాలో రష్యాఅమెరికావారి చర్యలు. గత రెండుమూడు వారములందు చైనాలో కమ్యూనిస్టు పక్షమువారికి యుద్ధము అనుకూలముగ పరిణమించినది. జాతీయప్రభుత్వవశములో నుండిన పట్టణము లనేకములను కమ్యూనిస్టులు వశపరచుకొనిరి. వారి ప్రాబల్యమును మరింత వృద్ధిచేయుటకై అంతర్జాతీయ కమ్యూనిస్టు సమితివారు మంచూరియాలో ఒక కమ్యూనిస్టు సభను సమావేశపరచి, చైనా, మంచూరియా, మంగోలియా, కొరియా దేశములలోని కమ్యూనిస్టులందరు కలిసి పనిచేయవలసినట్లు తీర్మానించిరి. అంతర్జాతీయ సమితికి రష్యా ఆధార మన్నమాట గత సంచికలోని వివరణము స్పష్టము చేయుచున్నది. దీనికి జవాబుగ అమెరికావారు చైనాలోని జాతీయ ప్రభుత్వమునకు గొప్ప ఆర్థిక సహాయము చేయుటకు నిశ్చయించియున్నారు.

## యూరపులో కుడి ఎడమ పక్షములు

రష్యా అమెరికాల మధ్య వృద్ధిగాంచుచుండు ద్వేషమునకు ప్రతిబింబముగ పశ్చిమ యూరపుదేశములలో కుడిఎడమ రాజకీయపక్షములమధ్య ద్వేషము వృద్ధిగాంచుచున్నది. ఎడమపక్షము లనగా కమ్యూనిస్టు పక్షములు. కుడిపక్షము లనగా వ్యక్తిస్వాతంత్ర్యము నాధారముగ జేసుకొనిన ప్రజాప్రభుత్వ పక్షములు. ఫ్రాన్సు ఇటలీదేశములందు గత మాసములో ఈ రెండు పక్షములకు గొప్పసంఘర్షణ సంభవించెను. ఫ్రాన్సులో ఇది విపరీతరూపము ధరించినది. కమ్యూనిస్టు ప్రోద్బలముచేత సుమారు ఇరువైలక్షల కార్మికులు సమ్మెచేసియున్నారు. కొన్ని పట్టణములలో అంతర్యుద్ధ సూచనలు కనబడుచున్నవి. పాత మంత్రివర్గము తొలగిపోయెను. కుడిపక్షమునకు సంబంధించిన క్రొత్త మంత్రివర్గ మేర్పడెను. కాని సమ్మె మాత్రము ఇంకను జరుగుచున్నది. రైళ్ళు నడుచుటలేదు. ఎలెక్ట్రిక్ దీపములు వెలుగుటలేదు. దుకాణముల మూతవలన ఆహారపదార్థములు దొరుకుటలేదు. కార్మికులు చేయు పనులను సమ్మెకాలమున సైనికులచే చేయించుటకై ప్రత్యేక చట్టమును పార్లమెంటువారు చేసిరి. కాని దీని ఫలితముగ కమ్యూనిస్టుల ననుసరించు కార్మికులకును, ప్రభుత్వమునకును సంఘర్షణ మరింత వృద్ధికాగలదు. ఇటలీలోకూడ ఇట్టి పరిస్థితులే ఏర్పడియున్నవి. కమ్యూనిస్టులకు రష్యావారు ఆధారము. వా రెట్లు చెప్పిన అట్లే వీరు నడుచుకొనుచుందురు. ఇటలీ ఫ్రాన్సులలో కమ్యూనిస్టులకు విజయము కలిగినయెడల రష్యాకు విజయము

కలిగినట్లే. అందుచేత అట్టిది సంభవించకుండుటకై అమెరికావారు ప్రయత్నించుచున్నారు. కార్మికుల అసంతృప్తికి వారు పడుచుండు ఆర్థిక బాధలే కారణము. వస్తువుల ఖరీదులు పెరుగుట; చీకటి వ్యాపారము వృద్ధిగాంచుట—వీటి మూలమున కూలిజనము కష్టముల్పాలై, కమ్యూనిస్టుల ప్రచారములకు లొంగి సమ్మెలు చేయుచున్నారు. ఫ్రాన్సు ఇటలీ దేశములకు వెంటవెంటనే ఆర్థిక సహాయము చేయుటయే కార్మికులను సంతృప్తి పరచుటకు సాధనమని అమెరికావారు గ్రహించియున్నారు. ఇందుకై రెండు వారముల క్రిందట అమెరికాశాసన సభయొక్క ప్రత్యేక సమావేశము ఏర్పరచబడినది. బహుశః ఈ నెలలో సహాయమునకు సంబంధించిన వివరములు పరిష్కారమగుటయు, ఆర్థికసహాయము యూరపు దేశముల వారికి లభించుటయు జరుగును.

ఈ వివరములనుబట్టి తేలిన సారమేది? యుద్ధములు సంభవించకుండ చేయుటకై ఏర్పడిన ఐక్యరాజ్య సమితి ప్రతిష్ఠకు గత రెండు మాసములలో ఎంతో భంగము కలిగెను. రష్యా అమెరికాల మధ్య విరోధము మరింత వృద్ధిగాంచెను. పశ్చిమయూరపు ఖండ దేశములలో కుడి ఎడమ పక్షముల మధ్య ఏర్పడిన ద్వేషము విపరీత రూపము ధరించుచున్నది. ఇవన్నియు మరొక ప్రపంచ యుద్ధమునకును, మహా విప్లవమునకును సూచనలేమో అని తోచుచున్నది.

## భరతఖండము : బడ్జెటు

కేంద్రప్రభుత్వపు శాసనసభలో స్వతంత్ర భారత ప్రథమబడ్జెటు (ఆదాయవ్యయపట్టిక)ను ఖజానాశాఖమంత్రి షణ్ముఖం శెట్టిగారు ప్రతిపాదించిరి. దీనిలో గమనించదగిన విశేషము లనేకము లున్నవి. మొదటిది దేశరక్షణకై ఆగస్టు ౧౫ తేదీనుండి మార్చి ఆఖరుకు సుమారు ౯౩ కోట్ల రూపాయల ఖర్చు. అనగా మొత్తపు ఆదాయములో—౧౭౩ కోట్లలో—సగముకంటె ఎక్కువ సైన్యమునకును, నౌకాదళమునకును, విమానదళమునకును ఖర్చుకావలసియున్నది. బ్రిటిష్‌పాలనలో సైనికవ్యయము అత్యధికముగ నుండినదని మనము ఆక్షేపించుచుంటిమి. కాని ప్రస్తుతము అంతకంటె రెండింత లెక్కువగ మనము ఖర్చుపెట్ట సంసిద్ధులుగ నున్నాము. బహుశః రానురాను ఈ వ్యయము మరింత వృద్ధికావచ్చును. రక్షణవ్యయము వృద్ధియగుట మంచిదా అన్న అనుమానము అనేకులకు కలుగవచ్చును. కాని ప్రస్తుతపు పరిస్థితులలో ఈ వ్యయము తగ్గించుట భావ్యము కాదనియు, అవసరమైన రొక్కల ఇంతకంటె హెచ్చుగ ఖర్చుపెట్టుటకు మనము వెనుదీయరాదనియు చెప్పవలసియున్నది. పాకిస్థానము మనయెడల శత్రుభావమును వహించి, గొప్ప సైన్యములను సమకూర్చుకొనుచున్నది. గజనీ మహమ్మదు మొదలైన దోపిడిగాండ్రు పాకిస్థాన ప్రభుత్వమునకు ఆదర్శపురుషులుగ నున్నారు. మధ్యప్రాచ్యమందలి మహమ్మదీయదేశములకు రాయబారములు పంపి, అచ్చటి ప్రభుత్వముల సహాయమును సంపాదించుకొనుటకు ప్రయత్నించుచున్నది. కాశ్మీరు, హైదరాబాదు మొదలగు సంస్థానముల వ్యవహారములందు జోక్యము కలిగించుకొని, భరతఖండపు అంతరంగిక భద్రతకు, శాంతికి భంగము కలిగించనున్నది. ఇదిగాక లీగువర్గమునకు చెందిన మహమ్మదీయులు ఇండియా ప్రభుత్వముపట్లను, హిందూ-సిక్కులపట్లను ద్వేషభావము నింకను వదలుట లేదు. ఇట్టి సందర్భములో మనకు గొప్ప సైనికబలము, దానికి తగిన సైనికపరికరములు అత్యవసరము. ఇదిగాక మనకు పేరునకు మాత్రమే నౌకాదళ మున్నది. విమానదళముకూడ మిక్కిలి స్వల్పము. సుమారు నెలరోజులుగ యుద్ధము జరుగుచుండినను కాశ్మీరమును ప్రవేశించిన దోపిడిగాండ్రను ఇంతవరకు మన సైన్యములు పూర్తిగ తరిమి వేయలేదు. సమగ్రమైన సైనికబలము మనకు లేకపోవుటయే దీనికి కారణము. హైదరాబాదు సంప్రతింపులలో తీవ్రమైన చర్యను తీసుకొనుటకు మన ప్రభుత్వమువారు వెనుదీయుటకుకూడ ఈ దౌర్బల్యమే కారణము. కనుక ఖర్చుకు వెనుదీయక సైనికబలమును వృద్ధి చేసుకొనుటయే వాంఛనీయమని మనము అంగీకరించవలసియున్నది.

## హింస, అహింస

ఈ సందర్భములో మరియొక విషయముకూడ గమనించవలెను. మహాత్మాగాంధీగారు అనేకసంవత్సరములనుండి అహింసావిధానమును ప్రచారము చేయుచుండినను అధికారములో నుండు నెహ్రూ, బల్దేవుసింగు, పటేల్ మొదలగు కేంద్రములోని మంత్రులు గాని, రాష్ట్రములను పాలించు మంత్రివర్గములవారు గాని అహింసాతత్వమందు విస్తారము నమ్మకము కలవారుగ కనుపడ లేదు. ఆదర్శప్రపంచమందు అహింసాతత్వము ఆచరణయోగ్యమైనను వాస్తవప్రపంచమున పరిపాల

వాధికారమును వహించినవారు సైన్యముల నుపయోగించుట తప్పదు. కేంద్రశాసనసభలో డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు ఐచ్ఛిక సైన్యదళ సంస్థాపనమును గురించి ప్రతిపాదించిన తీర్మానమందును, దానిని గురించి అచ్చుల చేయబడిన ఉపన్యాసములందును ఈ విషయము స్పష్టీకరింపబడినది. కేంద్రమందును, రాష్ట్రములందును దేశసంరక్షణార్థమై గొప్పసైనికబలమును సమకూర్చుకొనుట తప్పదను విషయమునుగురించి అభిప్రాయభేదము లేదు.

## కాందిశీకులు

ఈ సంవత్సరపు బడ్జెటులో ఆదాయముకంటె ఖర్చు సుమారు ౨౫ కోట్లు ఎక్కువగుటకు ప్రధాన కారణములు రెండు. లక్షలకొలది హిందువులు, శిక్కులు పాకిస్థానను వదలి ఇండియాకు వచ్చుటయు, వారి రక్షణకై ౨౦ కోట్లు ఖర్చుకావలసి యుండుటయు మొదటి కారణము. విదేశములనుండి మనము తెప్పించుకొనుచుండు ఆహార పదార్థములకై ప్రభుత్వము వారు సుమారు ౨౩ కోట్ల రూపాయలు ఖర్చుపెట్టుట రెండవ కారణము. ఈ రెండు విషమ పరిస్థితులు లేని యెడల మన బడ్జెటులో లోటు లేకపోవుటయేగాక ఆదాయమే ఎక్కువగ ఉండెడిది. కాందిశీకులను రక్షించు భారము ప్రభుత్వము వహించుట తప్పదు. దీనిని కేంద్ర ప్రభుత్వమువారే వహించవలెనుగాని, తూర్పుపంజాబు రాష్ట్రముపై పడవేయుట న్యాయము కాదు. ఈ సందర్భములో ఒక విషయము గమనించవలసి ఉన్నది. అఖిలభారత కాంగ్రెసు కమిటీవారు ఇటీవల సమావేశమైనపుడు సాధ్యమైనయెడల కాందిశీకులను పాకిస్థానకు తిరిగి పంపించి వేయుట మంచిదని సూచించిరి. మహాత్మాగాంధిగారి అభిప్రాయము కూడ ఇట్టిదే. కాని దీనికి తగిన పరిస్థితులు పాకిస్థానములో ఏర్పడునని అనుకొనుట ఆకాశములో భవనములను కట్టినట్టిదే. ఎన్ని బాధలో పడి, ఎన్ని కష్టములో భరించి, తలదాచుకొనుటకై ఇండియాకు వచ్చిన కాందిశీకులను ఎన్నటికైనను పాకిస్థానమునకు పంపు ఉద్దేశము ఎవరికికూడ ఉండరాదు.

## ఆహారపదార్థములు: కంట్రోలు

ఆహారపదార్థములను విదేశములనుండి దిగుమతి చేయుట మూలమున రెండు విధములగు నష్టములు ఇప్పట్లో కలుగుచున్నవి. వీటి ధరలు చాల ఎక్కువగనున్నవి. అందుకై మనము చేయవలసిన ఖర్చు అత్యధికము. ఇదిగాక వీటికై మనము డాలర్లను సంపాదించవలసియున్నది. డాలర్ల కాటకపు రోజులలో ఈ వ్యవహారములో ప్రవేశించుట ఉచితముకాదు. మన పరిశ్రమలను వృద్ధి చేసుకొనుటకును, వ్యవసాయాభివృద్ధికిని ఎన్నో యంత్రములను విదేశములనుండి కొనుగోలుచేయుట ఇంతకంటె అవసరము. మనము సంపాదించగలిగిన డాలర్లను వీటికై వినియోగించవలెనేగాని ఆహారపదార్థములకై వినియోగించుట తెలివితేటతనము. గనుక విదేశముల నుండి ఆహారపదార్థములను తెప్పించి ప్రజలకు పంచిపెట్టు విధానమును ౧-౯-౪౮ నుండి ప్రభుత్వమువారు రద్దుచేయుట అవసరము. దీనితోపాటు కంట్రోలు విధానమునుకూడ రద్దుచేయుటకు ప్రభుత్వమువారు పూనుకొని ఉన్నారు. కంట్రోలును రద్దుచేయుట మంచిదా, కాదా అన్న విషయమై అతితీవ్రమగు అభిప్రాయభేదము లున్నవి. రద్దుచేయుటయే మంచిదని మహాత్మాగాంధీగారు ఉద్ఘాటించుచున్నారు. అఖిల ఇండియా కాంగ్రెసుకమిటీవారి అభిప్రాయముకూడ ఇట్టిదే. కంట్రోలుమూలమున అధికారులును, బ్లాకు మార్కెట్టుదారులునుమాత్రమే లాభము సంపాదించుచున్నారనియు, అధికారులలో లంచగొండితనము వృద్ధియగుట కిదియే కారణమనియు, చట్టధిక్కారము గావించి లక్షలాదిద్రవ్యమును సంపాదించుటకు వర్తకుల కిది ఎక్కడలేని అవకాశము కల్పించినదనియు ఆక్షేపకుల అభిప్రాయము. దీనితో ప్రభుత్వమువారుకూడ అంగీకరించుచున్నారు. కంట్రోలును రద్దుచేసినయెడల ధరలు విపరీతముగ పెరుగుననియు, కార్మికులు, సన్నజనము కష్టములపాలగుదురనియు ఒక వాదము కలదు. ఇట్టి సందర్భములో కంట్రోలును పూర్తిగ రద్దుచేయుటకు బదులు కాలక్రమమున పదార్థముల స్వభావమును బట్టి రద్దుచేయుట మంచిది. ధనికులు, మధ్యతరగతి వారు కొనుగోలుచేయువానిపై కంట్రోలును మొదట రద్దుచేయవచ్చును. తర్వాత తక్కిన పదార్థములను గురించి ఆలోచించవచ్చును. ఏతిగాని, కొంత అనుభవముమీదమాత్రమే లాభకరమో, కాదో చెప్పదగియున్నది. కనుక ప్రభుత్వమువారు కంట్రోలును రద్దుచేయు ప్రయత్నములో నుండుట ప్రశంసనీయము.

## కేంద్రశాసనసభ

రాజ్యాంగపరిషత్తే కేంద్రశాసనసభగా పనిచేయుచున్నది. ఈ విధానము అంత మంచిది కాదేమో.

అన్న సందేహము కలుగకతప్పదు. పరిషత్తు సభ్యులందరు రాష్ట్రశాసనసభలచే ఎన్నుకొన బడినవారు. వారిలో అనేకులు రాష్ట్రశాసనసభలలో సభ్యులు; కొందరు రాష్ట్రములను పాలించు మంత్రులుకూడాను. ఇట్టి సందర్భములో వారు కేంద్రశాసనసభలో హాజరై, అక్కడి చర్చలలో పాల్గొనుట సులభసాధ్యము కాదు. ఒక వ్యక్తి రాష్ట్ర శాసనసభయందును, కేంద్రశాసనసభయందును సభ్యుడుగా నుండకూడ దను పూర్వకాలపు శాసనములోని అంతరార్థ మిదియే. ఇందుచేతనే ఈలాటి కాంగ్రెసుసభ్యులు కేంద్రసభకు రావలసినది లేదని కాంగ్రెసుహైకమాండువారొక తాఖీదును పంపిరి. అందుచేత కేంద్రసభలో సభ్యులైనప్పటికి, అక్కడి చర్చలలో పాల్గొనుటకు అనేకులకు అవకాశము లేకపోయెను. రాష్ట్రశాసనసభ్యులనుమాత్రమే గాక ఇతరులనుకూడ రాజ్యాంగపరిషత్తుసభ్యులుగ ౧౯౪౬ లో ఎన్నుకొనియుండినయెడల ఇట్టి విపరీతము సంభవించియుండదు. కాని అప్పు డట్లు చేయుటకు కాంగ్రెసుపక్షమువారు ఇష్టపడలేదు. పదవీ వ్యామోహముచేత వా రప్పు డట్లు చేయరైరి. దాని ఫలితములు ఇప్పుడు అనుభవములోనికి వచ్చినవి.

## కాంగ్రెసు కార్యవర్గము : ప్రభుత్వము

కాంగ్రెసు అధ్యక్షునికిని, కేంద్రప్రభుత్వములో కాంగ్రెసుపక్షమునకు చెందిన నెహ్రూ, పటేల్, రాజేంద్రప్రసాద్ మొదలగు మంత్రులకును అభిప్రాయభేదములు ఏర్పడుటచేతను, అధ్యక్షునియొక్క గాని, కార్యవర్గముయొక్క గాని అభిప్రాయములను గుర్తించకయే మంత్రులు దేశపరిపాలనమును గావించుచున్నారనియు శ్రీయుత కృపలానీగారు అభిప్రాయపడి, అట్లు జరుగుట అనుచితమని భావించి అధ్యక్షపదవికి రాజీనామా ఇచ్చిరి. వారి స్థానమున శ్రీయుత రాజేంద్రప్రసాదుగారు అధ్యక్షులుగ ఎన్నుకొనబడిరి. కాంగ్రెసు కార్యవర్గమునకును, కాంగ్రెసు ప్రభుత్వములకును ఎట్టి సంబంధ ముండవలెనో నిర్ణయించుట సులభసాధ్యము కాదు. కాని మంత్రులు ప్రతివిషయములోకూడ కార్యవర్గముతో సంప్రతించవలెననుట సాధ్యముకాని పని. ఈ విషయమై రాబోవు సంచికయందు మరికొంత విపులముగ వ్రాసెదను.

## సంస్థానములు

జునాగడ్, కాశ్మీరము, హైదరాబాదు—ఈ మూడు సంస్థానముల మూలమున ఇండియా ప్రభుత్వమునకు అనేకచిక్కులు కలిగిన విషయము అందరికి తెలిసినదే. కాని నవంబరులో జరిగిన వ్యవహారముల మూలమున చాలవరకు ఈ చిక్కులు తొలగినవని చెప్పవచ్చును. జునాగడ్ నవాబుగారియొక్కయు, అతని ప్రధానియొక్కయు కోరిక ననుసరించి ఇండియా ప్రభుత్వమువారు ఆ సంస్థానమును పాలించు భారమును వహించిరి. సంస్థానము అదివరకే పాకిస్థానములో చేరియుండెననియు, దానిని పాలించు అధికారమును ఇండియా ప్రభుత్వమువారు వహించుట చట్టవిరుద్ధమనియు పాకిస్థాన్ ప్రభుత్వమువారు వారి నిరసనను తెలిపిరి. కాని ఈ నిరసనలో అర్థము లేదనియు, నవాబుకు లేని అధికారము పాకిస్థానమునకుకూడ ఉండదనియు, సంస్థానము పాకిస్థానములో చేరడమా, ఇండియాలో చేరడమా అన్న విషయమును నిర్ణయింపగలవారు ప్రజలేగాని మరొకరు కారనియు ఇండియా ప్రభుత్వమువారు ప్రకటించిరి. ఈ సందర్భములో సర్దారు పటేల్ జునాగడ్‌లో చేసిన ఉపన్యాసము చదువదగియున్నది. కాశ్మీరవిషయములో వివరింపదగిన విశేషములు లేవు. దోపిడిగాండ్రపై యుద్ధము సాగుచున్నది. వారిని పూర్తిగ తోమివేయుటకు కొంతకాలము పట్టును. శాంతిభద్రతలు ఏర్పడిన తర్వాతగాని ప్రజల అభిప్రాయమును కనుగొనుటకు వీలుండదని షేకు అబ్దుల్లా ప్రకటించెను. ఇట్టి సందర్భములో కాశ్మీరమునుగురించి పాకిస్థాన్ మంత్రులకును, ఇండియామంత్రులకును కొన్నిరోజులక్రిందట జరిగిన సంప్రతింపులు ఫలవంతములు కాకపోవుటలో ఆశ్చర్యము లేదు. దోపిడీగాండ్రను వెంటనే కాశ్మీరమునుండి తొలగించెదమనియు, వారితోపాటు ఇండియా సైన్యము గూడ వెంటనే తొలగిపోవలె ననియు పాకిస్థాన్ మంత్రులు కోరిరి. కాని ఇది అంగీకరించదగిన కోరిక కాదు.

## హైదరాబాదు

ఇండియా ప్రభుత్వమునకును, హైదరాబాదు నవాబునకును మధ్య మూడుమాసములుగ జరుగుచుండిన సంప్రతింపులు కొంతవరకు అనుకూలముగ ముగిసినవనియు, రెండుపక్షములవారు ఇప్పుడు అంగీకరించిన ఒడంబడిక మూలమున సంస్థానములో శాంతి పరిస్థితులు ఏర్పడుననియు చెప్పవచ్చును. ఈ ఒడంబడిక ఒకసంవత్సరముమాత్రమే అమలులో నుండు తాత్కాలికపు ఒడంబడిక. గనుక సంవత్సరాంతమున పరిస్థితులు మరియొకపర్యాయము క్లిష్టము లగునేమో అన్న

భయము లేకపోలేదు. కాని శాశ్వతమైన ఒడంబడిక చేసుకొనతగ్గ పరిస్థితులు ఇప్పటికి ఏర్పడలేదు. ఇండియా ప్రభుత్వమువారిని అనుసరించినగాని తనకు క్షేమము లేదను అభిప్రాయము నవాబుకు కలిగినప్పుడే శాశ్వత ఒడంబడిక వీలగును. అట్టి అభిప్రాయము ప్రస్తుతము నవాబుకుగాని, సంస్థానములోని అల్లరుల కంతకు కారణభూతులైన మహమ్మదీయ రాజకీయపక్షమునకు గాని లేదు. కాశ్మీరముతో పూర్తిగ వశపరచుకొనలేని ఇండియా ప్రభుత్వము అధీనమున తగినంత సైనికబలము లేదని వారి ఊహ. అట్టి సైన్యము తయారై, దానిని ఎదిరించుటకు తమకు శక్తి లేదని నవాబు, మహమ్మదీయ రాజకీయపక్షము ఎప్పుడు నమ్మెదరో, అప్పుడు వారు సర్దార్ పటేల్ విధించు షరతులను విధిలేక అంగీకరింతురు. ఈ సంవత్సరములో అట్టి నమ్మకము వారికి కుదురుటకు కావలసిన సన్నాహము అంతయు ఇండియా ప్రభుత్వము చేయవలసి ఉన్నది. ఒడంబడికలోని షరతులు కొన్ని ఇండియాకు నష్టకరములని కొందరి అభిప్రాయము. ముఖ్యముగ హైదరాబాదు సంస్థానమం దిప్పుడుండు ఇండియా సైన్యములను ౧౯౪౮ ఫిబ్రవరి ఆఖరుకు ఉపసంహరించుకొనుటకు ఇండియా ప్రభుత్వమువా రంగీకరించియుండకూడదని కొందరు ఆక్షేపించుచున్నారు. కాని ఇది అంత సమంజసము కాదు. శత్రుభావముతో ప్రవర్తించు హైదరాబాదు నవాబును అణచుటకు హైదరాబాదులోనే మన సైన్యము ఉంచవలసిన జరూరు లేదు. సరిహద్దు ప్రాంతములో ఉండిన చాలును. ఈ ఒడంబడికకు సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరములలో తాను పాకిస్థానములో చేరనని నవాబు చెప్పుట గమనింపదగిన విషయము.

మొత్తముమీద సంస్థానముల మూలమున ప్రభుత్వమునకు కలిగిన చిక్కులు తగ్గిపోవుచున్నవని చెప్పుట కవకాశ మేర్పడుచున్నది.

## మద్రాసురాష్ట్రము - పన్నులు

మద్రాసురాష్ట్ర పరిపాలన విషయములో రెండు విషయములు గమనింపదగియున్నవి. మొదటిది ప్రభుత్వమువారు తలపెట్టిన కొత్త పన్నులు; మద్యపాననిషేధము మూలమున పదహారుకోట్ల ఆదాయము ప్రభుత్వమువారికి తగ్గిపోయెను. ఈ లోటును పూర్తిచేసినగాని ప్రజాభివృద్ధికై జరగవలసిన ఏర్పాటులన్నియు జరుగుట సాధ్యముకానిపని. విద్య, ఆరోగ్యము, వ్యవసాయము, పరిశ్రమలు, రోడ్లు అన్నియు వృద్ధికావలసి యున్నవి. కోట్లకొలది ద్రవ్యమున్నగాని వీటిని వృద్ధిచేయుటకు వీలులేదు. ఇట్టి సందర్భములో మద్యపానమును నిషేధించి, ౧౬ కోట్ల ఆదాయమును కోల్పోవుట ఉచితమా అన్న సందేహము కొందరికి కలుగక మానదు. కాని దానినిగురించి చర్చించుట అప్రస్తుతము. ఆలోటును భర్తీచేయుటకు కొత్తపన్నులను విధించవలసిన పరిస్థితులు ఏర్పడినవనుటయే ప్రస్తుతాంశము.

ఇందుకై వినోదములపై—సినిమా, నాటకాలు, నాట్యాలు మొదలైనవి—ఇదివరకు విధింపబడియుండిన పన్నులు ఎక్కువచేయబడినవి. నూటికి మూడువంతులవరకు కొన్ని టిక్కెట్లపై పన్నులు ఇకమీదట విధింపబడును. దీనిమూలమున ప్రభుత్వమునకు వచ్చు ఆదాయము అంత ఎక్కువగ నుండదు. వచ్చిన ఆదాయములో పదియవవంతుమాత్రము ప్రభుత్వమువారు ఉంచుకొని, తక్కిన మొత్తమును మునిసిపాలిటీలు మొదలగు స్థానికసంస్థలకు ఇచ్చెదరు. మద్యపాననిషేధము వలన ఏర్పడిన లోటును భర్తీచేయుటకు ప్రభుత్వమువారు అమ్మకపుపన్నునుకూడ వృద్ధిచేయుటకు తలపెట్టియున్నారు. దీనిని గురించి అనేక ఆక్షేపణలు బయలుదేరియున్నవి. ముఖ్యముగ గమనించదగిన ఆక్షేపణ ఒకటి ఉన్నది. వినోదములపై పన్ను, అమ్మకపుపన్ను— ఈ రెంటినికూడ ప్రజాసామాన్యమే ఎక్కువగ చెల్లించవలసియున్నది. క్రిందతరగతి టిక్కెట్లను కొనువారి సంఖ్యయే ఎక్కువ. వస్తువులను కొనువారిలో అధికభాగము సామాన్యులే. పన్నులను ఎక్కువగా ధనికులే భరించుట న్యాయము. ఆ న్యాయమునకు ఈ రెండు పన్నులు విరుద్ధములుగ నున్నవి. వీటికిబదులు ధనికులే భరించదగు పన్నులను విధించియుండిన బాగుండెడిది. వ్యవసాయ ఆదాయపుపన్ను, ఆస్తిపన్ను మొదలైన పన్నులెన్నియో ఈలాటివి కలవు. వాటిని వెనుకపెట్టి సామాన్యుల బాధలను వృద్ధిచేయు పన్నులను విధించుట నిషేధింపదగియున్నది.

## శాసనములు

జమీందారీలను రద్దుచేయుటకై ప్రవేశపెట్టబడిన బిల్లులు ఈ సందర్భమున గమనింపదగియున్నవి. జమీందారీభూములనన్నిటిని రైతువారీ భూములుగ మార్చుటయు, వాటిని వ్యవసాయముచేయు రైతులు చెల్లించవలసిన శిస్తులను రైతువారీశిస్తులతో సమానముగ

నట్లు తగ్గించుటయూ, జమీందారీభూములపై జమీందారులకు ఇదివరకున్న హక్కుల నన్నిటిని తొలగించుటయూ, దానిమూలమున జమీందారులకు కలుగనున్న నష్టమును పరిహరించుటకు వారికి పరిహారద్రవ్యము నిచ్చుటయూ ఈబిల్లులయొక్క ప్రధానోద్దేశములు. ఈ మార్పులు జరుగుట మంచిది కాదని చెప్పువా రెవ్వరు ఉండరు. కాని కొన్నివిషయములలోమాత్రము అభిప్రాయభేదమున కవకాశమున్నది. ఇనాములుకూడ జమీందారీలవంటివే అను వాదమును ఆధారముచేసుకొని ఇనాములను రద్దుచేయుటకుకూడ ప్రభుత్వమువారు తలపెట్టియున్నారు. కాని ఇది న్యాయముకాదు. ఈరెంటికి ఎట్టి సామరస్యము, పోలిక కనుపించదు. ఇదిగాక ఇనాములను అనుభవించువారిలో అనేకులు కడుపేదలు. అందులో నుండి వచ్చు శిస్తే వారికి జీవనాధారము. అత్యధికముగ ధనధాన్యములు గల జమీందారుల లాభమును తగ్గించుటలో అర్థమున్నదికాని, దరిద్రులగు ఇనాందారుల భూములను రైతులకు ఇచ్చివేయుట కాకికొట్టి గ్రద్దకు వేయుటయే. ఇందులో సోషలిజం ఏదియు కనుపించదు. ఇట్టి అన్యాయము జరుగకుండ బిల్లు సవరణకావలసియున్నది. జమీందారులకు ఇచ్చు నష్టపరిహారమువిషయములో కూడ కొంత అభిప్రాయభేదమున్నది. మొత్తముమీద వారందరికి ౧౦ కోట్ల ద్రవ్యమును ఇచ్చుటకు ప్రభుత్వము ఉద్దేశించినను, ఇంతకంటె ఎక్కువ ఇచ్చుట న్యాయమని కాంగ్రెసు హైకమాండువారు చెప్పినట్లు తెలియుచున్నది. ప్రభుత్వము వారు ఉద్దేశించినట్లు చేయుటయే ధర్మము.

## ఆక్షేపణలు

కాని ఈ బిల్లులను విమర్శించువారు గమనించవలసిన విషయములు ఇంతమాత్రము కావు. కష్టపడి పని చేయక కోట్లకొలది లక్షలకొలది ద్రవ్యమును సంపాదించుచున్నారను కారణము చేత జమీందారులను తొలగించుట జరుగుచున్నది. కాని కష్టపడి పనిచేయక, మితిమేరలులేని ఆదాయమును గడించువారు ఒక జమీందారులుమాత్రమే కాదు. ఇట్టివారు సాహుకార్లెందరో ఉన్నారు. దరిద్రులకు అధికవడ్డీలమీద అప్పులిచ్చువారు; బ్యాంకీలలో ధనమును డిపాజిట్టుగా దాచుకొనువారు; కంపెనీలలో వాటాలు కొని ఏటేట లాభమును సంపాదించువారు; పట్టణములలో ఎన్నో ఇండ్లను కట్టి, ఇంటిఅద్దెలు వసూలు చేయువారు ఎందరో ఉన్నారు. జమీందారుల ధనము హరించుట ఎంత అధర్మమో ఇట్టి సాహుకార్ల ఆస్తిని హరించుటకూడ అట్టిదే. కనుక న్యాయానుసారముగను, నిష్పక్షపాతముగను, సోషలిస్టు సిద్ధాంతముల ప్రకారమును రాష్ట్రమును పాలించగోరు కాంగ్రెసు మంత్రివర్గమువారు ఇట్టి సాహుకారీపద్ధతి నంతను నిర్మూలము చేయవలసియున్నది. అట్టి పనికి వారు పూనుకొనెదరని తోచుటలేదు.

## ఆంధ్రరాష్ట్రము

క్రొత్త రాజ్యాంగచట్టము నిర్మాణమగునప్పుడు ఆంధ్రరాష్ట్రముకూడ నిర్మాణముకావచ్చునని కొన్నిరోజులక్రిందట పండిట్ నెహ్రూ కేంద్రశాసనసభలో సూచించెను. దీనినిబట్టి ౧౯౪౮ లోగాని, ౧౯౫౦ లోగాని ప్రత్యేకరాష్ట్రము లభించవచ్చును. రాయలసీమలోని ఆంధ్రులు దీనికి ఎదురుతిరుగరని నమ్ముచున్నాము. ఈ రెండు సంవత్సరములలోను శాసనసభలందును, మంత్రివర్గమునందును ఉండు ఆంధ్రులు బహుజాగరూకతతో మెలగవలసియున్నది. ఇదే సమయమని తమిళసోదరులు ఎక్కువడబ్బును తమిళజిల్లాల ఉపయోగార్థమై ఖర్చుపెట్ట ప్రయత్నింతురు. అట్టి ప్రయత్నములు జరుగకుండ చూడవలెను.

(1-12-'47)





# హాస్యరసము

= శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి =

రసస్వరూపమును నిర్వచించటానికి అతిప్రాచీన కాలమునుంచి వేదాంతులు, ఆలంకారికులు చాలా యత్నించినారు. ఈ వాదాలలో రసస్వరూపమే విస్మరింపబడి, ఆనుషంగికములైన అంశాలు వివరించబడినవి. వస్తుతః 'రసః' యొక్క చేతనాది శాంతము. ఈ మూల'రసము'నకు స్థాయిభావాదు లక్కరలేదు. ప్రసన్నమైన శాంతమే ఇతర రసాలకు చైతన్యము నిచ్చేది. అనగా నిది అష్టమూర్త్యాత్మకము. శృంగారాది ఎనిమిది రసాలు శాంతముయొక్క ఆవిష్కృతులు. అందువలననే భరతుడు—

"స్వం స్వం నిమిత్త మాసాద్య
శాంతా దుత్పద్యతే రసః,
పున ర్నిమిత్తాపాయే తు
శాంత ఏవ ప్రలీయతే"

అనినాడు. ఆయా సన్నివేశాల నుపాధిగా గ్రహించి ఇతర రసములు శాంతమునుంచి ఉద్భవించుచున్నవి. ఆ ఉపాధులు నశించగనే అవి శాంతములో లీనమౌచున్నవి. అనగా శాంతమే సర్వరససామాన్యమైన చైతన్యము. శాంతమునుంచి అష్టరసాలు జన్మించి, శాంతముచే వ్యాపింపబడి, మరల శాంతములో లీనమౌచున్నవి. కావ్యరసానుభూతిలో మన కనుభవసాక్షికమైనది శాంతమొక్కటే. అందువలననే కరుణ, రౌద్ర, వీర, భయానకాలుకూడ శృంగారహాస్యాలవలె ఆనందజనకములగుచున్నవి. ఈతుల్యానుభూతికి ఆర్ద్రీహృదయత్వము, సానుభూతి కావలెను. దీనినే భవభూతి 'కరుణ' అనినాడు. ఆంగ్లములో నిది Sympathetic insight అనబడుచున్నది. కావ్యానుశీలనాభ్యాసవశముచేత సహృదయుని మనస్సనే ముకురము నిర్మలమై, తన్మయీభవనయోగ్యమై, అనుభవించు నిర్భరానంద సంవిద్రూపమే రసము. ఇదే శాంతము. సర్వరసాలకు ఈ శాంతముతో సమన్వయము కుదిరితేనే, రసస్వరూపము విశదము కాగలదు.

ఇట్టిసమన్వయము కేమీ లేకుండా ఉన్నది హాస్యరసము. అతి ప్రాచీనకాలమునుంచి అనేక విమర్శకులు హాస్యరసము నవలోడన చేయ మొదలుపెట్టినప్పటికిని, శృంగారమువలె నీ రసము వారికి లక్ష్యము కాకపోయినది. హాస్యమును హాసముతో కలిపి ఆర్యులు గ్రహించినట్లే, నవీనుడైన బెర్గ్సాన్ (Bergson) కూడా విమర్శించినాడు. మన ప్రాచీన ఆలంకారికుల దృష్టిలో వికృతాకార వాగ్వేష చేష్టాదులనుంచి హాస్యము జన్మించును. సర్వసాధారణమునకు విలక్షణముగా నుండునదే హాస్యమన్నారు. నిద్రా, ఆలస్య, అవహిత్థాదులే సంచారిభావములు. అనగా అనుపయోగకాలు. సౌందర్యరహితాలు హాస్యానికి ఉత్తేజకాలు. కావున సర్వసాధారణవైలక్షణ్యము (Contrast), అనుపయోగిత్వాది దోషములు హాస్యజనకము లని సంప్రదాయవేత్త లన్నారు.

మనకు సర్వసామాన్యంగా సంస్కృత నాటకాలలో విదూషకులు కన్పించుతారు. వీరి వాగ్విలాసములో వైచిత్ర్య మున్నది. వీరికి తిండియావ అన్ని వేళలా ఉంటున్నది. వీరిని గమనించి ఇదే హాస్యరసమని చాలామంది యెంచుట పొరపాటు. శాకుంతలాది నాటకాలలోని విదూషకులలో ఆత్మవంచన, ఆత్మవిమర్శన చాలా ఉన్నది. 'వ్యుత్పన్నబుద్ధి'ని విదూషకు డంగీకరిస్తాడు. ఈ ఆత్మవిమర్శనవలన, తనలోపాలు తనకే తెలియుటచేత, తనంతట తనకే అవహేళన ఎక్కువౌతుంది. ఇదే పంచ్, ఐరిష్ హాస్యాలలోని విశిష్టగుణము.

ఈ విదూషకులతో పాటు మృచ్ఛకటికలోని శకారుని చూదాము. శకారుడు రాజస్యాలుడు. తను చేసేది తనకే తెలియదు. మూర్ఖత్వ, కామము ఇతనిలో విశిష్టగుణాలు. కాని తనకేమీ కొదవలేదని తనకే తెలియనిస్థితిలో ఉంటాడు. శృంగారవిషయకమైన కోరికలు బలవత్తర

ములై, హృదయకుహరములో బాగుగా అణచబడి ఉంటున్నవి. ఇవి ఉన్నట్లుకూడా శకారునికి తెలియదు. కాని వసంతసేనను వెంటాడినాడు. రదనికకు వసంతసేనకు గల భేదము తెలిసికొనలేకపోయినాడు. చివరకు వసంతసేనను హత్యచేయుటకుగూడా సిద్ధపడినాడు. నవ్వు పుట్టించే సంభాషణాదికమును గాలించినా శకారుని జీవితము విషాదపూరితముగానే కన్పడుతున్నది.

మొలియేరు వ్రాసిన Misanthrope అను నాటకము శకారునిజీవితమును స్మరింపజేసెడిది. దీనిని గెటే (Goethe) అను జర్మన్ కవిసమ్రాట్ విషాద నాటకమనినాడు. షేక్స్పియర్ వ్రాసిన Measure for Measure, Much Ado about Nothing అను నాటకములు విషాద నాటకములా, హాస్యరసపూరితాలా అని మనము నిశ్చయముగా చెప్పలేము. ఫాల్ స్టాఫ్ (Falstaff) హాస్యరసపాత్రలలో నద్వితీయుడు. కాని ఇతనిలో శృంగార మంతర్లీనమై, అవ్యక్తగీతాల నాలపించినది. చివరకు రాజాశ్రయముకూడా గతించినది. ఇతని చరిత్ర విషాదమయము. డాన్ క్విక్సోట్ (Don Quixote), మన తెనుగులో బారిష్టర్ పార్వతీశం కూడా ఇలాంటివారే. వీ రందరిలోను హాస్యరసము శృంగారము నాశ్రయించుకొని, విషాదమయ జీవితములోనికి పరిణమించుచున్నది.

అందువలననే భరతుడు "శృంగారానుకృతి ర్హాస్యం" అన్నాడు. హాస్యము శృంగారమునకు అనుకరణ (Mimesis). అనుకరణ అనగానే సాదృశ్యమని గాని, తుల్యమని గాని భరతు డెన్నడూ అంగీకరించలేదు. లోకధర్మి, నాట్యధర్మి అని విభజించిన భరతునికి అనుకరణ అనగా విలక్షణావిలక్షణత. అనగా సాదృశ్యము నాశ్రయించుకొని బయలుదేరిన వైరూప్యము. దీనినే ఆదర్శమయమైన వాస్తవికత అన్నారు లాక్షణికులు. పైగా భరతుడు "శృంగారాద్ధి భవే ద్హాస్యం" అనికూడా వచించుటచేత, శృంగార రసాశ్రయమైనది హాస్యమనవలెను. హాస్యరసములో శృంగార మంతర్లీనమై ఉంటుటచే, జాగ్రదవస్థలో ఆయా పాత్రలకు అది సువ్యక్తము కాదు.

బారిష్టర్ పార్వతీశం హాస్యరసపాత్రలలో నుత్తము మని నిర్వివాదముగా చెప్పవచ్చును. పార్వతీశములో కామ మంకురించి, ప్రబలముగా నతనిని బాధించ మొదలుపెట్టినది. ఇంటిలో ఉంటే అది ఒకనిర్బంధమే. అనాస్వాదితము, అవిజ్ఞాతము నైన శృంగారము స్వేచ్ఛను కోరుతుంది. ఈ స్వేచ్ఛవలననే ఫ్రాయిడ్ చెప్పిన Oedipus Complex, Electra Complex, Transference, Auto-Erotism మొదలైనవి జనించుచున్నవి. అనగా అసభ్యము, అవినీతికరము నైన తుచ్ఛ కామముగాని, పురుషుడు పురుషుని, స్త్రీ స్త్రీని మాత్రమే ప్రేమించుటగాని, లేక స్వీయదేహమునే ప్రేమించుటగాని బయలుదేరుచున్నవి.

పార్వతీశం టిక్కట్టుకూడా కొనలేదు. కాని కామవాంఛ బలవత్తరమగుటచే ఏదోవిధముగా రైలులో ప్రవేశింపగలిగినాడు. కాని అక్కడకూడా తను పోయే దేశ మెవరికీ తెలియరాదు. ఇదే తిరోహిత (Suppressed) శృంగారలక్షణము. శృంగారమునకు సంబంధమే లేనట్లు ప్రవర్తించుటచే నిది హాస్యపోషక సన్నివేశమైనది. కాని ఇది విషాదసన్నివేశము. తర్వాత కచ్చికలను పోగు చేసికొని పోవట మున్నది. ఈ అవ్యక్త, అవిజ్ఞాత ఆశయముల ననుసరించి పోయే పార్వతీశం పురుషులలో అభిసారికవంటివాడు. కాని ఈ అభిసారిక తన ప్రేయసి ఎక్కడ ఉంటుందో తెలియదు. అందుచే వాసకసజ్జికగా మెలగదలచి క్రాపుచేయించుకొని, చివరకు ఆడవాళ్ళ టోపీని Lady's Hat కొన్నాడు. ఇంతకు పూర్వము జరిగిన సన్నివేశా లీ ఘట్టమునకు పూర్వరంగమువంటివి. ఇంతేగాక ఫ్రాన్సులో రైలు ఎక్కుతూ ఆడవాళ్ళ పెట్టెలో (Les dames) చేరినాడు. ఇవన్నీ అతడు తెలిసి చేసినవి కావు. అందుకనే హాస్యచిత్రణ లైనవి. అనగా శృంగారాశ్రయమైన సన్నివేశము ఆ శృంగారమునకు సంబంధములేకుండా ప్రదర్శింపబడినచో, అది హాస్యరసపోషక మగును.

అనేకవస్తువులకు, విషయములకు సమన్వయము (Synthesis) కూర్చునది శృంగారము. ఈ భిన్నవస్తుజాతమును భిన్నముగా, ప్రకరణరహితముగా గమనించునది హాస్యము. అనగా, పృథక్త్వముతో హాస్యము ప్రారంభమయినది. తేజోరూపుడైన భగవంతుడు 'జ్యోతిర్భవతు' (Fiat lux) అనుటతో సృష్టి ప్రారంభమైనదనే యూదుల వాక్యముకన్న హాస్యతమమైనది లేదు. అందుకనే బాదరాయణులు "లోకవత్తు లీలాకైవల్యం" అని సూత్రించి, సృష్టినంతా హాస్యరససన్నివేశమునకు దింపినారు. ఇట్టి పృథక్త్వమే పార్వతీశంలో కలసినది. ఇల్లు వదలినదిమొదలు ఫ్రాన్సులో Les dames లో చేరినంతవరకూ గల సన్నివేశ సముదాయము శృంగారచేష్టగా సమన్వయము చెందుతున్నది.

ఈ పృథక్త్వావలోకనమువలన హాస్యరసములో తత్త్వనిర్ధారణ బయలుదేరుతున్నది. నిర్గుణుడైన బ్రహ్మ, అసంగుడై, నిర్లిప్తుడై, సచ్చిదానందస్వరూపుడై ఉన్నాడని వేదాంతు లంటారు. పృథక్త్వము (Analysis) లో ఈ చిదంశయే విమర్శింపబడుచున్నది. ప్రకరణ సంబంధము లేకుండా ఈ చైతన్యము ప్రదర్శింపబడు చున్నది. అందుచే నీ సత్యమును సత్యముగా గుర్తించ లేక పోతున్నారు. ఇదే నవ్వుకు కారణ మౌతున్నది. సత్యము కల్పితకథకన్నా విచిత్రముగాను, అవిశ్వసనీయముగాను ఉంటుందని, పెద్దలందుకనే అన్నారు- 'Truth is stranger than fiction'. గెటే అందుకనే తన స్వీయకథకు "సత్యానృతము" (Dichtung und Wahrheit) అని పేరిడినాడు.

హాస్యరసపోషకపాత్రలు సామాన్యముగా జీవితములో ఆశాభంగమును పొందినవే నని చెప్పాలి. Falstaff ఆశించిన దశనికి లభించలేదు. Don Quixote విఫలమనోరథుడైనాడు. శకారుడు మృచ్ఛకటికమునుంచి అతికష్టం మీద బయటపడినాడు. పార్వతీశం బాగుపడలేకపోయేమోనని సంశయము కల్గుతుంది. ఏమైనా జీవితములో తను పెట్టుకొనిన ఆదర్శాలను సాధించలేకపోయినాడు. తను చేయదలచినది ప్రతిదీ తన భావాలకు, ఆశయాలకు వ్యతిరేకముగానే జరిగిపోయినది. తాను తలచనిది జరిగినది. ఈ విషమైన ఆశాభంగాలు పూర్తిగా వ్యక్తిత్వము నణచివేసినవి. దానితో కుటిలమైన ఆత్మవిమర్శ బయలుదేరినది. దీనినే Cynicism అంటారు. ఇది మనకందరకూ తెలిసిన సత్యమే. కాని మనమై మనము ఈవిమర్శ చేసికొనటానికి ఉత్సహింపము. అందుచే పరస్థమైనప్పుడే దీనిని ఆనందించ గలుగు చున్నాము.

పార్వతీశమునకు కలిగిన ఆశాభంగాలు చాలా ఉన్నవని అనుమేయము. వానిలో శృంగారవిషయకమైనది మహత్తరమైనదని కూడా ఊహింపవీలగు చున్నది. ఈ మానసిక దురవస్థనుంచీ తప్పించుకొనుటకై నిశితవిమర్శనము, ఉదాసీనతను అలవరచినాడు. కాని మనోదుఃఖము అంత తేలికగా పోవునది కాదు. అది ఎల్లవేళలా మనను వెంటాడే వస్తుంది. ఈ బాధ నుంచీ తప్పించుకొనవలెనని హాస్యరసపోషణకు దిగినాడు. కావుననే—

"ప్రాంచో అగామ నృతయే హసాయ
ద్రాఘీయ ఆయుః ప్రతరం దధానాః"

అన్నారు వైదికఋషులు. మరణము మొదలైన దుర్భర సన్నివేశాలు భౌతికముగాను, మానసికముగాను కూడా మానవుని కుంగదీసేవి. అందుచేత దీర్ఘాయువు ననుభవించదలచిన నృత్యము, హాస్యము కావాలి. ఈ సూత్రముచే పార్వతీశ మనుసరించినాడు. కాని అడుగడుగునకు దుర్భరమైన ఆవేదన, మనస్తాపము ధ్వనించుతూనే ఉన్నవి. అందువలననే 'పార్వతీశం' ను వ్రాసిన శ్రీ మొక్కపాటి నరసింహశాస్త్రి గారు హాస్యరసములో మాలీరా, రాబెలే, సెర్వాంటిజ్ లతో తుల్యమైన కీర్తిని అలంకరించుతున్నారు, అలంకరించగలరు కూడాను. పార్వతీశం, ఫాల్ స్టాఫ్, డాన్ క్విక్సోట్, శకారులు సమానైశ్వర్యసంపన్నులు. వీరిలో అననుభూతశృంగారమువి, వాదము తులాశ్వస్థలు. ఇదే హాస్యరసలక్షణము.

కావున హాస్యములో పృథక్త్వము తత్త్వవిమర్శన చేసి, ఆత్మపరిశోధనతో వ్యక్తమౌతున్నది. శృంగారాశ్రయమైన సన్నివేశము శృంగారముతో సంబంధము లేనట్లే ప్రదర్శింపబడుతున్నది. అనుభవయోగ్యము కాని శృంగారము, అవ్యక్తముగా, అవిజ్ఞాతముగా నుంటున్నది. దీనిచే హాస్యము కేవలము విషాదమునే ధ్వనింపగలిగినదౌతున్నది. ఈ ధ్వనిలో జీవితముపై వ్యాఖ్య కలదు.

"Life is a tale told by an Idiot",
"Our little life is rounded with a sleep"

అన్న షేక్స్పియర్ వాక్యాలు, అజవిలాపమును, రతివిలాపమును పాడించిన కాళిదాసగీతాలు ఉత్తమ హాస్యరసమున కుదాహరణాలు.

"Poor mortals, Hal, Poor mortals"

అని సైనికుల నుద్దేశించి పల్కిన ఫాల్ స్టాఫ్ "అర్థో హి కన్యా పరకీయ ఏవ" అని కూడా అనగలడు.

"చలాపాంగం దృష్టిః", "అనాఘ్రాతం పుష్పం", "యాస్యత్యద్య" అనే శ్లోకాలు ఉత్తమ హాస్యరసపోషకాలు. భవభూతిలోని "పశ్చాత్పుచ్ఛం వహతి విపులం" కూడా ఇట్టిదే. అనగా హాస్యరసములో సత్యము విమర్శింపబడి ప్రదర్శింపబడుతుంది. పృథక్త్వనిశ్చితముగా తత్త్వము నిర్లిప్తతతో నిర్దిష్టమైనప్పుడే హాస్యరసము వ్యక్తీకరింపబడుచున్నది.



నూతన వధూవరులు-ఫిలిప్ మౌంట్ బాటెన్, ఎలిజబెత్ రాకుమారి

# కలగూరగంప

## నీటి మహిమ

చిత్రవిచిత్రమైన పరమేశ్వరసృష్టికి కావలసిన ముడి పదార్థాలలో నీరున్నూ ముఖ్యమైనదే. సృష్టి ప్రారంభం ఏవిధంగా జరుగుతుందని యోచిస్తే, మొదట ప్రళయం కలుగుతుంది. అంటే సర్వం జలమయమై పోతుంది. తర్వాత అందులోనుంచి భూమి, తక్కిన జీవరాసులు మొదలయినవి కలుగుతున్నవి.

భూభాగం ఒకపాలైతే జలభాగం మూడుపాళ్లు. మట్టిలో యిది పండుతుంది, అది చిక్కుతున్నది అంటాము. ఆ పంటలకు కారణం నీరేకదా! నీటిలోనే యున్నది ప్రపంచవ్యవహారమంతా. వానలు లేకుంటే క్షామం. ఏ యే కార్తెలో ఎంతెంత వానలు, ఎప్పుడెప్పుడు పడునో రైతుకు తెలుసు. వర్షం చాలక వానలు లేక కరువు రావడం తటస్థిస్తే, యే యజ్ఞయాగాదులో చేసి తంటాలుపడేవారు ఆ రోజుల్లో. ఋష్యశృంగుని ఉదాహరణ మనకు తెలిసేవుంది. ఋష్యశృంగుల వారు వస్తే వానలు కురుస్తవని, ఆయనను తేవడానికి వారవనితలను పంపవలసివచ్చింది. నేటికిని పల్లెల్లో సకాలంలో వర్షం పడకుంటే విరాటపర్వం చదివే ఆచారం కద్దు.

భగీరథుడు గంగను తేవడానికి పడిన పాట్లు పురాణాలను చూస్తే బయలుపడును. "నీరే ప్రాణాధారము" అంటాడు సుమతీశతకకర్త. "ఉదకం నారాయణస్వరూపం" అన్నారు ఆధ్యాత్మికసంపన్నులు. ప్రాణధారణకు, దాహశాంతికి నీరు లేక నిముషంకూడా సాగదు. "దప్పికొన్నట్టివారి కా దప్పితీర సలిలపూరంబు హితవో యాజ్యంబు హితవో?" అన్న శ్రీనాథుని వాక్యము మనకు చిరపరిచితమైనదే. "ఉప్పులేని కూర యూనంబు రుచులకు" అన్నారు. ఆ ఉప్పు దేనినుంచి యెక్కువగా చిక్కడం! సముద్రపు నీటినుంచే.

మనం వండే తిండి ప్రతిరకమునకూ నీరే ప్రధానంగా కావలసియున్నది. నీళ్లతోనే కడుగుతారు. నీళ్లతోనే వుడికించుతారు. నీళ్లతోనే పాకశాస్త్రమంతా నిండి నిబిడీకృతమైయున్నది. పానమున కెంత యావశ్యకమో, స్నానమునకున్నూ నీరంత యావశ్యకమే. దానాలు చేసేటప్పుడున్నూ వుదకంతోనే దత్తం చేస్తారు.

మానవుల తత్వంకూడా వారు నివసించే ప్రాంతాలలోని నీటిమీదనే ఆధారపడివుంది. "గోదావరినీరు కవిత్వానికి, కావేరినీరు గణితానికి, సంగీతానికి ప్రసిద్ధి" అని చెప్పుకోవడం తరచుగా వింటూవుంటాము. ఏవూరైనా వదిలిపోవడం తటస్థిస్తే ఆ యూరి "నీళ్ల ఋణం" తీరిం దంటారు. అదేవిధంగా క్రొత్త చోట్లకు వెళ్లినా అక్కడి నీరు తత్వానికి సరిపడిందా, లేదా గమనిస్తాము. క్రొత్తవూర్లకు కాపురం పోయేటప్పుడు యే విషయాలు గమనించమన్నారు తెలుసా? "అప్పిచ్చువాడు, వైద్యుడు, ఎప్పుడు నెడతెగక పారు యేరు" అన్నారు.

వ్యాధులు మాన్పడానికిగూడా నరుడు చాలావరకు నీటిమీదనే ఆధారపడియున్నాడు. కషాయాలు, ఆసవారిష్టాలు నీటితోనే చేస్తారు. ఇంగ్లీషుడాక్టర్ల మిక్చర్లు, టానిక్కులను నీళ్లఅనుపానంతోనే వాడవలెను. "ఔషధం జాహ్నవీతోయం" అన్నారు ఆ మతజ్ఞులు.

ఈ విధంగా నరులు జన్మించింది మొదలు జగత్తును వీడేవరకూ జీవితనాటకంలో నీరు ప్రముఖపాత్ర వహిస్తుంది. మన జీవితనాటకములకు నాందీ, భరతవాక్యమూ నీటితోనే జరుగుతుంది. "నీళ్లాడింది" అంటారు "ప్రసవించింది" అనడానికి కొన్ని ప్రాంతాలవారు. జీవితం ముగిసిపోవడంతో తిలోదకాలు వదిలేస్తారు.

మానవుని మాట అటుంచి, జగత్తే ప్రళయానం తరం నీటినుండి పుట్టుతున్నది. ప్రళయంలో జగన్నాటకం పూర్తియి, సర్వం జలమయంగా మారిపోతుంది.

మొన్న నిలిచిన ద్వితీయమహాసంగ్రామం భూమిమీది అధికారాలకేగాక, నీటిమీద అధికారాలు సంపాదించేటందుకుకూడా అన్న విషయం జగద్విదితం. "అట్లాంటిక్ చార్టరు" అని నీటిపేరు పెట్టి, అట్లాంటిక్ సముద్రంమీదనే ఆ ప్రణాళికను తయారుచేసినందుకు కారణ మేమి? మనం నీటిమీది వ్రాతకు నిలుకడ లేదని నిర్లక్ష్యంచేస్తాము. కాబట్టి అది మనపట్ల అక్షరాలా నీటిమీది వ్రాతగానే చేస్తామన్నారే అందులోని అంతరార్థం. అన్ని దేశాలకూ అనుకూలించిన ఆనాటి అట్లాంటిక్ చార్టరు మన దేశానికి వర్తించకపోయింది. ఇక అయిన పెండ్లికి వేళ్ళ మెందుకులెండి.

ఆధునిక యుగవిజ్ఞానమునకు వింతసొబగు నిచ్చు విద్యుచ్ఛక్తి నీటినుండియే కలుగుతున్నది.

పుణ్యస్థలాలను మాటిమాటికి సేవించడమునకేమంటారు? తీర్థయాత్రలు చేయడం అంటారు. ఎంతటి పవిత్రస్థలమైనా అక్కడి తీర్థాలమీదనే ఆచోటి మహిమ ఆధారపడి ఉంటుంది. "గంగాస్నానఫలం లభేత్" అంటారే గాని "కాశీయాత్రాఫలం"అనరుగదా! అందుకే శివుడు గంగను నెత్తిమీద పెట్టుకొన్నాడు; పార్వతిని ప్రక్కన కూర్చోబెట్టుకొన్నాడు. కాశీకి పోయి గంగను తెస్తేనే గౌరవం. ఈవిధంగానే చాలాచోట్లనుంచి తీర్థం తెచ్చితీరుతారు. "ఆరతులా కావేరి, యువతులా కొల్లడం, నడుమనే శ్రీరంగనాథపురమూ" అని స్త్రీలు పాడగా వింటూవుంటాము. ఎక్కడ్నో ఆకాశంలో గ్రహణం పడితే సముద్రస్నానం చెయ్యమంటారు. ఇదంతా దేనికి? నీటిలో గొప్ప మహత్తు కద్దనియే.

చె. శ్రీ. వెంకటరామయ్య.

---

## అవానీ ద్వీపంలో...

అవానీద్వీపములో రెండు సుందరశైలము లున్నవి. ఒకటి 'నగాటో', రెండవది 'టగానో'. రెండును గౌరీశంకరశృంగోన్నతములు, సంతతహిమాచ్ఛాదిత శిఖరములు, అపూర్వసౌందర్య భాసితములు.

సర్వవేళల, సర్వఋతువుల, సర్వకాలముల యా శిఖరములు వివిధసౌందర్యములు వెలిగ్రక్కును. ప్రాతస్సంధ్యాసమయమున ఉత్తేజితప్రకృతిలో అవి సప్తర్షుల పవిత్రతపఃప్రాంగణములవలె ప్రశాంతసితరోచిస్సులు వెదజల్లును. ఉదితభానుని స్నిగ్ధకాంతులలో ప్రియప్రథమసమాగమవేళ లజ్జావిధురములైన నవవధూ ప్రసన్నవదనములవలె శోభించును. మధ్యాహ్న తీక్ష్ణమార్తాండుని కిరణములలో, తండ్రి యిచ్చిన సర్వాభరణముల రత్నదీధితులు ఉజ్జ్వలములుగా విహరించుచున్న మేనకాదేవి దేహకాంతివలె భాసించును. సాయంసంధ్యాకాలమున శైవకృపాపూర్ణితమైన విభూతి కొండలు కట్టినట్లు, గిరిజాదేవి కృపాపాంగరేఖలు రూపొందినట్లు, వృషభరాజు నందీశ్వరుడు సర్వేశ్వరుని సంధ్యానాట్యదర్శనమున ఒడలుప్పొంగి యానందనృత్యము చేసినట్లు, గంగాదేవి దివినుండి భువి కవతరించినట్లు, గౌరియర్ధభాగము శైవార్ధభాగమున ప్రతిబింబించిన యర్ధనారీశ్వరునిరీతి, మల్లెలు, మొల్లలు, మందారములు, గేదగులు, కాంచనములు, చంపకములు మొదలగు నానాపుష్పవర్ణశోభితములైన శేషిహారములు మేన దాల్చి సంధ్యానృత్యము చేయు నటరాజును బోలి శైవమాహాత్మ్యస్ఫోరకములు, హృదయంగమములునై రాజిల్లును.

చకోరముల కామితలు తర్పించు చంద్రాతపములో వాని యందమే యందము. అమృతము పాలు పెరుగులు సంతతధారగా గ్రుమ్మరిలినరీతిని, ఆకాశవసిగ్గాలు కుప్పలు పోసినట్లు, దివిజకల్లోలినిలో వేయి యైరావతములు జలక్రీడలాడినట్లు ప్రేమైకజీవుల కుద్దీపన విభావములుగా మనోజ్ఞములై యవి రాణించును.

ఆ రెండు శృంగములు నా దేశకవుల కొంగు బంగారము. ఆ చిత్రకారుల భాగధేయములు పండిన పెన్నిధులు. ఆ కళోపాసకుల సంతతోపాస్యదైవతములు. ఆ భావుకుల భావసంపదలకు రూపకల్పనములు.

ఆ భాషలో నీ శిఖరములను కీర్తించు గేయములు కొల్లలు. "చూచిన నగోటాను చూడుము; పోల్చిన టగానోకు పోల్చుము"అన్నది అతిమధురములై శ్రవణపేయములైన వారి జాతీయములలో నొకటి.

నగాటో అనగా శీతలశైలమని యర్థము; టగానో అనగా అగ్నిపర్వత మని భావము. బాహిర దృష్టికి ఎంత ప్రశాంతసుందరముగ గోచరించునో, అంతరంగికముగ టగానో అంత అపాయకరమైనది. కర్ణోపనిషత్తమైన అగ్ని ప్రజ్వరిలి విజృంభించువరకే.

అది విజృంభించి దిగంతముల వ్యాపించును. లక్షలు మరణింతురు; అనంతము, హృదయవిదారకము నగు వినాశనము సంభవించును! టగానో యొక్క సమ్మోహన బాహిరసౌందర్యము సర్వమును తదంతరవిలయాగ్నికి కంచుకము. ఎన్నడా బాడబము బహిర్గతమగునో, భయంకరమైన ప్రకృతిక్రౌర్యమున కెన్నడు బలి కావలసివచ్చునో యని శక్తివిహీనులైన అల్పమానవుడు ప్రాణము లరచేత నుంచుకొని మసలుకొనును.

నగాటో పైసెంతయో లోనంత సహస్రగిరులు విశీర్ణము కానిమ్ము—నగాటో చలింపదు; విలయము రానిమ్ము—కట్టకడను నగాటో నిలిచితీరును. సృష్టి నిలచినంతవరకు నగాటో ప్రకృతికి మండనప్రాయము.

సృష్టి బహుచిత్రసంశోభితము.

* * * *

అవానీద్వీపములో రెండు సుందరశైలము లున్నవి. ఒకటి 'నగాటో', రెండవది 'టగానో'. రెండును గౌరీశంకరశృంగోన్నతములు, సంతతహిమాచ్ఛాదిత శిఖరములు, అపూర్వసౌందర్య భాసితములు.

విశాలావనిలో కూడ ద్వివిధప్రకృతులైన మానవు లున్నారు!

మల్లంపల్లి సూర్యభైరవప్రసాదు.

---

## మ్యాజిక్ స్విచ్‌బోర్డు!

ఒక్కొక్కప్పుడు చూచారూ, మనకు కూచున్న చోటినుంచి కదలమంటే తలకాయ నొప్పిగా వుంటుంది. మరి మనం లేవకుంటే ఆ పనులు జరిగి చావవు. ఇటువంటప్పుడు మనకు ఏదో ఒక రకమైన మంత్రశక్తి వుండి ఆ పనులను ఆశక్తిచేత చేసుకో గలిగిన సామర్థ్యం వుంటే ఎంత బాగుండును? బేషుగ్గా వుండదూ మరి?

“మంత్రాలకు మామిడికాయలు రాలవు స్వామీ! మంత్రా లొద్దు గింత్రా లొద్దు, యంత్రాల శరణు వేడుకోండి” అంటున్నా డొక 'డాలరు మావయ్య'.

ఈ అమెరికన్ విజ్ఞానవేత్త చాలారోజుల నుంచీ చేసిన కృషి ఫలితంగా ఒక క్రొత్త పద్ధతి కనిపెట్టాడు. దీనివల్ల మనం కూచున్న చోటినుంచి కదలకుండా చాలా పనులు సర్దుబాటు చేసుకోవచ్చును.

అయితే ఈ విజ్ఞానవేత్త పేరే మంటారా?

ఇతని పేరు 'కే ఎరిక్ వుడ్'. యుద్ధకాలంలో యితను చాలా యుద్ధ పరికరాలు తయారు చేసేవాడు. యుద్ధం సమాప్తి అయినప్పట్నుంచీ క్రొత్తరకం గృహ పరికరాలను కనుక్కోడానికి యితను కృషిచేస్తూ వచ్చాడు. ఇతని కృషి చాలావరకు ఫలించింది కూడా!

ఈ పెద్దమనిషి పక్కమీదనుంచి లేవకుండా అన్ని పనులూ చక్కబెట్టుకుంటాడు.

ఇతను తన పక్కకు దగ్గరగా ఒక స్విచ్ బోర్డు అమర్చుకున్నాడు. ఆ బోర్డులో వుండే స్విచ్చుల నుపయోగించి తన కోరికలు నెరవేర్చుకుంటా డితను.

ఒక స్విచ్ వేశామంటే పడకగది తలుపు తెరుచుకుంటుంది. అది వెనక్కు లాగాడంటే తలుపు మూసుకుంటుంది.

ఇంకో స్విచ్ సహాయంతో వంటగదిలోని ఎలెక్ట్రిక్ పొయ్యికి నిప్పు అంటిస్తాడు.

మరో స్విచ్ ఉపయోగించి కాఫీ కాచుకోడానికి “స్టౌ” సిద్ధం చేసుకుంటాడు.

మరియొక స్విచ్ వేసుకొని స్నానాల గదిలో నీళ్లు కాస్తాడు.

ప్రతి వుదయమూ రేడియో దానంతట అదే పాటలు ఆరంభించి అతణ్ని నిద్ర లేపుతుంది.

చూచారా, ఈ పెద్దమనిషి పడకమీదినుంచి లేచి కదలకుండా, విద్యుచ్ఛక్తిని తన అడుపాజ్ఞలో పెట్టుకొని, దానిచేత అన్నిపనులూ చేయించుకుంటున్నాడు!

మానవుని ప్రతిభ దినదినానికీ మించిపోతూండడం చూచి సృష్టికర్త ఏమనుకుంటున్నాడోగదా!

చె. రా. మూర్తి.



లేదు. నేఁటి యుచ్చారణములో గొప్పై పెందలయిన ద్విత్వస్థలములయందుఁ దప్ప నితరస్థలములలో నిక్కట ధ్వని (=బంగిచప్పుడు?) లేకుండుటం జేసి లేఖనమున మాత్రమే యొత్తులిడిన వాడుటవలన భాషకు నష్టము లేదు. అట్లు వ్రాయుచున్నవారును గలరు..." (పు ౩౫౩.)

గ్రాంథికభాషావాదమునకు "స్వస్తి" వాచన మయినది.

ఇంక రెడ్డిగారికిష్టమయిన, వారి మహోత్సాహపూరితులఁ జేసిన "ద్రావిడజెండా" మాట.

ద్రావిడజెండాను సోమయాజిగారు నిండు కొయ్యమీఁద నెగురఁబెట్టినారఁట. కాని, ఈ జెండా ఎగురుచున్న యోడ ఒక కొయ్య ఓడ; తెప్పఓడ. మీఁద జెండా ఎగురుటకు మురియుచున్నారేగాని దాని యడుగున పడిన చిల్లిని గమనింపకున్నారేలొకో! ఓడ మునిగిపోవుచున్నది. దానితో జెండాకూడ నగాధజలధిగర్భితము కాఁగలదు.

ద్రావిడవాదమును బయలుదేరఁదీసిన కాల్డువెల్లుకు సంస్కృతము రాదు; ప్రాకృతభాషాజ్ఞానము లేదు. ద్రావిడభాషాజ్ఞానముకూడ నంతిలోనే యున్నది. ఉత్తరహిందూస్థానభాషల సౌకర్య మతనికి లేదు. [illegible]వాసి సిద్ధాంతమున కేఁటిటి విలువ యుండునో [illegible]లభముగ నూహింపవచ్చును. ఆ కాల్డువెల్లును [illegible]కొని [illegible]వాదులాడు శ్రీసోమయాజిప్రభృతుల యవస్థ[illegible] నంతిలోనే యున్నది. కాల్డువెల్లు ద్రావిడ [illegible]ద్ధాంతమునకు నిరూపించిన పరమాదు, పరాకాలు నుపపత్తులను 'ఆంధ్రభాషాచరిత్రము'నఁ బరాస్తములై విధ్వస్తములైనవి. వానిని మరల నిలఁబెట్టవలె నన్న కాల్డువెల్లు వ్రాసిన వాక్యములను మరలమరల నుద్ఘాటించుటవలనమాత్రము కార్యముండదు. శ్రీ సోమయాజిగారీ గ్రంథమునఁ జేసిన దంతకంటె నెద్దియు [illegible]దు. (చూడుఁడు పుటలు ౭౦-౭౫)

'కాదన్నవాఁడు కరణము; వాదడఁచినవాఁడు రెడ్డి'. 'ఆంధ్రభాషాచరిత్ర'కారుని మతమును నిరాకరింపఁ జేసిన ప్రయత్నమీ గ్రంథప్రకటనము. అట్టి నిరాకరణమునకు యోగ్యతయు, శక్తియుఁ గావలె నన్న నేతద్గ్రంథమున వెలసిన కృషికంటె నెక్కువ కృషి కావలెను. ఈ 'ఆంధ్రభాషావికాసము'లో నట్టి కృషియే కాదు, ఎట్టి కృషియుఁ గానరాదు.

'ఆంధ్రభాషాచరిత్ర'కారుని ఆంధ్రభాషాజన్యత్వసిద్ధాంత మా గ్రంథమున ౪౪౦-౪౪౫ పుటలలో నతిసంగ్రహముగా నిరూపింపఁబడినది. దానిని చదివినవారు ఆ గ్రంథకర్తయోగ్యతను చక్కఁగా గ్రహింపఁగలరు. దానిని కాదనుటకు ప్రాకృతభాషలను బాగుగా నభ్యసింపవలెను. శ్రీ సోమయాజిగారికి కొన్ని ప్రాకృతవ్యాకరణముల పేర్లు తెలిసియుండిన నుండవచ్చునుగాని ప్రాకృతభాషాస్వరూపజ్ఞానము కలసినంత లే దని ఘంటాఘోషముగా చెప్పవచ్చును. ఇట్లనుట కొక్క యుదాహరణము చాలును. హాలుఁడు కూర్చిన గ్రంథము 'సత్తసఈ' (సప్తశతీ శబ్దభవము) అని ప్రాకృతభాషాజ్ఞానము గల యెవ్వరికైనఁ దెలియఁగలదు. కాని దాని పేరు 'సత్తాసై' 'సత్తాసై' అని గ్రంథములో పదిసార్లకు పైగా వ్రాసినారు.

ఆ క్రమునకు సంస్కృతప్రాకృతముల మాతృత్వము నీ పచ్చిద్రావిడభాషావాదు లొల్లకుండిన నొల్లకుందురుగాక. తమ వాదమునకైనను నాధారములు భద్రముగా నుండునట్లు చూచుకొనవలదా? ద్రావిడభాషలు స్వయంభువులు కావు. వాని కొక చరిత్ర మున్నది. వానికి సజాతీయములైన యితరభాష లున్నవి. ఇంతవఱకును ద్రావిడభాషావాదు లొప్పుకొందురు. స్వయంభువులు కాకున్న నవి యెందుండి కలిగినవి అను ప్రశ్నమునకు వారు సరియైన సమాధానమింతవఱకుఁ జెప్పలేదు. కాల్డువెల్లు సిథియనుభాషల నుండి యవి కలిగెననెను. ఆవాద మేనాఁడో యెగిరిపోయినది. కావున నిప్పటి ద్రావిడభాషావాదులయిన కాల్డువెల్లనుయాయులు ఘట్టకుటీప్రభాతన్యాయమున తాము తిరిగిన ఆవలయములోనే మరలమరల తిరుగుచున్నారు. "ద్రావిడభాష అని కాల్డువెల్లు నిరూపించిన భాషలన్నియు నేకకుటుంబమునకుఁ జెందినవి" అను విషయమున నెవ్వరికిని విప్రతిపత్తి లేదు—కాని, ఆంధ్రభాషాచరిత్రకారు లా ద్రావిడభాషలు తక్కిన యుత్తరహిందూస్థానార్యభాషలతోఁబాటు సంస్కృతప్రాకృతభాషాజన్యము లనుచున్నారు. దీనిని కాదనువారీ భాషలకు మూలరూప మొకటి యున్నదనియు, దానికి మూలద్రావిడమని పేరనియు, దానినుండియే ద్రావిడభాష లన్నియు నేర్పడిన వనియు నుపపాదించుచున్నారు.

కాని, యీ మూలద్రావిడభాష యనున దేది! దాని స్వరూప మేమి! ఎప్పు డుండెను! ఎక్కడ

యుండెను? దానిలోని ఒక్క వాక్యమునైనను పరిశోధించి, పరిశీలించి, పరిభ్రమించిరైనను నుదాహరింపఁగలరా? దానిని కృతకముగా కల్పించుకొనవలసి యున్న దందురా? ఆ కృతకమూలద్రావిడభాషనైనను నీ ద్రావిడభాషావాద పండితులు కల్పించి ప్రకరణపేయము చేయవలదా? ఊరకే 'మూలద్రావిడము' 'మూలద్రావిడము' అని పదే పదే యనుటవలన నేమి లాభము? తమిళ మీ ద్రావిడభాషలలో నతి ప్రాచీన మని కొందరు తలంతురు. సోమయాజిగారును నట్లే తలంచునట్లున్నది. కాని, ద్రావిడవాదము నారంభించిన కాల్డువెల్లుకూడ నీ ప్రతిపాదనము నంగీకరింపలేదే! ఈ "క్రొత్తవిష్ణువులకే నామములు మెం" డయినవే!

తక్కిన ద్రావిడ భాషావాఙ్మయములతోఁబాటు తమిళభాషావాఙ్మయమును క్రీ. శ. ౯-వ శతాబ్దమునకుఁ దరువాతనే కాన్పించుచున్నది. అయిదవశతాబ్దమునకుఁ బూర్వము తమిళభాషయునికిని నిరూపించు కాలనిర్ణయము సరిగాఁ జేయఁబడియున్న యొక్క యాధారమైనను దమిళభాషాప్రాచీనతావాదులు చూపఁగలరా యని యాంధ్రభాషాచరిత్రకారు లెన్నియేండ్ల క్రిందటనో వేసిన సవాలుకు ప్రత్యుత్తరము వచ్చినట్లు లేదు. సంగము వాఙ్మయము ప్రాచీనమైనది కాదని రొన్నోర్ల యుపపత్తులతో వాయన వ్రాసిన వ్రాఁత నింతవఱకు నెవ్వరును గాదనలేరు సరిగదా, తమిళవిద్వాంసులే యా యభిప్రాయముతో నేకీభవించుచున్నారు. మధుర, తిరునల్వేలి మున్నగు ప్రాంతములలోఁ గనఁబడిన బ్రాహ్మీలిపిలో నున్న శాసనములు తమిళశాసనములు కావనియు, నవి ప్రాకృతశాసనము లనియు వారే నిరూపించిరి. దానిని భాషావిద్వాంసు లెల్లరును నొప్పుకొనియున్నారు.

ద్రావిడభాష లనఁగా దాక్షిణాత్యభాషలు. మనకుఁ దెలిసినంతవఱకు నయిదవ, నాఱవ క్రీస్తుశతాబ్దములవఱకును నవి ప్రాకృతములుగానే యుండినట్లు శాసనములు ఘోషించుచున్నవి. ఇఁక నీ మూలద్రావిడ మన నేమి? అది కృతక మేల కావలెను? ఏభాషయైనను కృతకముగ నెవ్వా రల్లఁగలరు? ఆ మూలద్రావిడ మొక ప్రాకృతభాషగాని, కొన్ని ప్రాకృతభాషలుగాని యై యేల యుండఁగూడదు? అని ప్రశ్నించి యాంధ్రభాషాచరిత్రకారులు గొప్ప కృషి చేసి తమకు రూపించినట్లు సిద్ధాంతముఁ జేసియున్నారు. దానిని కాదనుటకు 'ఆంధ్రభాషావికాసము' లోని వ్రాఁత చాలదు. అది వాదపద్ధతి కాదు, వాదఖండనపద్ధతియుఁ గాదు.

'ఆంధ్రభాషావికాస'మను నీ గ్రంథమున 'ప్రథమకబళే మక్షికాపాతః' అన్నట్టు ఉపక్రమములోనే ఆంధ్రదేశవ్యాప్తిని గుఱించి ముచ్చటించుచు దాని యుత్తరపుటెల్ల 'బారువా' గ్రామమనియు, దక్షిణపుటెల్ల మద్రాసు కుత్తరముగానున్న నెల్లూరుజిల్లాలోని ఉత్తరపుతాలూకా లగుటను, మదరాసులో నాంధ్రుల సంఖ్య తక్కువ యనియు, నెల్లూరుదక్షిణతాలూకాలలోని కాంధ్రులు నవీనముగా ప్రవేశించినా రనియు, తిరుపతి అరవల కుత్తరపు టెల్లయు, నాంధ్రులకు దక్షిణపు టెల్లయునై యెందు చేర్పవలెనో సంశయాస్పదమగునట్లు తెల్పి విడిచినారు. ఈ వ్రాఁత సత్యదూర మగుటయే కాక, ముందు నిర్మింపఁబడఁబోవు నాంధ్రరాష్ట్రమును జాల సంకుచిత పఱుపఁ దోడ్పడఁగల దని గుర్తింపవచ్చును. ఇట్టి అనాలోచితపు వ్రాఁత అధికారస్థానములం దుండి వెలువడి దేశము నెంతయుఁ గలవరపెట్టఁగలవు. ఆంధ్రరాష్ట్రపు టుత్తరపు స్వాభావికపు టెల్ల 'బుషికుల్య' నది యనియు, దక్షిణమున చెంగల్పట్టుజిల్లా దక్షిణపు తాలూకా లనియు, చెన్నపట్టణము, తిరుపగు లన్నట్టాంధ్రదేశభాగము లనియు, నాంధ్రులు చోళరాజుల కాలమునుండి పదునెనిమిదవ శతాబ్దమువఱకు దక్షిణదేశము నాక్రమించి యుండిరనియు, ఉత్తర హైదరాబాదు, మధ్యపరగణాలలోను, దక్షిణ[illegible] మైసూరులోను జాలభాగ మాంధ్రమే యనియు, వీని నన్నిటి నేకఖండముగాఁ జేర్చి విశాలాంధ్రరాష్ట్ర నిర్మాణము చేయవలెననియు నాంధ్రభాషాచరిత్రకారునియు, తదితరమహాశయులయు నభిప్రాయము. ఆంధ్రుల సంఖ్య మూఁడుకోట్ల ముప్పదిలక్షలై యుండి భారతదేశమున వారి భాష మూఁడవస్థానము నాక్రమించుచుండఁగా సంఖ్య ఒక మిలియను లని తగ్గించి చెప్పుటయు 'ఆంధ్రభాషావికాస'కర్తకు సరికాదు. ఇట్టి ప్రమాదికపు వ్రాఁతలే తీరని యపాయములను గలిగించునవి.

ఈ ఆంధ్రభాషావికాసకర్తకు తమిళ మనిన నావేశము పుట్టును. 'అంతా తమిళమయం. జగమంతా తమిళమయం' అని ఒక్కటే పాటను గ్రంథమం దంతటను సాగించినారు.

ఈ గ్రంథములోఁ బాలభాగ మనవసరప్రసంగములతో నిండినది. ఆంధ్రులచరిత్ర మంతగా పెంచవలసిన యావశ్యకత లేదు. ఆంధ్రము, తెలుఁగు, తెనుఁగు, త్రికలింగము, త్రిలింగము, త్రినగము మొదలయిన శబ్దముల విచారమును గూర్చిన చర్చలు పాడి వేంకట[illegible]య్యగారి నలువదియేండ్ల క్రిందటి యాంధ్రాభిరతత్త్వము కాలమునుండియు చెవులు చిల్లులు పడునట్లు గింగురుమనుచున్నవి.

తమిళభాషావాఙ్మయముల దీర్ఘప్రస్తావన యీయాంధ్రభాషావికాసములో నసంగతము, నప్రస్తుతమును.

ఆంధ్రవ్యాకరణగ్రంథముల చరిత్ర మెందుకు చేర్పఁబడినదో, దాని ప్రయోజన మేమియుఁ గానరాదు. ఇట్టి యనేకములయిన యితరవిషయముల ప్రస్తావన యనవసరముగా గ్రంథములోనికిఁ జొచ్చినది.

భాషావికాసవిషయమున నాంధ్రభాషాచరిత్రకారుని గ్రంథములోని విషయములే సంగ్రహముగాఁ [illegible]లుపఁబడినవి. ఆ గ్రంథములోని విషయములు [illegible]యుట, తుద కట్టి కారణములను దెలుపకరే [illegible]సమంజసము కాదుగదా! ఇది కాదని చెప్పక [illegible]ంగదా! "యని యొక చెంపు చెంపకి విడుచుట— [illegible] ఈ గ్రంథకర్త యవలంబించిన పద్ధతి. గ్రంథకర్త [illegible] యొక్క [illegible]టియుఁ బ్రత్యేకింపఁదగిన దిందు [illegible]దు.

"దేవదత్త భట్టాచార్య."

---

## గ్రంథ స్వీకారము

**Song of the Emancipated Self**

రచయిత: టంగుటూరి శ్రీరాములుగారు. ప్రకా[illegible]లు: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు, [illegible]ద్రాసు ౧. వెల ౮ అ.

**హిందీ భాషా బోధిని**

రచయిత: యం. విశ్వనాథంగారు. ప్రకాశకులు: టి. బాలనాగయ్యశెట్టిగారు, కర్నూలు. వెల ౮ అ.



Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., G. T., Madras. Editor—S. Sambhu Prasad.

లిప్టన్స్

అంటే అర్థం

మంచి

టీ




LTK 132 G-TG

# ఇంటి ఇల్లాలుగా ఉండడం తమాషా కాదు



నౌకర్ల జీతాలు ముందు కన్నా రెండు రెట్లు పెరిగినవి. కూరగాయల ధరలు మామూలు కన్నా మూడు నాలుగు రెట్లు ఎక్కువయినవి—పండ్లు దొరకటం లేదనే చెప్పవచ్చు—చాకలి సరిగా రాదు—వంటవాండ్ల ఖర్చు ఎప్పటికప్పుడు పెరిగిపోతున్నది—అందువల్ల, ఇల్లాలి జీవితం లెక్కలేనన్ని చిక్కులతో నిండి ఉంది. ఇన్ని యాతనలనూ ఆమె ఉత్సాహంతో ఎదుర్కొనవలసి ఉంది. ఇందుకుగాను ఆమెకు అప్పుడప్పుడు ఒకకప్పు మంచి టీ కావాలి. ఆమె నలిగిపోయిన నరాలకు ఉపశాంతి కలిగించటానికి, అలసిపోయిన ఆమె మనస్సుకు ఉల్లాసం యివ్వటానికి, గృహసమస్యలను తొలగించటానికి కావలసిన బలం యివ్వటానికి దీనివంటిది మరొకటి లేదు.

## మంచి టీ తయారుచేసే విధం:



1. మీరు టీని కెటిలులో కాచవద్దు. కాచటానికి టీపాత్రను ఉపయోగించండి.
2. మీరు పొడి టీ వేసేటప్పుడు టీ పాత్ర వెచ్చగాను, పొడిగాను ఉండాలి.
3. ఒక్కొక్క కప్పు టీకి ఒక్కొక్క టీస్పూను క్రొత్త ఎండు టీ ఆకును వేయండి. పాత్రకు గాను ఒక స్పూను అధికంగా వేయండి.
4. ఎప్పుడూ అప్పుడు కాగుతూ ఉన్న నీటిని ఉపయోగించండి. కొంతసేపటికి ముందు కాచిన నీటినిగాని, తక్కువగా కాగిన నీటినిగాని, మరీ ఎక్కువగా కాగిన నీటినిగాని ఉపయోగించరాదు. నీరు తెర్లితే కాగినట్లు; తెర్లకముందు పనికిరాదు.
5. టీ ఆకు వేడినీటిలో ఊరవలసిన కాలం అయిదు నిమిషాలకు తక్కువగా ఉండరాదు.
6. టీ పాత్రలో ఉండగానే పంచదార, పాలు కలపవద్దు. కప్పులలో పోసిన తరువాతనే పాలు, పంచదార చేర్చండి.

# టీ

ఏసమయమైనా టీసమయమే

ఇండియన్ టీ మార్కెట్టు ఎక్స్‌పాన్షన్ బోర్డువారి ప్రకటన

IR 273 TG